# బహుముఖ ప్రజ్ఞాశాలి
# బూర్గుల
## (బూర్గుల రామకృష్ణారావు జీవిత చరిత్ర)

రచన

డి. రామలింగం



తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు

BAHUMUKHA PRAJNASALI BURGULA,
a biography of Burgula Ramakrishna Rao,
by D. RAMALINGAM

---

తెలుగు విశ్వవిద్యాలయం,
హైదరాబాదు - 500 004.

ప్రథమ ముద్రణ : మార్చి 1989

ప్రతులు : 1000

వెల : రూ. 10/-

ముఖచిత్రం : శీలావీర్రాజు

ప్రతులకు :
తెలుగు విశ్వవిద్యాలయం,
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాదు - 500 004.

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,
హైదర్‌గూడ, హైదరాబాదు-500 029.

# ప్రకాశక విజ్ఞప్తి

కేవల సాహిత్యమే కాక సాహితీ చరిత్రకారుల జీవిత విశేషాలు కూడా అక్షరాకృతిని పొంది, సాహిత్యంలో భాగంగా చేరుతూ ఉంటాయి. వీటిని మనం జీవిత చరిత్రలకు సంబంధించిన సాహిత్యంగా చెప్పుకోవచ్చు. తెలుగు జాతికి అపారమైన సాహిత్య చరిత్ర ఉన్నప్పటికీ జీవిత చరిత్రలు రాశిలో తక్కువే అని చెప్పాలి.

ఆ లోటును తీర్చడానికి మాత్రమేకాక, వర్తమాన భావితరాలకు వీటి ద్వారా స్ఫూర్తిని, ఉత్తేజాన్ని కలిగించాలనే దృష్టితో కూడ ఆధునికకాలంలో- ముఖ్యంగా ఇటీవలి కాలంలో- తమ ప్రతిభా విశేషాలచేత ఆయా రంగాలను ప్రభావితం చేసిన మహనీయుల జీవిత చరిత్రలను వెలువరింపజేయాలనే స్పృహ సాహితీ లోకంలో పరివ్యాప్తమైంది.

తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణల విభాగం కూడా తన పరిధిలో ఈ మేరకు కృషి సలుపుతోంది. లోగడ గిడుగు రామమూర్తి, గిడుగు సీతాపతి, త్రిపురనేని రామస్వామి, నార్ల, ఆర్కాట్ సోదరులు, వేటూరి ప్రభాకరశాస్త్రి, ఇక్బాల్ వంటి వారి జీవిత చరిత్రలను లఘు గ్రంథాలుగా వెలువరించడమైంది. ఆ పరంపరలో భాగంగా అటు రాజకీయ రంగంలోను, ఇటు సాహితీ వ్యాసంగంలోను అద్వితీయమైన ప్రజ్ఞా పాటవాలతో తమదైన ఒక స్థానాన్ని ఏర్పరుచుకొన్న కీ.శే. బూర్గుల రామకృష్ణారావు గారి జీవిత చరిత్రను ప్రకటింప జేయాలని భావించడం జరిగింది. దీని రచనా బాధ్యతను ప్రముఖ రచయితలు శ్రీ డి. రామలింగం గారికి అప్పగించడమైంది. మా అభ్యర్థన మేరకు వారు దీనిని రచించి, సకాలంలో మాకు అందించి, మాతో సహకరించారు. ఇందుకు వీరికి మా మనః పూర్వకమైన కృతజ్ఞతలు. సందర్భోచితమైన సన్నివేశాలకు,

సముచితమైన సంఘటనలకు కావలసిన ఫొటోలు అందించి, అవి కూడా ఈ పుస్తకంలో ముద్రించడానికి అవకాశం కల్పించిన కీ.శే. బూర్గుల రామకృష్ణా రావుగారి కుమారులు శ్రీ బూర్గుల రంగనాథరావు, శ్రీ బూర్గుల లక్ష్మీనారాయణ రావు గార్లకు మా ప్రత్యేక ధన్యవాదాలు.

ఈ పుస్తకం చదువరులను అలరింపజేయగలదని ఆశిస్తున్నాం.

తేదీ: 3-3-1989,
హైదరాబాదు-500 004.

ప్రకాశకులు,
**తెలుగు విశ్వవిద్యాలయం**

# రచయిత మనవి

ఈ జీవిత చరిత్రను నేను రచించడానికి ముఖ్య కారకులు తెలుగు విశ్వ విద్యాలయం వైస్ ఛాన్స్‌లర్ గౌరవనీయులు ప్రొఫెసర్ తూమాటి దొణప్పగారు. లేకపోతే పుస్తకాలు చదివి తృప్తి చెందడమే కాని, రచనలు చేయడంలో ఉత్సాహం చూపని నేను ఈ పుస్తకం వ్రాయగలిగే వాణ్ణికాను. ఒకరోజు నేనూ, నా మిత్రులు బూర్గుల రంగనాథరావుగారూ తెలుగు విశ్వవిద్యాలయానికి వెళ్ళి శ్రీ దొణప్ప గారిని దర్శించి కీ. శే. బూర్గుల రామకృష్ణారావుగారు రచించిన 'పారసీక వాఙ్మయ చరిత్ర'ను వారి విశ్వవిద్యాలయం తరఫున ప్రచురించవల సిందని అభ్యర్థించగా, వారు వ్రాతప్రతిని చూచి "అలాగే వేస్తాము. కాని మీరు బూర్గులవారి జీవిత చరిత్రను వ్రాసి మా కివ్వాలి. దానిని కూడా ప్రచురిస్తాము. రెండు పుస్తకాలూ ఒకే రోజున విడుదల చేస్తాము" అని నాతో అన్నారు. వారి ఆదేశమే నా చేత ఈ పుస్తకాన్ని రచింపచేసింది. వారికి నా కృతజ్ఞతలు తెలుపు కుంటున్నాను. ఆచార్య దొణప్పగారు మరొకందుకు కూడా స్తవనీయులు. "బూర్గుల రామకృష్ణారావుగారు రచించిన పారసీక వాఙ్మయ చరిత్ర ఇంకను వెలుగు చూడవలసి ఉన్నది" అని అందరూ దాదాపు నలభైయేండ్ల నుంచి అనడమే కాని, దాని వ్రాతప్రతిని సంపాదించి ప్రకటించే ప్రయత్నం తెలం గాణాలో ఎవరూ చేయలేదు. అట్టి స్థితిలో శ్రీ దొణప్పగారు వ్రాతప్రతిని వారికి చూపిన తక్షణమే దానిని ప్రకటింప నిర్ణయించడం హైదరాబాదు వాసులకు ఆనందదాయకమైన విశేషం. నే నెరిగినంతవరకూ తెలుగులో ఫారసీ వాఙ్మయ చరిత్ర ఈ రూపంలో ఇంతవరకూ వెలువడలేదు.

బూర్గులవారి జీవిత చరిత్ర వ్రాస్తానని తెలిసి ఉంటే 1950-60 ప్రాంతా లలో ఇంకా ఎంతో సామగ్రిని సమకూర్చుకొని ఉండేవాడిని. వారు హైదరాబాదు ముఖ్యమంత్రిగా ఉన్న 1952-56 కాలంలో నేను హైదరాబాదు ప్రభుత్వ సమా చార పౌరసంబంధ శాఖలో పనిచేస్తూ, వారి ప్రభుత్వం చేపట్టిన ప్రజాభ్యుదయ కార్యకలాపాలకు తగు ప్రచారమిస్తూ; కవి సమ్మేళనాలలో వారు కవిత్వం చదివి

నప్పుడు వింటూ, బహు భాషలలో వారు చేసే ప్రసంగాలకు శ్రోతనై లేఖకుడనై కాలం గడిపాను. అంతకు పూర్వం 1946-48 ప్రాంతంలో హైదరాబాదు స్వాతంత్ర్య సమరంలో స్టేట్ కాంగ్రెసు ఆధ్వర్యాన జరిగిన ఉద్యమంలో పని చేశాను. మేధావిగా, బహుభాషావేత్తగా, జాతీయోద్యమ నాయకుడుగా, రచయితగా ఆయనంటే సర్వులకూ ఎంతో అభిమానం ఉండేది. ఆయనతో కూర్చుని పిచ్చా పాటీ మాట్లాడుతూ ఉంటే అనేక విషయాలు తెలియవస్తుండేవి. సర్వతోముఖ మైన ప్రతిభ వారిది. ఆయన ఎంతటి రాజనీతిజ్ఞుడో అంతటి సాహితీవేత్త. పైగా ఎప్పుడూ ఏదో ఒకటి వ్రాసే గుణం వారికి ఉండేది. ఆయన ప్రధానంగా సాహితీపరుడు. ఆ తర్వాతనే రాజకీయాలు, ప్రజాసేవ. అటువంటి బహుముఖీన వ్యక్తిత్వాన్ని చిన్న చరిత్రలో పొందుపరచడం కష్టమే. పైగా కొన్ని రికార్డులూ లేవు; నిర్దిష్టంగా వారి వ్యక్తిత్వాన్ని గూర్చి చెప్పగల వారి సన్నిహితులూ ఇప్పుడు లేరు. అయితే రామకృష్ణారావుగారి పెద్ద కుమారులైన బూర్గుల రంగ నాథరావుగారు తాము భద్రపరిచి ఉంచిన తండ్రిగారి రచనలనూ, ఇతర రికార్డు లనూ నాకు అందజేయడమేగాక, వారి కుటుంబ సమాచారాన్ని తెలిసినంతవరకూ నాకు తెలిపి ఈ జీవిత చరిత్ర రచనకు తోడ్పడినారు. వారి సహాయంవల్లనే దీనికి సమగ్రత కలిగింది. వారికి నా కృతజ్ఞతలు. 1990 రాబోతూ ఉన్న నేడు బూర్గులవారి జీవిత చరిత్ర వ్రాయబూనడం too late అని చెప్పవలసిన ప్రయత్నం. అయితే ఇంగ్లీషులో Better late than never అంటారు. కొండ అద్దంలో కొంచెంగా ఉన్నట్లు ఆ మహావ్యక్తిత్వం దిఙ్మాత్రంగానైనా ఈ పుస్తకంలో ప్రతిబింబిస్తే నా కృషి ఫలించినట్లే. తెలుగు విశ్వవిద్యాలయా ధ్యక్షులకు మరొకమారు నా కృతజ్ఞతలు.

March 1, 1989,

H. No.1-8-726/30,
Nallakunta,
HYDERABAB-44

డి. రామలింగం
గ్రంథకర్త

# విషయసూచిక

# బహుముఖ ప్రజ్ఞాశాలి

తెలుగుజాతి సగర్వంగా చెప్పుకోగలిగిన మహాపురుషులలో బూర్గుల రామకృష్ణారావుగారు అగ్రేసరులు. ఆయన విద్యాధికులు. విద్యార్థి దశలోనే అనన్యమైన శేముషిని ప్రదర్శించి తల్లిదండ్రులను ఆనందపరచి, బంధుమిత్రుల మన్ననలందుకున్నారు. ఆయన అకలంక జాతీయవాది. జాతీయతా భావాలకు బద్ధశత్రువైన నిజాం నిరంకుశ ప్రభుత్వ కాలంలో ఖద్దరు ధరించి, జాతీయ కాంగ్రెసు సంస్థను అభిమానించిన వ్యక్తి. యౌవన ప్రాదుర్భావంనుంచే ప్రజాహిత చింతనాపరుడు. దేశభక్తాగ్ర గణ్యుడు. న్యాయవాద శిరోమణి. రాజ్యాంగ సమ్మత మార్గానుయాయి (Constitutionalist). స్వాతంత్ర్య సమర యోధుడు. బహు భాషా కోవిదుడు. తెలుగు, ఉర్దూ, ఇంగ్లీషు, సంస్కృత, హిందీ భాషలలో రచనలు చేసిన ప్రతిభా సంపన్నుడు. ఫారసీ భాషలో పాండిత్యం గడించిన విద్వన్మణి. ఒక హైస్కూలులో పర్షియన్ బోధించే ఉపాధ్యాయుడిగా పనిచేసిన ఆంధ్రుడు బహుశ ఈయన ఒక్కరేనేమో. తెలుగు, ఉర్దూ, ఫారసీ సాహిత్యాలను కూలంకషంగా అధ్యయనం చేసిన సాహితీవేత్త. మరాఠీ, కన్నడ, హిందీ భాషలలో చక్కని ప్రవేశం కలిగిఉండి, వాటిలో చక్కగా సంభాషించ గలిగిన ధీశాలి; కవి, రచయిత, రసజ్ఞుడు, చక్కని విమర్శకుడు. రాజకీయ రంగంలో చాకచక్యంతో, దూరదృష్టితో వ్యవహరించిన రాజనీతిజ్ఞుడు. తాను ఫ్యూడల్ కుటుంబంలో పుట్టి కూడా పురోగామియై, నవతాకామియై, హైదరాబాదు మధ్యయుగాల ఫ్యూడలిజం చీకటి తెరలను తొలగించి, భూమి అమరిక విధానంలో విప్లవాత్మకమైన సంస్కరణలు ప్రవేశపెట్టి, దేశంమొత్తంలోనే అగ్రగామియై నిలిచిన అభ్యుదయవాది. మంత్రిగా, ముఖ్యమంత్రిగా, పరిపాలనాదక్షుడుగా వీనుమిగిలిన చతురమతి. హైదరాబాదు రాష్ట్ర ప్రప్రథమ ప్రజా ముఖ్యమంత్రి. ఎన్నడో 17వ శతాబ్దిలో గోల్కొండ కుతుబ్‌షాహీ రాజుల కాలంలో మాదన్నగారు మహామంత్రిగా పని

చేసి చరిత్ర కెక్కారు. ఆయన 1686 లో మృతిజెందినారు. ఆ తరువాత రెండు వందల అరవై ఆరు సంవత్సరాలకు హైదరాబాదు ముఖ్యమంత్రిగా మరొక ఆంధ్రుడు బూర్గుల రామకృష్ణారావుగారు పదవిని స్వీకరించి రమారమి అయిదేళ్ళ పాటు ప్రజారంజకంగా పాలించడం తెలుగుదేశ చరిత్రలో ఒక మహత్తర సంఘటన. ఈ చారిత్రక సన్నివేశం ఆంధ్రులకు చిరస్మరణీయమైనది. అడుగడుగుకూ జ్ఞాపకమొచ్చేది. ఆ పదవినుండి విరమిస్తూ ఆయన ఒక గొప్ప అనన్యమైన పదవీ పరిత్యాగం చేసి త్యాగ సంపన్నతను ప్రదర్శిస్తూ, సరియైన తరుణంలో ఒక్క చివరి మాటతో రెండువందల ముప్పైరెండు సంవత్సరాల క్రితం ఏర్పడ్డ ఆసఫియా రాజ్యాన్ని మూడు ముక్కలు చేసి, దాని తెలుగు, మహారాష్ట్ర, కన్నడ ప్రాంతాలను ఆయా భాషా ప్రాంతాలతో కలిపివేయడానికి, ఆయా భాషలు మాట్లాడే ప్రజల చిరకాల అభీప్సితం నెరవేరడానికీ, భారతదేశ పటము నుంచి స్వాతంత్ర్యానంతరం భారత యూనియనులో చేరడానికి నిరాకరించిన ప్రజా వ్యతిరేక, నిరంకుశ, మతోన్మాదం పూర్వరంగంగా గల హైదరాబాదు అనబడే భౌగోళికమైన అస్తిత్వాన్ని తుడిచివేయడానికి ముఖ్య కారకులవడమే కాక, మహాంధ్రావతరణకు కూడా ఆయన పథనిర్మాతలైనారు. ఈ కార్యసాధనలో ఆయన కాంగ్రెసు అధిష్ఠానవర్గంలో సీనియర్ నాయకుడైన మౌలానా అబుల్ కలాం ఆజాద్‌ను ఎదిరించి, తెలుగుజాతికి సహజమైన వీరతా లక్షణాన్నీ, శౌర్య పరాక్రమాలనూ ప్రదర్శించారు. ఆజాద్ మాటను నెహ్రూయే కాదనలేకపోయే వారు. హైదరాబాదు రాష్ట్రాన్ని యథాతథంగా ఉంచడం ఆజాద్ అభిమతం. అది కృత్రిమ అస్తిత్వమని రామకృష్ణారావుగారి వాదం. అది ఎప్పటికైనా భారత దేశానికి ప్రమాదకరమని ఆయన చేసిన హెచ్చరిక. ఇది ఆంధ్రుల చరిత్రలోనే గాక మహారాష్ట్ర, కన్నడ భాషల ప్రజల చరిత్రలో కూడా శాశ్వతంగా నిలిచిపోయే రాజకీయ ధౌరంధర్యం. రామకృష్ణారావుగారు తెలుగు, ఉర్దూ, ఇంగ్లీషు భాషలలో మంచి వక్త. గొప్ప పార్లమెంటేరియను. ప్రజాస్వామ్యాన్నీ, పార్లమెంటరీ సంప్రదాయాలనూ ఎల్లప్పుడూ మన్నిస్తూ వచ్చిన రాజకీయవేత్త. రాష్ట్ర శాసనసభలో ఉత్తమ పార్లమెంటరీ సంప్రదాయాలను నెలకొల్పిన ఘనత ఆయనకే

చెందుతుంది. రాష్ట్ర రాజకీయ రంగంనుండి నిష్క్రమించిన తరువాత కేరళ, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాల గవర్నరుగా ఆ ప్రాంతాల ప్రజలకు ఆయన ప్రియతము లైనారు. పార్లమెంటు సభ్యులుగా (రాజ్యసభ సభ్యులు) కొంతకాలం ఉన్నారు. కాని ఆ దశలో ఇటువంటి ప్రజ్ఞావంతుని సేవలను కేంద్రంలో వినియోగానికి తెచ్చుకోలేక పోవడం కాంగ్రెసు నాయకత్వం యొక్క వైఫల్యమేగాని వీరి లోపం కాదు. బుద్ధి సూక్ష్మతతో, విజ్ఞతతో, రాజకీయ చతురతతో క్లిష్ట సమస్యలను పరి ష్కరించడంలోనూ, విభిన్న భాషా, మత, కుల వర్గాలమధ్య సామరస్యాన్ని పరి రక్షించడం లోనూ, భారతీయ మిశ్రమ సంస్కృతి వైశిష్ట్యాన్ని గుర్తించడం లోనూ, ఆధునిక సంస్కార సభ్యతలకు మన్నన ఇవ్వడంలోనూ, హైందవ సంప్రదాయానుగుణంగా జీవించి, జీవితంలోని ఉత్తమ అనుభవాలను కరగతం చేసుకొని, నిండుగా జీవించి, వైయక్తిక జీవితాన్ని భక్తికి నిలయంగా చేసుకొని, ప్రజాహిత జీవితం నుంచి విరమించుకున్న తరువాత శేషజీవితాన్ని ఆధ్యాత్మి కతతో గడపడంలోనూ ఆయన ఈ తరం వారికి ఆదర్శప్రాయుడు.

ఒకప్పుడు ఆంధ్రులది బహు నాయకత్వమనీ, తెలుగు ప్రజల శ్రేయోభి వృద్ధుల విషయంలో కూడా వీరిలో ఏకవాక్యతలేదనీ విచారించాము. రాజకీయంగా, భౌగోళికంగా, సిరిసంపదల విషయకంగా ఎంతో నష్టపోయాము కాబట్టి అలా చింతించడం సహేతుకమే. కాని ఇప్పుడు ఇంతదూరం నుంచి మరొక విధంగా సింహావలోకనం చేసుకుంటే తెలుగు నాయకులలో కనిపించే ప్రతిభా వైవిధ్యం, బహుముఖ ప్రజ్ఞా ప్రాభవాలు ఇతర ప్రాంతాలలో అంతగా కన్పించవు. కన్పించినా ఈ ఔన్నత్య శిఖరాలు అక్కడ కనపడవు. ఈ గాఢత్వం, వైశాల్యం అక్కడ లేవు. ప్రకాశంగారి ధైర్యసాహసాలు, త్యాగ సంపన్నత, డా॥ పట్టాభి సీతారామయ్యగారి మేధా ప్రాగల్భ్యం, ఆర్థిక విషయాలపై వారి శ్రద్ధాసక్తులు, సంజీవరెడ్డిగారి లోకజ్ఞత, రాజకీయ ధీశక్తి, బెజవాడ గోపాలరెడ్డిగారి సరస హృదయత, సంస్కారము, ఇంకా వెనక్కి వెళ్ళితే కొండా వెంకటప్పయ్య, మాడపాటి హనుమంతరావు మున్నగు మహనీయుల దేశసేవా తత్పరత ఎన్నటికీ

చెరిగిపోని గుణ విశేషాలుగా ద్యోతకమవుతాయి. సర్వేపల్లి రాధాకృష్ణన్, వరహ గిరి వెంకటగిరి వారి వారి రంగాలలో సాధించిన విశేషాలు అంతర్జాతీయ ప్రశంసలకు పాత్రమైనవి. ఈ దృష్ట్యా చూస్తే హైదరాబాదు రంగంలో బూర్గుల రామకృష్ణారావుగారు రాజకీయ, విద్యా, సాహితీ, సాంస్కృతిక క్షేత్రాలలో జ్యోతిర్మయుడు, చరిత్ర కెక్కిన చరితార్థుడు. నాలుగు భాషలకు చెందిన సమకాలికు లందరిచేత ఏకాభిప్రాయంగా ప్రతిభాశాలి అని ప్రశంసలందుకున్న మేధావి. అలనాటి హైదరాబాదు రాష్ట్రంలో ప్రతిభ, యోగ్యతల ప్రసక్తి వచ్చినప్పుడు అన్ని భాషలవారూ వీరి పేరు మొదట చెప్పేవారు.

# జననం, విద్యాభ్యాసం

బూర్గుల రామకృష్ణారావుగారు 1899 మార్చి 13వ తేదీన (వికారి నామ సంవత్సర ఫాల్గుణ శుద్ధ విదియ, సోమవారం, రేవతీ నక్షత్ర చతుర్థ చరణ యుక్త మకర లగ్నం) మహబూబ్‌నగర్ జిల్లా కల్వకుర్తి తాలూకా పడకల్లు గ్రామంలో మాతామహులైన వెల్దండ శేషగిరిరావు గారి ఇంట జన్మించారు. వీరి తల్లిదండ్రులు రంగనాయకమ్మ నరసింగరావుగారలు. వీరి ఇంటిపేరు పుల్లంరాజు. అయితే రామకృష్ణారావుగారు పూనా నగరంలో ఉన్నత విద్యాభ్యాసం చేసే రోజులలో మహారాష్ట్రుల సంప్రదాయాన్ని అనుసరించి తమ గ్రామ నామాన్నే ఇంటిపేరుగా పెట్టుకొని 'రామ్‌కిషన్‌రావు బూర్గుల్' అని వ్రాసుకున్నారు. ఆ విధంగా వీరు బూర్గుల రామకృష్ణారావుగా వ్యవహరింపబడుతూ వచ్చారు. వీరి తరం మొదలుగా అసలు ఇంటిపేరు మరుగునపడిపోయి 'బూర్గుల'యే ఇంటిపేరైంది. వీరి కుమారులు, మనుమలు, దీనినే ఇంటిపేరుగా పెట్టుకున్నారు. వీరి స్వగ్రామం బూర్గుల. ఇది మహబూబ్‌నగర్ జిల్లా షాద్‌నగర్ తాలూకాలో ఉంది. ఈ గ్రామంలో ఒకప్పుడు బూరుగుచెట్లు విస్తారంగా ఉండటం వల్ల గ్రామానికా పేరు వచ్చి ఉంటుందని రామకృష్ణారావుగారే ఒక సందర్భంలో ఊహించి చెప్పారు. వీరు నియోగి బ్రాహ్మణులలో గోలకొండ వ్యాపారుల తెగకు చెందినవారు. కౌండిన్యస గోత్రులు. ఆపస్తంభ సూత్రులు. యజుశ్శాఖవారు. రామకృష్ణారావుగారి ముత్తాతగారైన పెద నరసింగరావుగారు కవి. వారి ఇలవేల్పు అయిన ప్రతాపగిరి నరసింహస్వామిపై వారొక శతకం వ్రాశారు. ఆ కాలంలో ఫారసీ రాజభాష కావడంచేత వారు ఫారసీ భాషలోనూ, గృహ సంస్కృతికి పట్టుకొమ్మలైన సంస్కృతాంధ్రాలలోనూ మంచి వైదుష్యం కలవారని పేరుపొందారు. వారు నిజాం రాజుకు మంత్రిగా ప్రసిద్ధిచెందిన రాజా చందూలాల్‌గారి బంధువగు రాజా రామ్‌బక్ష్ అనే వారివద్ద ముఖ్య గణకులుగా ఉండినట్లు తెలియవస్తున్నది. పెద నరసింగరావుగారి తమ్ముడు చినరామకృష్ణారావు కందనూలులో రెవిన్యూ ఆఫీసరుగా పనిచేశారు. వారి కుమారులు లక్ష్మీకాంతరావు తాటిచెట్టుక్రింద నీడ చూచి చెట్టుపైని కాయను బాణంతో కొట్టేవారట!

పెద నరసింగరావుగారి కుమారుడు అనంత నరసింహారావు ఫారసీ, తెలుగు భాషలలో చక్కని ప్రవేశం కలిగినవారు. విద్యాదానం చేసి పేరు ప్రతిష్ఠలు పొందినవారు. రామకృష్ణారావుగారి తండ్రిగారు తెలుగు, ఫారసీ, ఉర్దూ భాషలలో పండితులు. ఈ మూడు భాషలను చక్కని దస్తూరితో వ్రాసేవారు. అంతటి మంచి దస్తూరి రామకృష్ణారావుగారికీ, వారి తమ్ముడు వెంకటేశ్వరరావుగారికీ తెలుగు, ఉర్దూ, ఇంగ్లీషు భాషలలో అలవడింది. వీరి తల్లిదండ్రులది వైష్ణవ సంప్రదాయం. తండ్రి నరసింగరావుగారు ఇంట్లో దేవుని గదిలో పాంచరాత్ర ఆగమపద్ధతి ప్రకారం నిత్యమూ ఆరాధన చేసేవారు. పాంచరాత్ర ఆగమ పూజా విధానంలో పల్లాండు మొదలుగాగల వైష్ణవ ప్రాబంధిక ప్రార్థనలు నరసింగ రావుగారికి కంఠతా వచ్చేవి. వారి భార్య రంగనాయకమ్మగారు అంటే బూర్గుల వారి తల్లి-శ్రీమద్రామానుజుల విరచితమైన గద్యత్రయము (శ్రీరంగ గద్యము, శరణాగతి గద్యము, వైకుంఠ గద్యము), స్తోత్రరత్నమనబడే ఆళవందారు స్తోత్రము-వీటిలో ఏ రెండు అయినా చదవనిదే భోజనం చేసేవారుకారు. ఆమె గొప్ప భక్తురాలు. నరసింగరావుగారు షేర్వానీ వేసుకున్నా, ఊర్ధ్వపుండ్రములు ధరించేవారు. ఈ దంపతులిద్దరూ అహోబల పీఠాధిపతుల శిష్యులు. చక్రాంకి తాలు వేయించుకున్నారు. తమ కుమారులిద్దరికీ, మనుమడికీ కూడా వేయించారు.

రామకృష్ణారావుగారు మొదట వీథిబడిలో పెద్దబాలశిక్ష, కృష్ణ శతకం, సుమతి శతకం, నరసింహ శతకం చదివారు. పెద్ద ఎరుసులు (లెక్కలు), చిన్న ఎరుసులు నేర్చుకున్నారు. ఇంట్లో తండ్రిగారు వీరికి భారత, భాగవత పద్యాలు చదివి వినిపించి ఆ గ్రంథాలపై వీరికి శ్రద్ధాశక్తులు కలుగజేశారు. ఆ కాలంలో రాజభాష ఉర్దూ కాబట్టి కుమారునికి ఉర్దూ ఫారసీ భాషలు తాము నేర్పడమేకాక ఇంటివద్ద ట్యూషన్ కూడా పెట్టించి ఆ రెండు భాషలు, వాటి సాహిత్యాలు వీరికి క్షుణ్ణంగా నేర్పించారు. వీధిబడిలో చదివేటప్పుడు పలకపై సున్నం వ్రాసి, దాని మీద ఉర్దూవ్రాత అభ్యాసం చేసేవారట. నరసింగరావుగారికి కొద్దిగా ఇంగ్లీషు కూడా వచ్చి ఉండటం చేత, వారు ఆ కాలపు మిడిల్ (థర్డు ఫారం) వరకూ చదివి ఉండటంచేత తమకు వచ్చినంతవరకూ కుమారునికి ఇంగ్లీషు కూడా చెప్పారు

నరసింగరావుగారికి బూర్గుల గ్రామంతో కలిపి కొన్ని ఊళ్ళ దేశపాండ్యా గిరి, కరణీకము ఉండేవి. అంటే మక్తాగా ఆ ఊళ్ళను వీరికిచ్చారు. బూర్గుల (ఖస్బా) ముఖ్య గ్రామముకాగా,చింతగూడెం, కాశిరెడ్డిగూడెం, పీర్లగూడెం, నేరెళ్ళ చెర్వు వగైరా గ్రామాలు మజరాలు (Hamlets), లేక చిన్న పల్లెలు. వీటికి జాగీర్దారు నవాబ్ ఫతెహ్యాబ్‌జంగ్, అతని కుమారుడు సరఫరాజ్ అలీఖాన్. నరసింగరావుగారికి పెద్దాయపల్లి, గౌతాపురం, కుత్సరకల్ సేరీలుగా (అంటే సేవలేమీ చేయనక్కరలేకుండానే వీరికి ఇవ్వబడ్డ ఈనాములు) ఉండేవి. నరసింగ రావుగారికీ, జాగీర్దారుకూ మక్తాకు సంబంధించిన న్యాయసంబంధమైన లిటిగేషన్ ఏర్పడింది. నరసింగరావుగారు వాదిగా, జాగీర్దారు నవాబ్ ఫతెహ్యాబ్ జంగు, అతని కుమారుడు సర్‌ఫరాజ్‌అలీఖాన్ ప్రతివాదులుగా 1332 ఫసలీ నుండి 1347 ఫసలీవరకూ దాదాపు పదిహేనేళ్ళు వ్యాజ్యం సాగింది. ఈ మక్తా ప్రభుత్వం నుంచి వచ్చిందనీ, కాబట్టి మక్తా పన్ను ప్రభుత్వానికే చెల్లించాలనీ పుల్లంరాజు వంశంవారి వాదం. కాదు, ఈ మక్తా నేను ఇచ్చాను, నాకే పన్ను చెల్లించాలని జాగీర్దారు వాదం. ఇదీ వ్యాజ్యం విషయం. ఈ వ్యాజ్యం కారణంగా పుల్లంరాజు వారి కుటుంబానికి వచ్చే ఆదాయాన్ని ప్రభుత్వం సస్పెన్షన్‌లో ఉంచింది. చాల వరకు నరసింగరావుగారే భాగస్తులందరి తరఫున ఆ వ్యాజ్యంలో కోర్టులకూ, కార్యాలయాలకూ వెళ్ళి వ్యవహారాలు చూచేవారు. తండ్రిగారు పడే ఇబ్బందులను కష్టాలను గమనించి రామకృష్ణారావుగారు బొంబాయిలో ఎల్.ఎల్.బి.చదివేటప్పుడు అంజుమనే ఇస్లామియా హైస్కూలులో పార్ట్‌టైమ్ పర్షియన్ ఉపాధ్యాయులుగా పనిచేసి విద్యార్థులకు ఫారసీ బోధిస్తూ కొంత ఆదాయం తెచ్చుకొని తమ ఖర్చులు వెళ్ళబుచ్చుకుంటూ ఉండేవారు. చివరకు రెవిన్యూ డిపార్టుమెంటుకు అంతర్భాగ మైన అతియ్యాత్ అనే కోర్టు ఈ వ్యాజ్యంలో రామకృష్ణారావుగారికీ వారి భాగస్తులకీ అనుకూలంగా తీర్పు ఇస్తూ, బూర్గులవారిని దేశపాండ్యాగిరికి సాహెబ్ ముంతఖబ్‌గా పరిగణించింది. అంటే సొంతదారుగా గుర్తించింది. నలుగురు ప్రధాన భాగస్థులు, బూర్గులవారి వాటా 2 అణాలు 8 పైసలు. రామకృష్ణారావు గారి కుటుంబం వరకు మాత్రమే సంబంధించి షాద్‌నగర్ తాలూకాలో భైరంపల్లి జాగీరు ఉండేది. ఆ జాగీరును అన్యులు ఆక్రమించుకున్నారు. కాగా రామకృష్ణారావు గారికి లాయరుగా మంచి పేరుప్రఖ్యాతులు వచ్చిన తరువాత ఆ దురాక్రమణ చేసిన జాగీర్దారు వీరినుంచి కొంత పైకం తీసుకొని మీ జాగీరు మీరు తీసుకోండి

అన్నారు. నరసింగరావుగారు 1931 లోనూ, వారి భార్య రంగనాయకమ్మగారు 1934 లోనూ దివంగతులైనారు. ఇంట్లో వైష్ణవాచారాల మూలంగానూ, భారత భాగవతాల పఠనం వల్లనూ, తెలుగు, ఉర్దూ, ఫారసీ భాషలు కఠినమైన క్రమ శిక్షణతో అభ్యసించి ఉండటం చేతనూ, వైష్ణవ వాతావరణ ప్రభావమూ, విద్యా సంబంధమైన క్రమశిక్షణా రామకృష్ణారావు, వారి తమ్ముడు వెంకటేశ్వరరావు గారల వ్యక్తిత్వాలను తీర్చిదిద్దాయి.

రామకృష్ణారావుగారి హృదయం భక్తిభరితం కావడానికీ, ఆధ్యాత్మిక వ్యాపకంలో వీరు పడడానికీ, వీరి గద్య పద్యాత్మక రచనలలో వైష్ణవ భక్తి భావాలు ఇమ్ముగా కుదురుకొని ఉండటానికీ, వీరికి కొంత తాత్త్విక దృష్టికూడా అలవడటానికి చిన్నతనంలో గృహ వాతావరణం, వీరికి నేర్పిన విషయాలు, కుటుంబ సంస్కార ప్రభావం ముఖ్యహేతువులని చెప్పవలసి ఉన్నది. బాల్యం లోనే వీరికి నాలుగుభాషలు బోధింపబడటంచేత-తెలుగు, ఉర్దూ, ఫారసీ, ఇంగ్లీషు-ఆ తర్వాత వీరికి మరాఠీ, కన్నడ, సంస్కృత భాషలు సులభంగా వచ్చాయి. చిన్నతనంలో ఇంట్లోనే శబ్దమంజరి, ధాతు రత్నావళి చక్కగా చదువుకొని జయదేవుని గీత గోవిందం, కాళిదాసు మేఘసందేశం, ఇంకా ముకుందమాల మొద లగు గ్రంథాలు అధ్యయనం చేయడంవల్ల సంస్కృతాంధ్రములలో రచన చేయాలన్న అభిలాష కూడా వీరికి కలిగింది.

రామకృష్ణారావు గారికి 11వ ఏడు రాగానే వారి పై చదువుంకోసమై వారి కుటుంబం బూర్గుల గ్రామం నుంచి 1911 ప్రాంతంలో హైదరాబాదు చేరుకుంది. అక్కడ వీరు ధర్మవంత్ హైస్కూలులో చేరి చదువుతూ 1914లో మిడిల్ పరీక్షలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులైనారు. ఆ పిమ్మట కేస్కర్‌గారు నడుపుతూ ఉండే ఇంగ్లీషు ట్యుటోరియల్ క్లాసులలో చేరి ప్రైవేటుగా చదివి, 1915లో బొంబాయి విశ్వవిద్యాలయ మెట్రికులేషన్ పరీక్షలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులై నారు. ఈ కేస్కర్‌గారు స్వతంత్ర భారత ప్రభుత్వంలో రేడియో, సమాచార శాఖ మంత్రిగా పనిచేసిన బి. వి. కేస్కర్ గారికి తండ్రిగారు. ఆ రోజులలో హైదరాబాదు నగరంలో కేస్కర్‌గారి ప్రైవేటు క్లాసులు ప్రసిద్ధి చెందినవి. రామ కృష్ణారావుగారి వివాహం వారి 18వ యేట 1912లో కొంపెల్ల నరసింహారావు గారి రెండవ కుమార్తె రత్నమ్మతో (ఈమెకే రాధమ్మ అని మరొకపేరు) జరి

గింది. కొంపెల్లి నరసింహారావుగారు శిరస్తాదారు. నిజాం ఇర్రెగులర్ సైన్యంలో క్వార్టర్ మాస్టర్ జనరల్‌గా పనిచేశారు. వారి తండ్రిగారైన రామచంద్రరావు గారు కందికల్‌మెట్టులో ఛత్రీనాకా దగ్గర కోదండరామస్వామి ఆలయం నిర్మించారు. అది ఇప్పటికీ ఉంది. రత్నమ్మగారు 1920లో స్వర్గస్థురాలైనారు. ఈమె వల్ల ఒక కుమారుడు రంగనాథరావు, ఒక కుమార్తె శ్యామలాదేవి కలిగారు. రంగనాథరావుగారి భార్య యశోదాదేవి. ఈమె మందుముల నరసింగరావుగారి పెద్ద కుమార్తె. శ్యామలాదేవి భర్త ఇల్లిందల రామచంద్రరావు ఐ. ఎ. ఎస్. అధికారి.

రామకృష్ణారావుగారు 1924లో మరల వివాహం చేసుకున్నారు. మందుముల వెంకటనరసింహారావుగారి రెండవ కుమార్తె అనంతలక్ష్మీదేవి వీరి ద్వితీయ కళత్రము. ఈమెకు ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు కలిగారు. బూర్గుల వారు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు వివాహితయైన ఒక కుమార్తె, ఒక కుమారుడు గతించారు. ఇప్పుడు కుమార్తె కృష్ణకుమారి, కుమారుడు లక్ష్మీనారాయణరావు ఉన్నారు.

బూర్గులవారు మెట్రికులేషన్ తర్వాత నిజాం కళాశాలలో చేరి చరిత్ర, తర్కశాస్త్రం ఐచ్ఛిక విషయాలుగా, ఫారసీ రెండవ భాషగా ఇంటర్ చదివారు. ఇరాన్ దేశస్థులైన ఆగా అహమ్మదలీగారు అప్పుడు నిజాం కాలేజీలో ఫారసీ ప్రొఫెసర్‌గా ఉండేవారు. వారి వద్ద ఫారసీ చదవడం, చివరకు పర్షియన్ భాషలో అనర్గళంగా సంభాషించడం కూడా నేర్చుకున్నారు. ఆ రోజులలో నిజాం కళాశాల మద్రాసు విశ్వవిద్యాలయానికి అనుబంధ కళాశాలగా ఉండేది. 1918లో ఇంటర్మీడియెట్‌లో వీరు ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులవడమే కాక, సర్వప్రథములుగా వచ్చి వాకర్‌మెడల్ గెలుచుకున్నారు. నేటికీ నిజాం కళాశాల రోల్ ఆఫ్ ఆనర్స్‌లో వీరిపేరు ఉంది. డిస్టింక్షన్‌తో ప్యాసైన వారికి లభించే గౌరవమిది.

ఆ రోజులలో పూనా భారతదేశానికి రాజకీయ, సాంస్కృతిక, విద్యాకేంద్రంగా ఉండేది. జాతీయ నాయకులైన లోకమాన్య బాలగంగాధరతిలక్, గోపాలకృష్ణ గోఖలే గారలకది ప్రధాన కార్యస్థానంగా ఉండేది. రామకృష్ణారావు గారు పూనా వెళ్ళి గోఖలే స్థాపించిన ప్రసిద్ధ విద్యాసంస్థయైన ఫెర్గుసన్

కాలేజీలో చేరి తత్త్వశాస్త్రం ప్రధాన విషయంగా బి. ఎ. ఆనర్స్ చదివి, ప్రథమ శ్రేణిలో కృతార్థులవడమేకాక, బొంబాయి విశ్వవిద్యాలయంలో సర్వ ప్రథము లకు ఒసగబడే ఎల్లిస్ స్కాలర్‌షిప్‌ను కూడా పొందగలిగారు. ఫెర్గుసన్ కాలేజీలో వీరు చదివేటప్పుడు తత్త్వశాస్త్రంలో నిష్ణాతులైన ఆర్. డి. రనడే, ఎస్. జి. దాబ్లే వీరికి గురువులు. ఆ తర్వాత వీరు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు ఉస్మానియా విశ్వ విద్యాలయ ఛాన్సలర్‌గా తమ గురువుగారైన రనడే గారిని ఎక్స్‌టెన్షన్ లెక్చర్లు ఇవ్వవలసిందిగా ఆహ్వానించారు. పూనాలో చదివేటప్పుడే వీరు మరాఠీ భాష బాగా నేర్చుకున్నారు. పూనా రాజకీయాల ప్రభావం, దేశభక్తుల ప్రభావం వీరిపై మిక్కుటంగా ఉండేవి.

తదుపరి బొంబాయి వెళ్ళి బొంబాయి విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్రం చదివి ఎల్. ఎల్. బి. పట్టం సంపాదించారు.

# న్యాయవాది

తండ్రిగారి ఆర్థిక పరిస్థితి సరిగాలేని కారణంచేత రామకృష్ణారావుగారు కుటుంబాన్ని ఆదుకొనడానికై 1923 లో హైదరాబాదు నగరంలో న్యాయవాద వృత్తిని ప్రారంభించారు. మొదట బారిష్టర్ మహమ్మద్ అస్గర్ వద్ద జూనియర్‌గా చేరారు. బేగం బజారులోని అబ్దుల్లా రిసాలాలో చిన్న ఆఫీసు పెట్టుకున్నారు. సైకిలుపై ఫైళ్ళు వెనుక కట్టుకొని కోర్టులకూ, సీనియర్ల వద్దకూ వెళ్ళేవారు. రాత్రి పన్నెండు గంటలవరకూ శ్రమపడి కేసులు పరిశీలించి నోట్స్ వ్రాసిపెడుతూ ఉండేవారు. బారిష్టర్ అస్గర్ ఆ తరువాత నిజాం ప్రభువు దృష్టికి వచ్చి అస్గర్ యార్‌జంగ్ అయ్యారు. ఆ రోజులలో జంగ్ అనే బిరుదును నిజాం రాజు ప్రముఖ వ్యక్తులకు ప్రసాదించేవాడు. ఇంగ్లీషు కోర్టులలో అరావముదయ్యంగార్ రామకృష్ణారావుగారికి సీనియర్. అయ్యంగార్ ఆ తరువాత నిజాం ప్రభుత్వంలో కొన్ని ఉన్నత పదవులలో ఉండటమేకాక, మంత్రిగా కూడా పనిచేసి, నిజాం రాజ్యానికీ, భారత ప్రభుత్వానికీ మధ్య రాజకీయ సంబంధాలు విషమస్థితికి చేరుకున్నప్పుడు సర్దార్ పటేల్‌గారితో ఉత్తర ప్రత్యుత్తరాలు ఆరంభించి, నిజాం ఆనుపానులన్నీ ఆయనకు తెలియపరిచారు. అయ్యంగార్ లేఖలు సర్దార్‌పటేలు సంపుటాలలో చోటుచేసుకున్నాయి.

ఆ రోజులలో హైదరాబాదులో హైకోర్టు, ఇతర నిజాం న్యాయస్థానాలు ఉండేవి. సికింద్రాబాదులో, రెసిడెన్సీ ప్రాంతంలో (అంటే ఇప్పటి సుల్తాన్ బజారులో) బ్రిటిషు కోర్టులుండేవి. ఉర్దూలో ప్రవీణులైనవారు నిజాం న్యాయస్థానాలలో వాదించేవారు. ఇంగ్లీషు బాగా నేర్చిన దక్షిణ దేశపు అయ్యంగార్లు, బొంబాయి, పూనాల మహారాష్ట్ర లాయర్లు బ్రిటిషు కోర్టులలో వాదించేవారు. ఈ విధంగా రెండు వర్గాల న్యాయవాదులు ఆనాడు ఇక్కడ ఉండేవారు. అయితే బూర్గుల రామకృష్ణారావుగారు ఉర్దూ, ఇంగ్లీషు భాషలలో సమాన ప్రావీణ్యంతో చక్కగా వాదించగల వారవడం చేత ఆ రెండు రకాల కోర్టులలోనూ వారు ప్రాక్టీసు చేస్తూ ఉండేవారు. ఆ కాలంలో అట్లా ఉభయత్రా వాదించగల కొద్దిమంది సమర్థు

లైన న్యాయవాదులలో బూర్గులవారు అగ్రేసర న్యాయవాదిగా పేరుపొందారు. అంతేకాక ఉర్దూలో ప్రాక్టీసు చేసే హిందూ ముస్లిం సహచరులతో, ఇంగ్లీషులో వాదించే అయ్యంగార్లు, మహారాష్ట్రులు, పార్శీ వారితో వీరికి సత్సంబంధాలు ఉండేవి. రెవిన్యూ, సివిల్, క్రిమినల్ కేసులన్నింటిలో వీరు పనిచేస్తూ సమర్థులైన న్యాయవాదులుగా పేరుపొందారు. వీరు కొంతకాలం నవాబ్ ఫఖ్రుల్ ముల్క్ బహదూర్ వారి జాగీరుకు రిటేనర్ వకీలుగా నెలకు రూ. 200/- వేతనం పై పనిచేశారు.

నిజాం నిరంకుశ ప్రభుత్వంలో ఖద్దరు కట్టేవారినీ, పత్రికలు చదివే వారినీ అధికార్లు, పోలీసులు అనుమానిస్తూ వారిపై నిఘావేసి ఉంచేవారు. అయినా బూర్గులవారు ఖద్దరు బట్టలతోనే కోర్టుకు వెళ్ళేవారు. మొదటినుంచీ అచ్చమైన జాతీయవాది కావడంచేత ఖద్దరు ధరించడమే వారి అలవాటు. అలాగే కోర్టులో విరామసమయాంలో ఉర్దూ, ఇంగ్లీషు పత్రికలు చదువుతూ కాలక్షేపం చేసేవారు. వీనుమిగిలిన లాయర్ అయిన తర్వాత అద్దె టాంగాలో లా పుస్తకాల మూటలతో సహా కోర్టులకు వెళ్ళేవారు.

న్యాయవాదిగా ప్రాక్టీసు చేస్తున్నప్పుడే రాజకీయ, ప్రజాహిత జీవనరంగాలలో వీరు ప్రసిద్ధులై ఉండటంవల్ల రాజకీయ సంబంధమైన కేసులు వీరి వద్దకే వచ్చేవి. ముఖ్యంగా ఆర్యసమాజం కార్యకర్తలపైన, ప్రజాజీవిత రంగంలో పనిచేసే వారిపైన, ఆంధ్ర మహాసభ కార్యకర్తలపైనా నిజాం పోలీసులు కేసులు పెట్టి వేధిస్తూ ఉండేవారు. వ్యక్తి స్వాతంత్ర్యం, వాక్‌స్వాతంత్ర్యం, సమావేశాలు సభలు జరుపుకునే స్వాతంత్ర్యం లేనట్టి గుడ్డి దర్బారు రాజ్యం కదా! కొందరికి అన్యాయం జరిగి శిక్షలుకూడా పడుతూ ఉండేవి. రామకృష్ణారావుగారు ఇటువంటి కేసులను చేపట్టి, ఫీజులేకుండా ఉచితంగా వాదించి, కొన్నిటికి ఖర్చులను కూడా తామే భరించి ముద్దాయీలను విడిపిస్తూ ఉండేవారు. ఇందువల్ల పరోక్షంగా ప్రజా ఉద్యమం బలపడింది. ఈవిధంగా న్యాయవాదిగా వీరు సంస్థాన ప్రజల పౌర హక్కులను కాపాడుతూ, ప్రజా ఉద్యమాలలో పనిచేసే కార్యకర్తలకు రక్షణ కల్పిస్తూ, ప్రజలలో ధైర్యసాహసాలు, చైతన్యం కలగడానికి కారకులైనారు.

వీరి వద్ద గుమాస్తాలుగా, జూనియర్ వకీళ్ళుగా ఉభయమతాలకు చెందినవారు ఉండేవారు. కొందరు మహారాష్ట్రులు కూడా జూనియర్లుగా పనిచేసేవారు. నేడు కేంద్ర ప్రభుత్వంలో మంత్రిగా ఉన్న పి. వి. నరసింహారావుగారు వీరివద్ద జూనియర్‌గా పనిచేసినవారే.

న్యాయవాదిగా పనిచేసే రోజులలోనే బూర్గులవారు ప్రజా వ్యవహారాలలో, రాజకీయ విషయాలలో నిరంతరం నిమగ్నులై ఉండేవారు. అందువల్ల న్యాయవాద వృత్తికి వీరికి వ్యవధి తక్కువగా ఉండేది. అందుచేత కేసును స్వీకరించే అప్పుడే ముఖ్యాంశాలు వ్రాసిపెట్టుకొని, కోర్టుకు వెళ్ళేముందు వాటిని గూర్చి ఆలోచించి, వాదించేవారు. అయినప్పటికీ వీరి శక్తి సామర్థ్యాలను ఎరిగినవారు తమ కేసులను వీరికే అప్పగించి నిశ్చింతగా ఉండేవారు. ఆ రోజులలో లాయరుగా వీరికి గల పేరు ప్రఖ్యాతు లటువంటివి. అయితే వీరిని నమ్ముకున్న కక్షిదార్లు ఎన్నడూ ఆశాభంగం చెందవలసిన పరిస్థితి రాలేదు. వీరి వాదకౌశలం, సద్యః స్ఫురణం, హాస్యచతురత, బహుభాషా పాండిత్యం, వక్తృత్వ పటిమ, ఎంతటి చిక్కు సమస్య నైనా క్షణంలో గ్రహింపగల్గే వీరి కుశాగ్రబుద్ధి, వీరిని అగ్రశ్రేణికి చెందిన న్యాయవాదిగా తీర్చిదిద్దాయి. ధనార్జన మాత్రమే వీరి లక్ష్యమైతే రెండు చేతులా ఆర్జింపగలిగిగేవారు. కాని విద్యా, వైజ్ఞానిక, రాజకీయ, సాంఘిక రంగాలలో వెనుకబడిఉన్న తెలంగాణా దుస్థితిని చూచి, వీరు న్యాయవాద వృత్తిని జీవిక సాధనంగా మాత్రమే ఉంచుకొని, తక్కిన కాలాన్ని ప్రజాహిత కార్యాలకు వినియోగించేవారు, ముఖ్యంగా జాతీయోద్యమాన్ని బలపరచడం వీరి ప్రధాన ధ్యేయం.

బూర్గులవారి వద్ద జూనియర్‌గా పనిచేసిన పి.వి. నరసింహారావుగారు అనాటి తమ అనుభవాలను జ్ఞప్తికి తెచ్చుకుంటూ ఇలా వ్రాశారు* "ఆయనలో కొన్ని గొప్ప గుణాలుండేవి. దిక్కులు పిక్కటిల్లజేసే పెద్ద ప్రాక్టీసును ఆయన పెంచుకోలేదు. సాధారణంగా ప్రజాజీవితంతో సంబంధం ఉన్న నాయకుడు

---

* 'భవన్స్ జర్నల్' పత్రిక 1967 అక్టోబరు 8 వ తేదీ సంచికలో పి.వి. నరసింహారావు గారి వ్యాసం నుంచి.

లాయరైతే లాయర్‌గా ప్రాక్టీసును బాగా పెంచుకుంటాడు. కాని బూర్గుల ఆ పని చేయలేదు. క్లయింట్లు ఆయనవద్దకు వచ్చేవారంటే లాయర్‌గా ఆయన సామర్థ్యంపై వారికి విశ్వాసముండేది. ఆయనకు చేతినిండా పని ఉండేది. వారి ఆఫీసుకు ఎప్పుడూ కేసులు వస్తూనే ఉండేవి. కాకపోతే వాటిలో హెచ్చు భాగం రాజకీయ సంబంధమైనవి. వాటికాయన ఫీజు తీసుకునేవారు కాదు. ఒక కేసును ఆయన ఆమూలాగ్రం అధ్యయనం చేయడమంటూ ఎన్నడూ లేదు. కేసును తీసుకునే టప్పుడే ఒకమారు శ్రద్ధగా పరిశీలించేవారు. కేసు ఫైలు వెనుక సంక్షిప్తంగా నోట్సు, రిఫరెన్సులు గుర్తుకొరకు వ్రాసిపెట్టుకునే వారు. కాని ఆయన కోర్టులోకి వచ్చి వాదించడం మొదలుపెడితే సూక్ష్మంగా వ్రాసి ఉంచుకున్న ఆ నోట్సును ప్రకాశమానమైన తమ ప్రజ్ఞతో విస్తృతీకరించి, సంప్రదాయకమైన వాదాలను అధిగమిస్తూ పోయి. న్యాయసంబంధమైన లేదా వాస్తవాలకు సంబంధించిన విజృంభణల పదును పోగొట్టి, వాటిని మొద్దుబార జేస్తూ, తమ కేసును దుర్భేద్య మైన నిర్మాణంగా రూపొందించి, అద్భుతమైన సాక్ష్యాధారాలను తయారుచేసే వారు. న్యాయవాద వృత్తిలో బుద్ధి సూక్ష్మత ఎంత ప్రయోజనకరమైన సాధ నమో వారు ప్రదర్శించి చూపుతున్నట్లని పించేది. ఇక సీనియర్‌గా ఆయన విశిష్టుడు. ఉత్తమమైన తరగతికి చెందినవాడు. నేను బహుశా ఆయన జూని యర్లందరిలోకి జూనియర్‌ను. తల్లికి కడగొట్టు బిడ్డపై కొంచెం హెచ్చుగా ప్రేమ ఉంటుందని అంటారు. అలాగే ఆయన నాపై ప్రత్యేకమైన ప్రేమ వాత్సల్యాలు చూపేవారు. సీనియర్‌గా తమ జూనియర్లతో అరమరలులేకుండా, నిష్కపటంగా దాపరికం లేకుండా సమాన స్థాయిలో వ్యవహరించేవారు. జూనియర్లలో ఆత్మ విశ్వాసం కలిగిస్తూ ఉండేవారు".

స్వయంగా న్యాయవాదిగా పనిచేసి, ఆ తర్వాత ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా కూడా పనిచేసిన గోపాలరావు ఎక్బోటేగారు ఇటీవల ఈ రచయిత వారిని సందర్శించి మాట్లాడినప్పుడు బూర్గుల ఉత్తముడైన న్యాయవాది అనీ, ఆయన చేసే వాదాలు నిర్దుష్టంగా ఉండేవనీ అంటూ వినోద దాయకమైన ఒక సంఘటనను గూర్చి చెప్పారు:

బూర్గులవారి కీర్తి పెద్దదికాని మూర్తి చిన్నది కదా! హైకోర్టులో ప్రధాన న్యాయమూర్తి ఆసీనుడై ఉండే స్థానం ఎత్తుగా ఉండేది. బహుశా అప్పుడు మిర్జా యార్ జంగ్ ప్రధాన న్యాయమూర్తిగా ఉన్నారేమో. ఆయన బెంచీపై ఆసీనులై నారు. బూర్గులవారు వాదన ప్రారంభించారు. వాదిస్తూ ఉన్న న్యాయవాది ఎక్కడా అని ప్రధాన న్యాయమూర్తి కోర్టు అన్నివైపులా చూస్తున్నారు. కాని ఆయన చూడలేకపోయారు. అప్పుడు అక్కడే ఉన్న ఒక ముస్లిం పెద్దమనిషి వీరిని అమాంతం పైకిఎత్తి పట్టుకొని "ఇరుగో, వాదిస్తూ ఉన్న లాయర్‌సాబ్ వీరే" అన్నాడు. క్రిందికి దించిన తరువాత ఆ మహమ్మదీయుడు ఈ క్రింది కవితను ఆశువుగా చెప్పాడట:

ఏక్ ముష్త్ ఖాక్ మే
దో పర్ లగే హైఁ!

(ఒక పిడికెడు మట్టిలో రెండు మొగ్గలు తొడిగాయి అని దీని అర్థం. కాని స్వారస్యం స్పష్టంగా లేదు). బూర్గులవారే అనేవారు "నన్ను గమనించకుండా ఎవరూ ఉండలేరు. పొడుగు మనుషుల మధ్య పొట్టివాణ్ణికదా!" అని. కొన్నేండ్ల క్రితం ముఖ్యమంత్రిగా రామకృష్ణారావుగారు బేగంపేట విమానాశ్రయంలో సౌదీ అరేబియా రాజు ఇబ్నసవూద్‌కు పూలమాల వేయవలసి వచ్చింది. ఆయన చాలా ఎత్తయిన మనిషి. అప్పుడు ఆయన బాగా క్రిందికి వంగి, రావుగారూ కొంచెం ఎత్తుపెరిగి, అలా పూలమాల వేశారు. ఆ దృశ్యాన్ని చూచి అంతా నవ్వారు. ఆ ఇద్దరూ కూడా బిగ్గరగా నవ్వారు. అలాగే మన దేశంలో అమెరికా రాయబారిగా పనిచేసిన ప్రముఖ అర్థశాస్త్రవేత్త ప్రొఫెసర్ గాల్‌బ్రేత్ రామకృష్ణారావు గారితో కలిసి ఉండగా ఫోటో తీయవలసి వచ్చింది. ఆ సందర్భంలో ఇద్దరూ ఒకే ఫ్రేములో చక్కగా పడేట్టు ఫోటోగ్రాఫర్ కొంత నైపుణ్యం చూపవలసివచ్చింది.

క్రమపద్ధతిని తు.చ. పాటించకపోయినా బూర్గులవారు మంచి తెలివి తేటలుగల లాయర్ అనీ, ఆయన కేసును వాదించే తీరు వినదగిందిగా ఉండేదనీ, న్యాయవాద వృత్తిలో ఆయన పాటించిన నీతిసూత్రాలు ప్రవర్తన ఉత్తమమైన వనీ ఎక్బోటేగారు అన్నారు.

1935 సంవత్సర ప్రాంతంలో వీరు మధిర గ్రామానికి సంబంధించిన క్రిమినల్ కేసులో 72 మంది ముద్దాయీల పక్షాన వాదించి వారిని శిక్షావిముక్తులను చేశారనీ, 1938-39 సంవత్సరాలలో జరిగిన మత సంబంధమైన అలజడులలో వీరు సుమారు 75 కేసులలో ఉచితంగా వాదించి తమ కక్షిదార్లకు న్యాయం జరిగేట్టు చేయగలిగారనీ తెలుస్తున్నది.*

రామకృష్ణారావుగారు న్యాయవాద వృత్తిలో ఆడంబరానికి ఏ మాత్రం స్థానమివ్వలేదు. వాదించే విషయంలో ఆ వ్యక్తులు ఏ పార్టీకి చెందినవారు అనే అంశాన్ని పట్టించుకోలేదు. కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తల కేసులలో కూడా వాదించారు.**

న్యాయవాదిగా ఉన్నప్పుడే బూర్గుల వారికి ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి, రాజాబహదూర్ వెంకటరామారెడ్డి గారలతో పరిచయమేర్పడింది. ఈ ముగ్గురూ హైదరాబాదు తెలుగు ప్రజలకు చేసిన సేవ చిరస్మరణీయమైనది. ఒక విధంగా వీరు ముగ్గురూ హైదరాబాదు ఆంధ్రులకు త్రిమూర్తుల వంటి రక్షకులు. రావుగారు న్యాయవాదిగా పనిచేస్తూనే నిజాం రాష్ట్ర ఆంధ్రోద్యమంలో, గ్రంథాలయోద్యమంలో, దేశీయ సంస్థానాల ప్రజల ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నారు. మొదటినుంచీ జాతీయ కాంగ్రెసు సిద్ధాంతాలను అభిమానించారు. ప్రముఖ జాతీయవాదిగా పేరు పొందారు.

---

* స్రవంతి, 1967 నవంబరు, శ్రీ బూర్గుల స్మారక సంచికలో డా॥ దివాకర్ల వెంకటావధానిగారు వారి వ్యాసంలో తెలిపిన విషయాలు.

** ఉమ్మెత్తల కేశవరావుగారు వారి గ్రంథం 'బూర్గుల రామకృష్ణారావు జీవిత చరిత్ర' లో తెలిపిన విషయం.

# ప్రజాహిత చింతన

విద్యార్థి దశనుంచే రామకృష్ణారావుగారు ప్రజాహిత కార్యక్రమాలలో పాల్గొంటూ ఉండేవారు. పత్రికలు చదువుతూ, ఎక్కడైనా సభ జరిగితే నాయకుల ఉపన్యాసాలు వింటూ, సంస్థలకు స్వచ్ఛంద సేవకులుగా పనిచేస్తూ ప్రజా జీవితాన్ని గమనిస్తూ ఉండేవారు. వీరు 1916 లో కొందరు యువకులను కలుపుకొని హైదరాబాదు యంగ్ మెన్స్ యూనియన్ అనే పేరుతో ఒక సంస్థను స్థాపించారు. దీనికి వామన్ నాయక్‌గారు అధ్యక్షులు. హైదరాబాదు ప్రజా జీవితానికి వామన్‌నాయక్‌గారు, కేశవరావు కొరట్కర్‌గారు మూలపురుషులని చెప్పవచ్చు. వీరిద్దరూ మహారాష్ట్రులు. వీరు పూనానుంచి ఉత్తేజం పొందుతూ ఉండేవారు. వామన్‌నాయక్‌గారు తిలక్ అనుయాయులు. సనాతన హిందూ ధర్మాన్ని పాటించేవారు. కేశవరావుగారు గోఖలే పంథాకు చెందినవారు. ఆర్య సమాజంతో సంబంధం కలిగి ఉండి, సంఘ సంస్కరణకు ప్రాధాన్యమిచ్చేవారు. యంగ్‌మెన్స్ యూనియన్‌కు రామకృష్ణారావు కార్యదర్శి. అప్పటికి వీరు మెట్రికులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులై ఇంటర్ చదువుతూ ఉండేవారు. ఈ యూనియన్ కార్యాలయం అప్పటి రెసిడెన్సీ బజారులో ఉండేది. చందాలు పోగుచేసి పత్రికలూ, పుస్తకాలు తెప్పించి ఒక గ్రంథాలయం స్థాపించుకున్నారు. యువకులలో గ్రంథపఠనం వల్లా, గ్రూపు మీటింగులవల్లా చైతన్యం కలిగించడం ఈ సంస్థ ఉద్దేశం. అనిబిసెంటుగారి 'న్యూ ఇండియా', బి. జి. హార్నిమన్‌గారి 'బాంబే క్రానికల్', సర్.సి.వై. చింతామణిగారి 'లీడర్', రంగస్వామి అయ్యంగారి 'హిందూ', మరికొన్ని ఉర్దూ పత్రికలను కూడా యూనియన్ సభ్యులు చదివేవారు. పైన పేర్కొనబడ్డ ఇంగ్లీషు పత్రికలు ఆ రోజులలో ప్రజా సమస్యలను గూర్చి గమనార్హమైన సంపాదకీయాలు వ్రాసేవిగా పేరుపొందినట్టివి. వార్తలను కూడా నిష్పక్షపాతంగా అందిస్తూ ఉండేవి. ప్రజా వ్యవహారాలను అద్దంపడుతూ ఉండేవి.

బొంబాయిలో న్యాయశాస్త్ర విద్యార్థిగా ఉన్నప్పుడే బూర్గులవారి దృష్టి సంఘ సంస్కరణపై పడింది. ఆ రోజులలో అక్కడి పత్రికలలో ఆడపిల్లకు 'వరుడు కావలెను' అనే ప్రకటనలు పత్రికలలో వేస్తూ ఉండేవారు. వాటిలో ఆడపిల్లవారు ఇవ్వజూపే కట్నాన్ని కూడా పేర్కొంటూ ఉండేవారు. ఇటువంటి ప్రకటనలు చూచి రామకృష్ణారావుగారు మనసులో చాలా బాధపడి 'వివాహం విక్రయమా? సంస్కారమా?' అనే శీర్షికతో సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ సభ్యులైన నటరాజన్‌గారి సంపాచకత్వాన వెలువడే 'ఇండియన్ సోషల్ రిఫార్మర్' పత్రికలో ఒక ఆంగ్ల వ్యాసం వ్రాసి ప్రచురించారు.ఆ వ్యాసాన్ని ఖండిస్తూ ఎవరో మరొక వ్యాసం వ్రాశారు. కాని రామకృష్ణారావుగారు వెలిబుచ్చిన భావాలనూ, వ్యాసరచనా శైలినీ ప్రశంసిస్తూ ఆ పత్రిక ఒక సంపాదకీయాన్నే వ్రాసింది. ఇట్లా బూర్గులవారు ప్రజా జీవితానికి సంబంధించిన విషయాలపై తమ భావాలను మొగమాటం లేకుండా వెలిబుచ్చుతూ, చెప్పే అంశాలను విశదంగా శక్తిమంతంగా చెప్పడంలో ఆరితేరినవారని పేరు పొందారు. ప్రజలకు సంబంధించిన వివాదాస్పద విషయాలలో తామూ పాల్గొని అభిప్రాయ ప్రకటన చేసే అభినివేశం అప్పటినుంచే వీరికి కలిగింది.

1922 ప్రాంతంలో నిజాంరాజు బెరారును తిరిగి తమకు ఇచ్చివేయవలెనని బ్రిటిష ప్రభుత్వాన్ని కోరుతూ, ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడమే కాక తమ ప్రధానమంత్రి సాలార్‌జంగ్ ద్వారా రాయబారాలు జరుపుతూ బెరారు సమస్యను తిరగదోడినాడు. బెరారు అసలు నిజాం ప్రభువులదే. కాని వారి అసమర్థతవల్ల వారి రాజ్యం అప్పులపాలైంది. పరిపాలనా వ్యవస్థ కట్టుతప్పింది. అప్పుడు బ్రిటిషవారి సైన్యాన్ని ఇక్కడ ఉంచవలసివచ్చింది. ఆ సైన్యానికి అయ్యే ఖర్చు భరించలేక నిజాం ఆంగ్లేయులకు బెరారును దత్తం చేశాడు. ఏడవ నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్ పూర్వీకులెవరూ బెరారును తిరిగి తీసుకోవాలని ప్రయత్నించలేదు. కాని ఇతడు ప్రయత్నించసాగాడు. దానితో బెరారు సమస్య ప్రజలకు ముఖ్యమైన రాజకీయ సమస్య అయింది. ముఖ్యంగా బెరారు ప్రాంతంలో నివసించే మహారాష్ట్రి ప్రజలకు. రామకృష్ణారావుగారు 'ఇండియన్ సోషల్ రిఫార్మర్' పత్రికలోనూ, హైదరాబాదు ఉర్దూ పత్రికలలోనూ కొన్ని వ్యాసాలు వ్రాసి బెరారుపై నిజాంకు గల హక్కును సమర్థించారు. కాని అలా ఇచ్చివేసే

ముందు నిజాం ప్రభువు బెరారు ప్రజలకు బాధ్యతాయుత ప్రభుత్వం ఇవ్వవలసి ఉంటుందనీ, లేకపోతే ఆ ప్రజలు అప్పటికే కొన్ని పౌరస్వాతంత్ర్యములు అనుభవిస్తున్నారు కాబట్టి వారు నిజాం రాజ్యంలో చేరడానికి ఇష్టపడకపోవచ్చుననీ అన్నారు. బెరారువంటి జటిలమైన రాజకీయ విషయాన్నిగూర్చి ఒక యువకుడు రాజకీయ విజ్ఞతతోకూడిన భావాలను ప్రకటించడాన్ని గమనించిన పెద్దలు ఈ యువకుని అభిజ్ఞతకు హర్షామోదాలు తెలిపారు. ఈ వ్యాసాలను చదివిన సర్ నిజామత్ జంగ్ అనే నిజాం దర్బారులోని ప్రముఖుడు రామకృష్ణారావుగారిని తమ నివాసానికి ఆహ్వానించి, వారి వ్యాసాలను మెచ్చుకొని వారికి ఇష్టమైతే ప్రభుత్వంలో మంచి ఉద్యోగం ఇప్పిస్తామని ఆశ చూపారు. అందుకు వీరు తమ కృతజ్ఞతను మాత్రం తెలిపి, తాము ప్రభుత్వంలో ఉద్యోగం చేయజాలమని స్పష్టంచేశారు. బాధ్యతాయుత ప్రభుత్వమనే షరతును పెట్టకుండా బూర్గులవారు బెరారు పునర్దత్తతను సమర్థించిఉంటే, నిజామే వారికి స్వయంగా ఉన్నతపదవిని ఇవ్వజూపేవాడేమోనని ఆ రోజులలో హైదరాబాదు నగరంలో ఉన్నత రాజకీయ వర్గాలలో చెప్పుకున్నారు. తన రాజ్యాన్ని విస్తృతపరచుకోవడం ఏడవ నిజాం కాంక్ష. చివరకు వైస్రాయి లార్డు రీడింగ్ 1925 లో నిజాంకు వ్రాసిన సుదీర్ఘమైన లేఖలో నిజాం కోర్కెను త్రోసిపుచ్చుతూ, బెరారు సమస్య ఒక ఒప్పందం ద్వారా పరిష్కరింపబడిందనీ, ఏ దేశీయ సంస్థానమూ సార్వభౌమాధికారంగల బ్రిటిషు ప్రభుత్వంతో సమాన ప్రతిపత్తితో వ్యవహరించజాలదనీ, సార్వభౌమాధికారానికి సంబంధించిన రాజకీయ వ్యవహారాలలో ఇతర దేశీయ సంస్థానాలకులేని ప్రత్యేకహోదా, అంతస్థు నిజాం ప్రభుత్వానికి ఉన్నవని నిజాం భావించరాదనీకూడా హెచ్చరించాడు. ఏమైనప్పటికీ ఇలా బెరారు ప్రతిపత్తిని బ్రిటిషువారు స్పష్టంచేయడంతో నిజాం ఊరకుండిపోవడం తప్ప ఏమీ చేయలేకపోయాడు. బ్రిటిషు సార్వభౌమాధికారం ముందు దేశీయ సంస్థానాల ప్రతిపత్తి ఏమిటో లార్డు రీడింగ్ స్పష్టం చేశాడు. బ్రిటిషు ప్రభుత్వం రామకృష్ణారావుగారి వ్యాసాలను గమనించకుండా ఉండి ఉంటుందని అనుకోలేము. సంస్థానంలో ఏమూల ఏమి జరుగుతూ ఉందో బ్రిటిషు రెసిడెంటు ఎప్పటికప్పుడు వైస్రాయికి తెలుపుతూ ఉండేవాడు కదా !

బ్రిటిషిండియాలో మాంటేగు - చెమ్స్‌ఫర్డు సంస్కరణలు అమలులోకి రాబోతూఉన్న కాలంలో బ్రిటిషువారి వత్తిడిపై నిజాం తన ప్రధానమంత్రిగా

సర్ అలీ ఇమామ్‌ను నియమించాడు. నిరంకుశ ప్రభుత్వపు పద్ధతి కాలానికి అనుగుణమైనది కాదని తలచి ఈ రాజ్యంలోకూడా రాజకీయ సంస్కరణలు అమలులోకి తేవాలని నిర్ణయించాడు. నిజాం శాసనసభ నిర్మాణానికి ఒక పథకం తయారుచేయాలి. ఎన్నికల పద్ధతి, ఓటుహక్కు విధానం, ప్రత్యేక వర్గాల వారికి ప్రాతినిధ్యం, అధికార సభ్యుల సంఖ్య, శాసనసభ అధికారాలు-వీటన్నిటిని గూర్చి ఒక స్కీము తయారుచేసి, సంస్కరణలను గూర్చిన నివేదికను సమర్పించాలి. ఈ పనికై రాయ్ బాలముకుంద్ అనే వారిని స్పెషల్ ఆఫీసరుగా నిజాం ప్రభుత్వం నియమించింది. అప్పుడు ప్రజానాయకులు ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోవడానికై హైదరాబాదు పొలిటికల్ రిఫారమ్స్ అసోసియేషన్ అనే సంస్థను స్థాపించారు. దీనికి వామన్ నాయక్‌గారు అధ్యక్షులు. రాఘవేంద్ర శర్మగారు ప్రధాన కార్యదర్శి.* ఈ అసోసియేషన్‌ను మందుముల నరసింగరావుగారు 'ఈ రాష్ట్రంలో మొదటి రాజకీయ సంస్థ' అని అన్నారు.** ఈ సంస్థ తరఫున నిజాం సంస్థానంలో ఎటువంటి రాజకీయ సంస్కరణలు అమలుపరచవలెనో ఒక స్కీము తయారుచేసి సమర్పించడమే కాక,దీని తరఫున ఒక ప్రతినిధివర్గంకూడా అలీఇమాంను కలుసుకొని నివేదిక సమర్పించుకుంది.కాని సంస్కరణ లేవీ అమలులోకి రాలేదు. అలీ ఇమాం ప్రధానమంత్రి పదవి వదులుకొని స్వస్థానానికి వెళ్ళిపోయాడు. దీనితో రాజకీయ సంస్కరణలు తేవాలని నిజాం హృదయ పూర్వకంగా వాంఛించడం లేదని తేలిపోయింది. ఇది 1921 నాటిమాట, రిఫారమ్స్ అసోసియేషన్ నివేదిక ముసాయిదాను వ్రాసే కార్యభారం రామకృష్ణారావుగారి పైన పడింది. ఈ పనిని వారు సక్రమంగా నిర్వహించారంటూ ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారు వారి 'తెలంగాణా ఆంధ్రోద్యమం' అనే గ్రంథంలో ఇలా వ్రాశారు: "పైన ఉల్లేఖించిన రాజకీయ సంస్థ పక్షమున మహాసభ జరుపుటకు వీలులేనందున, ఒక పథకము సిద్ధము చేసితిమి. దానిని సిద్ధపరచిన గౌరవము అపుడపుడే న్యాయవాద వృత్తి సాగించుచున్న

---

* స్రవంతి, 1967, శ్రీ బూర్గుల స్మారక సంచికలో మందుముల నరసింగరావుగారి వ్యాసం.

** '50 సంవత్సరాల హైదరాబాదు' అనే గ్రంథంలో-దీని రచయిత మందుముల నరసింగరావుగారు-1977

మన బూర్గుల రామకృష్ణారావుగారికి చెందుచున్నది. ఈ అంశమునుబట్టి రాజకీయోద్యమమున నిర్మాణాత్మకమగు నిట్టి కార్యమును తెలంగాణములోని ఒక విద్యార్థికుడు సాధించగలడని తెలియవచ్చును."

1923 లో కాకినాడలో మౌలానా మహమ్మదలీ అధ్యక్షతన కాంగ్రెసు మహాసభ జరిగింది. ఆ మహాసభకు బూర్గుల రామకృష్ణారావుగారు, మరికొందరు హైదరాబాదు జాతీయవాదులు ప్రతినిధులుగా వెళ్ళారు. ఆ సందర్భంలోనే దేశీయ సంస్థానాల ప్రజల ప్రతినిధుల మహాసభ కూడా ఒకటి జరిగింది. దానికి సుప్రసిద్ధ కాంగ్రెసు నాయకులు ఎస్. సత్యమూర్తి అధ్యక్షత వహించారు.సభలో శ్రీమతి సరోజినీ నాయుడు, వామన నాయక్, రాఘవేంద్రరావు శర్మ, బూర్గుల రామకృష్ణారావు, మందుముల నరసింగరావు మొదలగు ప్రముఖులున్నారు. దేశీయ సంస్థానాలను గూర్చిన ఒక చిత్తు తీర్మానంపై తర్జన భర్జనలు ముమ్మరంగా జరిగాయి. తీర్మానంలోని పదజాలం విషయంలో సత్యమూర్తిగారికీ, సరోజినీ నాయుడుగారికీ అభిప్రాయభేదం వచ్చింది. అప్పుడు సరోజినీ నాయుడు బూర్గుల రామకృష్ణారావుగారిని పిలిచి ఉచితరీతిని ముసాయిదా తీర్మానాన్ని వ్రాయమని కోరారు. సభలో ఒక ప్రక్కన కూర్చొని చర్చలను ఆకళింపు చేసుకొన్న బూర్గులవారు ఒక తీర్మానం వ్రాసి సరోజినీదేవి గారికి అందజేయగా దానిని ఆమె చాలా చాలా ప్రశంసించి, సత్యమూర్తిగారి ఎదుట ఉంచినారు. ఆయన జరిగిన తర్జన భర్జనలూ వాదోపవాదాల దృష్ట్యా రావుగారు వ్రాసిన తీర్మానమే సరియైనదని భావించి సభకు సమర్పించగా అది ఏకగ్రీవంగా ఆమోదింపబడింది. ఆ సభ ముగిసేదాకా సత్యమూర్తిగారు రామకృష్ణారావుగారిని తమ ప్రక్కనే కూర్చుండబెట్టుకొని చర్చల సరళిని గమనించమని కోరారు. అప్పటి నుంచి రామకృష్ణారావుగారి ప్రతిభ నాయకులందరికీ తెలియవచ్చింది. ఆంధ్ర మహాసభలో కాని, లేక స్టేటు కాంగ్రెసులోగాని అతివాద మితవాద నాయకుల మధ్య, లేదా సీనియర్ నాయకులకూ యువకులకూ మధ్య అభిప్రాయ భేదాలు వచ్చినపుడు రామకృష్ణారావు గారిచేత ముసాయిదా తీర్మానం వ్రాయించడం హైదరాబాదులో పరిపాటి అయిపోయింది. కాకినాడ కాంగ్రెసు మహాసభలో మౌలానా షౌకత్ అలీ, హకీం అజ్మల్‌ఖాన్ మొదలగు కాంగ్రెసు నాయకులు ఉర్దూలో చేసిన మహోపన్యాసాలను రావుగారిచేతనే తెలుగులోకి తర్జుమా

చేయించారు. అప్పటినుంచే వీరు అఖిల భారత నాయకుల దృష్టికి వచ్చారని చెప్పవచ్చు.

హైదరాబాదు నగరంలో పూర్వం 'హైదరాబాదు సొసైటి' అనే సంస్థ ఒకటి ఉండేది. ఈ సంస్థ ఏ సంవత్సరం స్థాపించబడిందీ సరిగా తెలియదు కాని దీని ప్రస్తావన నవాబ్ అలీయావర్ జంగ్ సంచికలో ఉంది.* బాకరలీ మిర్జా, బూర్గుల రామకృష్ణారావు, ఫజ్లుర్ రహమాన్, దిన్షా ఇటాలియా ప్రభృతులు దీని కార్యక్రమాల పట్ల శ్రద్ధాసక్తులు కలిగిఉండేవారు. ఈ సొసైటీ ఆనాటి హైద్రాబాదు బుద్ధిజీవులకు ఒక క్లబ్బుగా ఉపయోగపడింది.

ఇంగ్లండులో ఉన్నత విద్యాభ్యాసానికై వెళ్ళిన హైదరాబాదు విద్యార్థులు కొందరు ప్రజాస్వామ్య సిద్ధాంతాలను మిక్కిలిగా అభిమానించారు. వీరు విక్టోరియన్ లిబరలిజం వల్లనూ, ఫేబియన్ సోషలిస్టు భావాలచేతనూ ప్రభావితులైనవారు. మేధావి వర్గానికి చెందిన వీరు అక్కడ 1928లో అంజుమనే తరక్కి-హైదరాబాదు (అనగా హైదరాబాదు అభివృద్ధి సంఘం) అనే సంస్థను ఇంగ్లండులో నెలకొల్పారు. ఆ సంస్థ తాలూకు శాఖ ఒకటి హైదరాబాదులో ఏర్పాటు చేయబడింది. దాని అధ్యక్షుడు అలీయార్ ఖాన్. హైదరాబాదు శాఖ శ్రీమతి పద్మజా నాయుడు సంపాదకత్వాన 'ఆన్‌వర్డ్' (పదండి ముందుకు) అనే త్రైమాసిక పత్రికను ప్రచురించేది. ఈ శాఖలో బూర్గుల రామకృష్ణారావు, ఫజ్లుర్ రహమాన్ ప్రముఖ సభ్యులు. డా॥ లతీఫ్ సయీద్, బాకరలీ మిర్జా, దిల్‌సుఖ్‌రామ్, పద్మజా నాయుడు, అతాఉర్ రహమాన్, అలీ అక్బర్, ఎం. నరసింగరావు మొదలగు వారు ఇందులో సభ్యులుగా ఉండేవారు. జాతీయవాదులు, అభ్యుదయ దృక్పథం గలవారు సభ్యులుగా ఉన్న ఈ సంస్థ నిజాం ప్రభువు అధ్వర్యాన సంస్థానంలో బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడ వలెననీ, స్థానిక స్వపరిపాలన, నిర్బంధ

* ఈ ఆంగ్ల సంచికను అబుల్ కలాం ఆజాద్ ఓరియంటల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్, హైదరాబాదు వారు ప్రచురించారు.

ప్రాథమిక విద్య అమలు పరచబడవలెననీ, సంఘ సంస్కరణలు రావలెననీ అభిలషించింది.*

విద్యాధికులు, ఉదారాశయములు గలవారు నిజాం రాజరిక వ్యవస్థలో కొంతైనా మార్పు వచ్చి సమాజానికి కొంత స్వేచ్ఛ లభించవలెనని ఆ కాలంలో కోరుకునే వారు. ఇటువంటి చిన్న చిన్న సంస్థలతో వారు సంబంధం కలిగి ఉండే వారు. ఇవి ప్రజా బాహుళ్యమునకు చెందిన సంస్థలు కావు. మేధావి వర్గం వారే వీటిలో ఉండేవారు. ఆ వర్గం వారికివి ఒక విధమైన ఆలోచకుల క్లబ్బులుగా ఉండేవని చెప్పవచ్చు.

1929లో ఏర్పడ్డ సివిల్‌రైట్స్ ప్రొటెక్షన్ లీగుకు (పౌరహక్కుల పరిరక్షణ సంఘం) రామకృష్ణారావుగారు అధ్యక్షులుగా పనిచేసి పౌరస్వత్వముల కోసం పాటుబడ్డారు.

నిజాం రాష్ట్రంలో 1935 ప్రాంతంలో ముల్కీ ఉద్యమం వచ్చింది. యు.పి., పంజాబు, ఢిల్లీ ప్రాంతాల నుంచి ఉత్తర దేశీయులైన ముస్లిములు వచ్చి హైదరాబాదు ప్రభుత్వంలో ఉన్నతోద్యోగాలు సంపాదించి ఇక్కడ ప్రాబల్యం వహింపసాగారు. ఇది సహింపజాలని స్థానిక ముస్లిములు తమ ప్రాధాన్యం తగ్గిపోతోందని ఆందోళన చెంది, 'స్థానికులకే ఉద్యోగాలు' అనే నినాదంతో ముల్కీ ఉద్యమం లేవదీశారు. దీనివల్ల ఇక్కడి ప్రజలలో కొంత కదలిక, ఉత్సాహం ఏర్పడ్డవి. ఆ ఉత్సాహాన్ని నిలబెట్టే ఉద్దేశంతో 1935లో నిజామ్స్ సబ్జెక్ట్స్ లీగ్ అనే సంస్థను ఏర్పాటు చేశారు. దీనికి సర్ నిజామత్ జంగ్ అధ్యక్షుడు. ఈయన నిజాం మంత్రి మండలిలో రాజకీయశాఖ మంత్రిగా పనిచేసి, తరువాత పదవి నుండి విరమించుకున్నారు. గొప్ప విద్వాంసులు. ఇంగ్లీషులో చక్కని కవిత్వం వ్రాసేవారు. ఈ సంస్థలో బూర్గుల రామకృష్ణారావుగారు ఒక కార్యదర్శి. సయ్యద్ ఆబిద్ హసన్, శ్రీనివాసరావు శర్మ ఇతర కార్యదర్శులు. అబుల్ హసన్

* 'పొలిటికల్ అవేకెనింగ్ ఇన్ హైదరాబాదు - రోల్ ఆఫ్ యూత్ అండ్ స్టూడెంట్స్' - రచన: ఎస్.ఎం. జవ్వాద్ రజ్వీ, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు - 1.

సయ్యదలీ,మిస్ పద్మజా నాయుడు గారలు సభ్యులుగా ఉండేవారు. నిజాం పాలిత ప్రజల సంఘం అని దీనిఅర్థం. దీనిని ఉర్దూలో 'జమీయత్ రియాయాయె నిజాం' అని వ్యవహరించారు. ఇట్టి సంస్థలలో సభ్యత్వం స్వీకరించడంలో రామకృష్ణా రావుగారి ముఖ్యోద్దేశం జాతీయవాదులైన ముస్లిం మిత్రులతో సన్నిహితంగా ఉండటం, వారు కూడా బాధ్యతాయుత ప్రభుత్వపు డిమాండును సమర్థించేటట్టు చేయడం - ఇటువంటి సాన్నిహిత్యంవల్ల వారిని మతతత్త్వ వాదుల నుండి వేరు చేయవచ్చు. రామకృష్ణారావుగారు జాతీయ భావాలు గల ముస్లిం పెద్దల ఇండ్లకు కూడా వెళ్ళి, వారితో సత్సంబంధాలు కలిగి ఉండేవారు. అయితే నిజాం సబ్జెక్ట్సు లీగ్ ఆశయాలలో రాజ్యాంగబద్ధమైన ప్రభుత్వ స్థాపన, బాధ్యతాయుత ప్రభుత్వం వంటివి ఉండటంతో, నిజాం ప్రభుత్వం కినిసి, వత్తిడితెచ్చి, ప్రముఖ ముస్లిములు ఆ సంస్థ నుండి విరమించుకునేట్టు చేసింది. ఇందువల్ల పౌరులందరూ మతంతో నిమిత్తం లేకుండా ఒక రాజకీయ సంస్థను ఏర్పాటు చేసుకోవడానికి చేసిన ప్రయత్నం విఫలమైంది.

దేశీయ సంస్థానాధిపతుల అధికారాలను హక్కులను కాపాడే బాధ్యతను బ్రిటిషు సార్వభౌమాధికారం తనపై వేసుకుంది. భారత సమాఖ్య పథకము ననుసరించి భారత శాసనసభలలో దేశీయ రాజ్యాల ప్రాతినిధ్యం, దేశీయ రాజ్యాలలో ఆంతరంగికంగా తేవలసిన రాజకీయ సంస్కరణలు ప్రాముఖ్యం వహించాయి. ఈ విషయంలో ప్రజాభిప్రాయాన్ని వెల్లడించడానికై హైదరాబాదు ప్రజల రాజకీయ మహాసభ జరపడానికై ప్రజా నాయకులు ప్రయత్నించారు. కాని నిజాం ప్రభుత్వం తన డొమినియన్సులోని 16 జిల్లాలలో ఎక్కడా రాజకీయ మహాసభ జరపడానికి అనుజ్ఞ ఇవ్వలేదు. అప్పుడు బెరారు ప్రాంతంలోని అకోలా పట్టణంలో 1931 ఆగష్టు నెలలో బారిష్టరు రామచంద్ర నాయక్‌గారి అధ్యక్షతన హైదరాబాదు రాజకీయ మహాసభ జరుపబడింది. ఈ మహాసభకు బూర్గుల రామకృష్ణారావుగారు ప్రధాన కార్యదర్శిగా పనిచేసి సమర్థుడైన రాజకీయ వ్యవహర్త అనిపించుకున్నారు. ఈ సభను అకోలా పట్టణంలో జరపడంలో బూర్గులవారు, వారి సహచరులు ఎత్తుకు పైఎత్తు వేశారని చెప్పాలి. రాజకీయ మహాసభ తన రాజ్యంలో జరగడానికి వీలు లేదని నిజాం అన్నాడు. అకోలా పట్టణం బెరారు ప్రాంతంలో ఉంది. బెరారు

తనదేననీ, అది తనకు తిరిగి రావాలనీ నిజాం బ్రిటిషువారితో మొరపెట్టుకుంటు న్నాడు. కాబట్టి అకోలా నిజాం రాష్ట్రంలోని భాగమేననీ, అక్కడ జరిగేసభ నిజాం రాష్ట్రంలో జరిగినట్టిదేననీ రామకృష్ణారావుగారి తర్కం. ఏమైనా, తాను అనుజ్ఞ ఇవ్వని సభ తనదేనని తాను పదేపదే చెప్పుకుంటూఉన్న బెరారులో జరిపి, ప్రజా నాయకులు తనకే ఒక సవాలు విసిరారని నిజాం గ్రహించకపోలేదు. అకోలా బ్రిటిషువారి అధీనంలో ఉండటంచేత సభ జయప్రదంగా జరిగింది. సభలో చేయబడిన తీర్మానాలకు బైటి పత్రికలు మంచి ప్రాచుర్యమిచ్చాయి.

1937 లో మహారాజా సర్‌కిషన్ ప్రసాద్‌గారు నిజాం ప్రధానమంత్రి పదవినుండి విరమించుకోగా సర్ అక్బర్ హైదరీ ప్రధానమంత్రి అయినాడు. ఈయన తన కాలంలో ఒక గొప్ప కార్యం జరిగిందని చూపెట్టడానికై 1937 సెప్టెంబరు 22వ తేదీన నిజాంచే ఒక కొత్త ఫర్మానా జారీచేయించాడు. అందులో రాజ్యాంగ సంస్కరణలను సూచించడానికై ఒక కమిటీని ప్రభువుగారు ఏర్పరచినట్లు తెలుపబడింది. ఆ కమిటీకి దివాన్ బహదూర్ అరవముద అయ్యం గార్ అనే సుప్రసిద్ధ అడ్వకేటు అధ్యక్షుడు. ఈ ప్రకటనతో హైదరాబాదు ప్రజలలో కొంత చైతన్యం కలిగింది. కాని అయ్యంగార్ కమిటీ లోకులను మభ్యపెట్టి, పౌరులకెట్టి అధికారాలు లేకుండాచేసి నేతిబీరకాయవతుగా తయా రవుతుందేమోనని ప్రజానాయకులు శంకించారు. 1937 నవంబరు 12 వ తేదీన హైదరాబాదు ప్రజాపరిషత్తు (Hyderabad People's Convention) సమావేశం అబుల్ హసన్ సయ్యదలీ అధ్యక్షతన జరుపబడింది. ఆ పరిషత్తు సమావేశంలో ప్రభుత్వానికి సమర్పించడానికై రాజకీయ సంస్కరణల స్కీము నొకదానిని సిద్ధ పరచడానికి 23 మంది సభ్యులతో ఒక కమిటీ ఏర్పాటుచేయ బడింది. ఈ కమిటీకి అధ్యక్షులు ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారు. కార్యదర్శులు బూర్గుల రామకృష్ణారావు, కృష్ణశర్మ. రాష్ట్రంలో ప్రవేశపెట్టబడే రాజ్యాంగ సంస్కరణలు ఎటువంటివై ఉండవలెనో తెలుపుతూ సమగ్రమైన నివేదికను తయారుచేయడం ఈ కమిటీ కర్తవ్యం. ప్రజాపరి షత్తులో మహారాష్ట్రులు, కన్నడులు, ముస్లిములు హేమాహేమీలైనారు ఉన్నారు. కాని రామకృష్ణారావుగారిని కార్యదర్శిగా ఎన్నుకోవడంలో అత్యంతము వివేచన చూపారని చెప్పవలసి ఉన్నది. రాజకీయ, ఆర్థిక, సాంఘిక, న్యాయవిషయాలలో

మంచి పరిజ్ఞానంతో రాజ్యాంగరచన చేయవలసి ఉంటుంది. ప్రజల హక్కులను ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకోవాలి, రామకృష్ణారావుగారు ఈ కార్యాన్ని జయప్రదంగా నిర్వహించారు. పరిషత్తు అధ్యక్షులైన మాడపాటి హనుమంతరావు గారు వారు రచించిన 'తెలంగాణా ఆంధ్రోద్యమం' అనే గ్రంథంలో "పరిషత్తు పేరున జరిగిన కార్యమంతటిని కార్యదర్శులే నిర్వహించిరి. ఈ సంబంధమైన గౌరవమును పొందుటకు యథార్థమున వారిద్దరే యర్హులు" అని వ్రాశారు. ఈ కమిటీ తన నివేదికను అయ్యంగార్ కమిటీకి సమర్పించింది. అయితే అయ్యంగార్ కమిటీ సూచనలు అతి హీనములుగా ఉండటం చేత "ప్రజలందు ఆందోళనము చెలరేగుచుండగా ప్రభుత్వ వైఖరిని చక్కగా గ్రహించియున్న ప్రజాకార్య ప్రముఖులు ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాలన్నిటికిని సమిష్టిగా నుండదగు నొక రాజకీయ సంస్థను 'హైదరాబాదు స్టేటు కాంగ్రెసు' అను పేర స్థాపించి, దేశమునందలి సుప్త శక్తులను మేల్కొల్పి, బాధ్యతాయుత ప్రభుత్వమును ఆదర్శముగా నిడుకొని, సభ్యులను సమకూర్పసాగిరి." అని మాడపాటి హనుమంతరావు పంతులుగారు వ్రాశారు.* బూర్గుల రామకృష్ణారావు గారు కోరుకున్న పర్యవసానం కూడా ఇదే. చిన్న సంస్థలవల్ల కమిటీలవల్ల హైదరాబాదులో ప్రజా స్వత్వములకు మన్ననరాదనీ, కాంగ్రెసువంటి ప్రజా సంస్థవల్ల మాత్రమే అది సాధ్యపడగలదనీ రావుగారు అనేక సంస్థలతో తమకు కలిగిన అనుభవాలను బట్టి గ్రహించారు.

రామకృష్ణారావుగారిని హెచ్చుగా ఆకర్షించింది రాజకీయోద్యమం. అయితే రాజకీయ విషయాలలో పౌరులకు చక్కని ప్రవేశం ఉండటం అవసరం. పౌరులకు విషయ పరిచయం కలిగించడానికై 1938 లో శిక్షణ తరగతులు ఏర్పాటు చేయబడ్డవి. రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానిక విషయాలు, రైతు సమస్యలు, కార్మిక శ్రేయస్సు మొదలైనవి శిక్షణకు ఎంపిక చేయబడ్డ విషయాలు. 17 మంది

---

* 'తెలంగాణా ఆంధ్రోద్యమము,' రెండవ భాగము, పుట 134.

అభ్యర్థులకు తరగతులు పెట్టి శిక్షణ ఇచ్చారు. రామకృష్ణారావుగారు ఈ తరగతులకు ఉపన్యాసకులై ఆచార్య పీఠాన్ని అధిష్ఠించారు.*

వివిధ సంస్థల ద్వారా రామకృష్ణారావుగారు హైదరాబాదు పౌర ప్రముఖులలో కలిగించిన జాగృతి గణనీయమైనది. ఇది పైకి కన్పించేది కాదు. ప్రజాబాహుళ్యాన్ని ముందిడుకొని చేసింది కాదు. సంస్థల పదవీ బాధ్యతలను మీద వేసుకొని నిర్వహించిన కార్యం. సంస్థల ద్వారా వ్యక్తులను కూడగట్టడం, నిర్ణీత కార్యక్రమాలు అమలు జరుపడం, ప్రజలలో ఎంతో కొంత చైతన్యాన్ని తేవడం, (అనేక నిషేధాలున్నప్పటికీ) జాతీయతా భావాన్నీ, సకల మత సౌభ్రాత్రాన్నీ వ్యాపింపజేయడం, నిజాం పాలించే హైదరాబాదులో బాధ్యతాయుత ప్రభుత్వం రాజ్యాంగబద్ధంగా ఏర్పడవలసిన ఆవశ్యకతను పదే పదే వివిధ వేదికలనుంచి ఉద్ఘాటించడం, ఇవి రావుగారి ఆశయాలు, లక్ష్యాలు.

* 'స్రవంతి' బూర్గుల స్మారక సంచికలో ఆదిరాజు వీరభద్రరావుగారి వ్యాసం నుంచి- నవంబరు 1967.

# ఆంధ్రోద్యమ సచివుడు

ఆంధ్రులకు ఆంధ్రోద్యమాలు రెండు ఉన్నాయి. ఒకటి ఆంధ్ర ప్రాంతం లోని ఆంధ్రోద్యమం. ఇది మద్రాసు ప్రెసిడెన్సీలోని తెలుగు ప్రాంతాలను వేరుచేసి ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటుకోసం సాగిన ఉద్యమం. రెండవది నిజాం రాష్ట్రంలోని ఆంధ్రోద్యమం. దీనికి ఆద్యులైన మాడపాటి హనుమంత రావుగారు అన్నట్లు, ఇది హైదరాబాదు సంస్థానంలో నివసించే తెలుగువారి సర్వతోముఖాభివృద్ధికి ఉద్దేశింపబడినప్పటికీ, ముఖ్యంగా తెలంగాణా ఆంధ్రుల మాతృభాషను పునరుజ్జీవింపజేసి, తెలుగు భాషా సాహిత్యాల అభివృద్ధిని సాధించ డానికీ, తెలంగాణా ప్రజల సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, నైతిక అభ్యుదయానికి కృషి చేయడానికీ ఉద్దేశింపబడింది. భారత జాతీయ కాంగ్రెసును మిక్కిలిగా అభిమానించినవారే ఈ నిజాం రాష్ట్ర ఆంధ్రోద్యమ నాయకులు కావడం గమనార్హమైన విశేషం.

ఇరవయ్యో శతాబ్ది మొదటి 20 సంవత్సరాల వరకూ హైదరాబాదు ఆంధ్రులకు ఆంధ్ర సంస్థ అంటూ లేకపోవడం నిజంగా విడ్డూరంగా కనిపించే విషయం. ఒక చిన్న సంఘటన వల్ల ఆంధ్ర సంస్థ ఇక్కడ ఆవిర్భవించింది. 1921 నవంబరు 12వ తేదీన హైదరాబాదు నగరంలో మహారాష్ట్ర విద్వాంసు డైన కర్వే పండితుని అధ్యక్షతన సంఘ సంస్కరణ మహాసభ జరుగుతోంది. హైదరాబాదు ఆంధ్ర ప్రముఖులు కూడా సభలో ఆసీనులై ఉన్నారు. ఆలంపల్లి వెంకటరామారావు అనే ఒక ప్రముఖ తెలుగు న్యాయవాది తన ఉపన్యాసాన్ని తెలుగులో ప్రారంభించగానే, తెలుగు ప్రసంగాన్ని విననొల్లని మహారాష్ట్రులు చప్పట్లు చరిచి, అల్లరిచేసి ఉపన్యాసాన్ని సాగనివ్వలేదు. హైదరాబాదులో తెలుగు మాతృభాషగా గలవారు అధిక సంఖ్యాకులై ఉన్నారు. తెలుగు నగరంలో తెలుగు భాషకు అవమానం జరిగింది! ఇది భరించలేని 12 మంది ఆంధ్ర ప్రముఖులు ఆ రాత్రే వేరొక చోట సమావేశమై 'ఆంధ్ర జనసంఘం' అనే పేరుతో తమ సంస్థను ఏర్పాటు చేశారు. ఆ పన్నెండుమందిలో బూర్గుల రామకృష్ణారావుగారు

ఉన్నారు. ఒక పండితుడు ఈ పన్నెండుమందిని ద్వాదశాదిత్యులని అభివర్ణించాడు. ఆ సంస్థయే నిజాం రాష్ట్ర ఆంధ్ర మహాసభగా అభివృద్ధి చెందింది. దీని సంచాలకులు మాడపాటి హనుమంతరావు పంతులుగారు. తెలంగాణా ప్రాంతం అప్పుడు మిక్కిలి దయనీయమైన స్థితిలో ఉంది. ప్రజలలో విద్య లేదు. అమాయకత్వం, అజ్ఞానం ఏ విధమైన అభివృద్ధికీ అవకాశమివ్వలేదు. తెలంగాణాకు అది అంధయుగం. ప్రజాహిత జీవనమనేది లేదు. హనుమంతరావు పంతులుగారు తెలుగు, ఉర్దూ, ఇంగ్లీషు భాషలు బాగా ఎరిగిన వారైనప్పటికీ విద్యాధికులు కారు. నిజాం ఉన్నతోద్యోగులతో సంప్రదింపులు జరిపి, ఆంధ్రమహాసభ కార్యక్రమాలను నిర్వహించడానికి సమఉజ్జీగా ఉండే విద్యాధికుడైన సమర్థుని సహాయం పంతులుగారికి అవసరమైంది. అప్పుడు వారికి అండగా నిలిచినవారు బూర్గుల రామకృష్ణారావుగారు. "ఆంధ్రోద్యమ పరివ్యాప్తికై యంగలు చాచుచున్న హనుమంతరావుగారికి విద్వాంసుడు, రాజనీతి విశారదుడు, మహావక్త, ప్రజ్ఞావంతుడు, పరోపకారి, ప్రతిభాశాలి, నిరుపమాన తేజశ్శాలి యగు శ్రీ రామకృష్ణరావుగారి సాహచర్యము అత్యంత ముదావహము గొల్పెను. ఆంధ్ర పితామహులు ప్రారంభించిన ఆంధ్రోద్యమ క్రియా కలాప రంగములందు శ్రీ బూర్గులవారు ప్రశంసనీయమైన పాత్ర వహించినారు. కట్టు దిట్టములతో ఆంధ్రోద్యమము ప్రారంభించుటకు ఆంధ్ర జన సంఘ స్థాపనము 12-11-1921 తేదీనాడు జరిగినది. ఆ సంఘ స్థాపనకు ముఖ్యకారణము వివేకవర్ధనీ థియేటరులో ఆంధ్రులు పొందిన పరాభవము. ఒక్క యాంధ్రునకు జరిగిన పరాభవమునకు అలిగి ఆ రాత్రి ఆ మహాసభనుండి లేచిపోయిన పంద్రెండుగురు ఆంధ్ర మహాశయులలో శ్రీ రామకృష్ణారావుగారొక్కరు. ఈ విధముగా శ్రీ రావుగారు ఆంధ్ర మహాసభా విధాయకులలో నొక్కరుగా వన్నె కెక్కిరి. 1930 నుండి ప్రారంభమయిన ఆంధ్రమహాసభల 13 సమావేశములు జరిగి ఆంధ్ర మహాసభ సమావేశములు విరమించువరకు వీరు కర్ణధారులుగా, రూపకల్పకులుగా, ఆలోచనా తత్పరులుగా, రాయబారులుగా పరిశ్రమించియున్నారు"* మాడపాటివారు ఆంధ్రోద్యమానికి మూలపురుషులైనప్పటికీ ఆదిలో వారు ఆంధ్ర మహాసభలకు అధ్యక్షత

---

* 'స్రవంతి' 1967 నవంబరు సంచికలో ఆదిరాజు వీరభద్రరావు గారి వ్యాసం నుండి

వహించలేదు. విద్యాధికులైన వారు, సమర్థులు అధ్యక్షులుగా ఉండటం వారి అభిమతం. అందుచేత 1930 మార్చి 3, 4, 5 తేదీలలో మెదక్ జిల్లా జోగిపేటలో జరిగిన ప్రథమాంధ్ర మహాసభకు సురవరం ప్రతాపరెడ్డిగారు అధ్యక్షులు. వీరు బి.ఎ.బి.ఎల్. పట్టభద్రులు. పండిత పరిశోధకులు. మంచి రచయిత. గోలకొండ పత్రిక సంపాదకులుగా తెలంగాణంలో గొప్ప చైతన్యానికి కారకులైన వారు. బూర్గులవారికి అన్నవంటివారు. మహాసభ ప్రశాంతంగా జరిగింది.

రెండవ ఆంధ్రమహాసభ నల్లగొండ జిల్లా దేవరకొండలో 1931 మార్చి 3, 4, 5 తేదీలలో బూర్గుల రామకృష్ణారావుగారి అధ్యక్షతన జరిగింది. ఈ మహాసభ జరుపుకోవడానికి అనుమతి ఇచ్చేటప్పుడే నిజాం ప్రభుత్వం కొన్ని షరతులు విధించింది. సభాధ్యక్షుడు బైటివాడెవడూ కాగూడదు. అంటే నిజాం రాష్ట్రవాసియై ఉండాలి. "మహాసభలో జరిగే చర్యలన్నీ రాజకీయేతరములై ఉండవలెను. ఈ మహాసభలో జరిగిన ఏదైనా సంగతి ప్రభుత్వం వారి విధానానికి విరుద్ధంగా ఉన్న పక్షంలో రాబోవు సంవత్సరమున ఇట్టి దరఖాస్తులు అసలే అంగీకరింపబడవు." రెండవ మహాసభ దిగ్విజయంగా జరిగింది.

హైదరాబాదు నుంచి సభాధ్యక్షులైన బూర్గులరామకృష్ణారావుగారిని హైకోర్టు జడ్జి పదవి నుంచి అప్పుడే విరమించుకొని విశ్రాంతి గైకొంటూ ఉన్న పండిత కేశవరావు కోరట్కర్ తమ కారులో కూర్చోబెట్టుకొని సగౌరవంగా సభాస్థలి వద్దకు తీసుకొనివచ్చి, ఆంధ్రసోదరుల ఎడ తమ అభిమానాన్ని వెల్లడించారు. హైదరాబాదునుంచి దేవరకొండకు వెళ్ళుతున్న ప్రజానాయకులకు మార్గమధ్యంలో గ్రామాలవారు సుస్వాగతమిచ్చి సన్మానాలు చేశారు. హైదరాబాదులోని రెడ్డి హాస్టల్ విద్యార్థులు కాలినడకను బయలుదేరి దారిమధ్యలో గ్రామీణులను సభలకు రావలసిందిగా ఉత్సాహపరుస్తూ సభ జరిగే నాటికి దేవరకొండకు చేరుకున్నారు. వీరిలో రావి నారాయణరెడ్డిగారు పేర్కొనదగినవారు. దేవరకొండకు బైట సభకు వచ్చిన వారి కందరికీ అల్పాహారవిందు జరిగింది. ఆ ఊరివారు బాజాభజంత్రీలతో అక్కడికి వచ్చి పట్టణ వీధులగుండా పెద్ద ఊరేగింపుతో అశ్వారూఢులై ఉన్న సభాధ్యక్షులు బూర్గులవారిని క్రిక్కిరిసి ఉన్న మహాసభా మంటపానికి తీసుకువెళ్ళారు. ఈ మహాసభకు హాజరైన పెద్దలలో 'హైదరాబాదు బులెటిన్' పత్రికా సంపాదకులు శ్రీ బుక్కపట్నం రామానుజా చారిగారు

(పేరే బి.ఆర్. చారి అనే నామంతో ప్రసిద్ధులు), ప్రజామిత్ర సంపాదకులూ, సుప్రసిద్ధ చలనచిత్ర దర్శకులూ అయిన శ్రీ గూడవల్లి రామబ్రహ్మం గారు పేర్కొనదగినవారు. దేశభక్త బిరుదాంకితులైన వామన్ నాయక్ గారు, వారి కుమారులు శ్రీధర వామన నాయక్ గారు, బాజీ కృష్ణారావు గారు, బారిష్టరు శ్రీనివాస శర్మగారు కూడా సభకు విచ్చేశారు.

మహాసభ జయప్రదంగా జరగాలని కోరుతూ నిజాం పోలీసు శాఖా మంత్రియైన టి.జె. టాస్కర్ ఐ.సి.ఎస్, ఒ.బి.ఇ (ఇతడు ఆంగ్లేయుడు. ఆ రోజులలో రెవిన్యూ, పోలీసుశాఖల మంత్రులుగా ఆంగ్లేయులనే నిజాంవిధిగా నియమించవలసి ఉండేది), విద్యాశాఖ డైరెక్టరు మహమ్మదు హుసేన్, హైదరాబాదు నగర కోత్వాల్ (పోలీసు కమీషనర్)గా ఉన్న రాజా బహద్దూర్ వెంకటరామారెడ్డి ఒ.బి.ఇ; నిజాం కాలేజి ప్రిన్సిపాల్ టర్నర్ మొదలగు ప్రముఖులు సందేశాలు పంపారు.

దేవరకొండ ఆంధ్ర మహాసభలో చర్చింపబడ్డ తీర్మానాలలో బహిరంగ సభలపై నిర్బంధాలను విధించే గస్తీ నిషాన్ 53 ను తీసివేయవలెననేది చాలా ముఖ్యమైనది. 53 నెంబరుగల ఈ సర్క్యులర్‌తో నిజాం రాజు ప్రజల సమావేశ స్వాతంత్ర్యాన్ని అరికట్టాడు. నిజాం రాజ్య ప్రజలు రాజకీయంగా వెనుకబడి ఉండటానికి ఒక కారణం పబ్లిక్ మీటింగులు జరుపుకోవడంపై నిజాం ప్రభుత్వం విధించిన నిషేధాజ్ఞ. ప్రైవేటు పాఠశాలలు ఏర్పాటుచేసుకునే విషయంలో కూడా ప్రతిబంధకాలు కల్పించే నిర్బంధాజ్ఞలను తొలగించవలెనని మహాసభ వారు కోరారు. వెట్టిచాకిరీ, జాగీరు ఇలాకాలో ప్రజల కష్టాలు (జాగీరు రైతుకిక నేముందిరా, కష్టాలలోపలా నష్టాలువా అనే పాట ఆ కాలంలో విన వచ్చింది), భూమి రివిజన్ బందోబస్తు ఫలితంగా హెచ్చింపబడిన భూమి పన్నులు, ప్రపంచ వ్యాప్తంగా ఆర్థిక మాంద్యంఏర్పడి ధాన్యం ధరలు పడిపోవడం చేత రైతులు భూమి శిస్తు చెల్లించడంలో పడుతూన్న బాధలు - ఈ విషయాలన్నిటిపై ఆంధ్ర మహా సభ తీర్మానాలు చేసి ప్రభుత్వానికి పంపింది. బాల్య వివాహ నిషేధ శాసనాన్ని తెచ్చి సంఘ సంస్కారానికి దోహదం చేయవలసిందని కూడా కోరారు. ఏ విషయంపై అయినా మహాసభలో అనుకూలంగా లేక ప్రతికూలంగా వాదించే స్వేచ్ఛ సభ్యులకు ఉండేది. అందుచేత చర్చలు విపులంగా జరిగేవి.

రామకృష్ణారావుగారి అధ్యక్షోపన్యాసం "వివిధ సమస్యా విచారణ భూషితమై ప్రబోధాత్మకముగా నుండెను. మహాసభలో తీర్మానాలు చర్చింపబడుతూ ఉన్నప్పుడు 'శ్రీవారి వాణి పరిష్కారయుతమై వాసికెక్కెను"* "దేవరకొండ మహాసభలో రాజకీయాలు త్యాజ్యాలు కావన్నాడు రామకృష్ణారావు. ప్రజా హక్కులు లభిస్తేగాని అభివృద్ధి ఉండదన్నాడు......చల్లగా రాజకీయాల అవసరం విషయమై మాట్లాడగా మహారాష్ట్రులు తీవ్రమైన ఉపన్యాసాలు చేసినారు. మూడో మహాసభకు ప్రభుత్వం అనుమతి ఇవ్వలేదు."** "అసలు ఈ మహాసభలో ఆమోదింపబడ్డ తీర్మానాలన్నీ ప్రభుత్వ దృష్టిలో రాజకీయాలే అయినవి! ఆంధ్ర మహాసభ వారు ప్రభుత్వము విధించిన షరతులకు వ్యతిరేకంగా మహాసభ కార్యక్రమము సాగించినారనే నేరారోపణ చేస్తూ మూడు సంవత్సరాలవరకూ ఆంధ్ర మహాసభ మూడవ సమావేశం జరుపుకోవడానికి ప్రభుత్వం వారు అనుమతి ఇవ్వడానికి నిరాకరించిరి."

ఏమైనా దేవరకొండ ఆంధ్రమహాసభవల్ల తెలంగాణములోని నవయువకులలో ఒక కొత్త ఉత్సాహం కలిగింది. కొంచెం బరువైన తీర్మానాలు ప్రభుత్వం ఎదుటికి వచ్చాయి. బూర్గులవారి అధ్యక్షోపన్యాసం అనర్గళమై, భావ గాంభీర్యం కలిగి, ఆంధ్రోద్యమ భవిష్యత్తును సూచించేదిగా ఉండెనని మాడపాటి హనుమంతరావుగారు అన్నారు.

ఈ మహాసభ సందర్భంలో స్ఫుటంగా కానవచ్చిన మరొక విశేషం ఆనాటి సుప్రసిద్ధ హరిజన నాయకులుసభలో ప్రముఖంగా పాల్గొని మంచిఉత్సాహం చూపడం. వారు దీనిని తమ సభగా భావించి, తమ మనస్సులలో ఉన్న భావాలను స్వేచ్ఛగా వెల్లడించారు. "శ్రీ భాగ్యరెడ్డి వర్మ, వారి సహచరులు అస్పృశ్యతా నివారణ గూర్చి ప్రచారం చేశారు. వెట్టిచాకిరీ (forced labour) తొలగించి, హరిజనులకు సర్వ మానవులవలె స్వాతంత్ర్యము నొసగవలెనని వారు ఆంధ్ర మహాసభ వేదిక నుండి ప్రార్థించారు. హరిజనులకు దేవాలయ ప్రవేశం, చేనుడు బావులలో (నూతులు) నీరు తోడుకునే అవకాశం, ఇతర స్వాతంత్ర్యాలు హరి

* ఆదిరాజు వీరభద్రరావుగారి వ్యాసం నుంచి-

** కపిల కాశీపతిగారి 'బ్రహ్మానంద యాత్ర' అనే గ్రంథంలో-

జనులకు ఇవ్వవలెనని విన్నవించారు. నిమ్నజాత్యుద్ధరణ తీర్మానాన్ని ఆంధ్ర మహాసభవారు ఏకగ్రీవముగా అంగీకరించిరి."*

ఈ మహాసభ సందర్భంలో ఆనవాయితీగా జరిగే ఆంధ్ర మహిళాసభ సమావేశం డా॥ టి. వరలక్ష్మమ్మగారి అధ్యక్షతన జరిగింది. ఈమె వితంతు వివాహం చేసుకొన్న సంఘ సంస్కర్త్రి. పేరు పొందిన సమాజ సేవా పరాయణు రాలు. ప్రసవశాస్త్రంలో ప్రవీణురాలు. ఆ శాస్త్రంపై ఒక గ్రంథం కూడా రచించారు. ఈమె తన ఉపన్యాసంలో స్త్రీ విద్య, రోగులకు ఉపచారం చేయుటకై స్త్రీలు కొంత వైద్యవిద్య, మంత్రసానితనం నేర్చుకోవలసిన అవసరం నొక్కి చెబుతూ, ఆరోగ్యవారాలు, శిశువారాలు జరుపవలెనని ప్రబోధించారు. గోషా పద్ధతిని (పరదా పద్ధతి) ఖండించారు. కళావంతులలో వివాహపద్ధతిని ప్రవేశ పెట్టవలెనని సూచించారు.

ఈ మహాసభ సందర్భంలో జీవరక్షా జ్ఞాన ప్రచారక మండలివారు ప్రతి రోజూ గీతాలు పాడుతూ ప్రార్థనలు సల్పుతూ, తెల్లవారుజామున నగర సంకీర్తనం జరుపుతూ, రాత్రులందు యక్షిణీ దీపముల ద్వారా భూతదయ ప్రబోధం కావించారు. పద్మశాలీ సోదరుల సర్కసు ప్రదర్శనలు జరిగినవి. ప్రభుత్వ శాఖలు ప్రదర్శనములు ఏర్పాటు చేశాయి. ఈ ద్వితీయాంధ్ర మహాసభవల్ల ఆంధ్రోద్యమం మరొక మెట్టు పైకెగబ్రాకింది.

పైన చెప్పినట్లే మూడవ ఆంధ్రమహాసభకు ప్రభుత్వం అనుమతి ఇవ్వ లేదు. చివరకు ప్రభుత్వ విధానాలను విమర్శించకుండా ఉంటే అనుమతి ఇస్తామనీ, అందుకు పూచీగా రెండు వేల రూపాయల నగదు జమానతు కట్టాలనీ, ప్రభుత్వం తెలియపరచింది. నగదు జమానతు కట్టనక్కర లేకుండా మహాసభ జరుపుకోవడానికి ఆంధ్రోద్యమ నాయకులు ప్రయత్నించారు. ఆంధ్రోద్యమం రాజకీయమైనది కాదనీ, అది తెలంగాణా వాసుల

* '50 సంవత్సరాల హైదరాబాదు', రచయిత - శ్రీ మందముల నరసింగ రావు - 1977.

సారస్వత, సాంఘిక, నైతిక అభివృద్ధికోసం ఉద్దేశింపబడినదనీ ఉద్యమ నిర్వాహకుల వాదం. తుదకు పోలీసుశాఖ మంత్రిగారితో మాట్లాడడానికి మాడపాటి హనుమంతరావు పంతులుగారు, బూర్గుల రామకృష్ణారావుగారు వెళ్ళారు. ఆ సమావేశంలో జరిగిన సంభాషణ ఒక ముచ్చటగా, వినోదం గొల్పేదిగా ఉంది. మాడపాటి హనుమంతరావు పంతులుగారు దానిని గ్రంథస్థం చేసి ఉన్నారు*.

సమావేశంలో ప్రభుత్వం తరఫున పోలీసుశాఖ మంత్రి కర్నల్ ట్రెంచ్‌గారు, పోలీసు శాఖాధిపతి ఆర్మ్‌స్ట్రాంగ్ గారు, డిప్యూటీ హోం సెక్రటరీ అక్కడ ఆసీనులై ఉన్నారు. జరిగిన సంభాషణం వివరమిది: ఆంధ్ర మహాసభ పక్షాన బూర్గుల రామకృష్ణారావుగారే ఆనాడు మాట్లాడారు.

బూర్గుల రామకృష్ణారావు : మా ఉద్యమం కేవలం విశేషముగ గ్రంథాలయముల మూలమున విజ్ఞానం వ్యాపింపచేయునది.

పోలీసు శాఖాధిపతి ఆర్మ్‌స్ట్రాంగ్ : సర్, గ్రంథాలయోద్యమ మనగా నేమో నేను బెంగాలులో మంచి అనుభవం సంపాదించితిని. గ్రంథాలయములనగా విప్లవ సంఘములు (Revolutionary bodies). అంతే. మరేమీ లేదు.

పోలీసుశాఖ మంత్రిగారికీ, బూర్గులవారికీ మధ్య జరిగిన సంభాషణ ఇట్లా వుంది:

అమాత్యులు : జమానతు దాఖలు చేయుటకేల ఆక్షేపణ? అంత మాత్రం ద్రవ్యం మీరు చెల్లించజాలరా? చెల్లించినచో అది తుదకు ప్రభుత్వం వారు లాగుకొనెదరనుకొనుచున్నారా?

---

* 'తెలంగాణా ఆంధ్రోద్యమం' రెండవ భాగంలో

బూర్గుల: రాజ్యంలోని సగ భాగమునకు* ప్రాతినిధ్యం వహించే మేము ఈ మాత్రం ధనం చెల్లించజాలమని కాదు. దీనిని సర్కారువారు ఎట్లయినను లాగుకొందురనియు కాదు. జమానతు ఇచ్చి మహాసభ జరుపుట మా ఆత్మగౌరవమునకు భంగకరము. మహాసభ నిర్వహించుచున్న విద్యా వైజ్ఞానిక సామాజిక సేవను గురించి దేశీయుల హృదయములందుగల గౌరవ భావమును ఇట్టి షరతు నిర్మూలింపగలదని మాకు భయము కలదు. కనుక మేము ఒప్పుకోము.

అమాత్యులు: మంచిది. సెలవిత్తుము. ముందైన బుద్ధిగల పిల్లలవలె వర్తింపుడు.

ఇది 1934 సంవత్సరం నాటి మాట !

నిజాం బంట్లు ఏ విధంగా మాట్లాడుతారో బూర్గులవారికి తెలియని సంగతి కాదు. వారితో ఆయన తగాదా పడేవారు కారు. ఏదైనా రాజ్యాంగ విషయం చర్చకువస్తే దృఢవైఖరి అవలంబించి గట్టి సమాధానం చెప్పేవారు. ఈ పోలీసు మంత్రికి, అందులోనూ తాను ఆకాశంనుంచి ఊడిపడ్డానని భావించే ఆంగ్లేయునికి ఆయన బుద్ధిచెప్ప ప్రయత్నించేవారు కారు. తృణీకారభావంతో ఉపేక్షించారు. చుట్టుపట్ల ఉన్న తక్కిన బ్రిటిషిండియాలో స్థానిక స్వపరిపాలన కూడా వచ్చి ప్రజాప్రతినిధులు స్థానికాధికారాలను చెలాయిస్తూఉన్న రోజుల్లో నిజాం రాజ్యంలో సభలు జరుపుకోవడానికి అనుమతి కోసం ఇన్నిపాట్లు పడవలసి వచ్చింది! బ్రిటిషు ఇండియాలోని రాష్ట్రాలలో 1885 సంవత్సరంలో లార్డు రిపన్ గవర్నర్ జనరల్‌గా ఉన్న కాలంలో పెట్టిన తాలూకా బోర్డులు, జిల్లా బోర్డులు వంటి స్థానిక పరిపాలనా పద్ధతిని హైదరాబాదులో ప్రవేశపెట్టవలసిందిగా 1935 సంవత్సరంలో ఆంధ్రమహాసభ వేదిక నుండి ప్రభుత్వం వారిని వేడుకున్నారంటే రాజకీయంగా ఇక్కడి ప్రజలు పరిసర రాష్ట్రాలలో నివసించే తమ సోదరుల కంటె 50 సంవత్సరాలు వెనుకబడి ఉన్నారన్నమాట.

---

* ఆనాటి హైదరాబాదు రాజ్యంలో 16 జిల్లాలుండేవి. వాటిలో 8 జిల్లాలు హైదరాబాదు నగరము, తెలంగాణాలో ఉన్నవి. వరంగలు, కరీంనగర్, నల్లగొండ, మహబూబ్‌నగర్, మెదకు, నిజామాబాదు, అత్రాఫ్‌బల్దా, ఆదిలాబాదు తెలంగాణా జిల్లాలు. అప్పటికి ఖమ్మం జిల్లా లేదు.

తీరా అనుమతి లభించి ఖమ్మంలో మూడవ ఆంధ్ర మహాసభ జరిపితే అక్కడి స్థానిక 'సనాతన ధర్మపక్షావలంబులు' సంఘ సంస్కరణలను గూర్చి ఆంధ్రమహాసభ ఏమీ చర్చించరాదనీ, తీర్మానాలు చేయరాదనీ పేచీపెట్టారు. బూర్గులవారి అధ్యక్షతన జరిగిన రెండవ మహాసభలో బాల్య వివాహాలను నిషేధించాలని తీర్మానించారు కదా! అది బహుళ సనాతనులకు ఆగ్రహం కలిగించి ఉండవచ్చు. ఆ కాలంలో సనాతనులు రజస్వలానంతర వివాహాలను ససేమిరా ఆమోదించేవారు కారు. ఆంధ్రమహాసభ సంఘసంస్కరణ దృక్పథం కలదనివారికి తెలుసు. అయినా ఈ సనాతనులు అప్పట్లో నిజాం తాబేదార్లకు జో హుకుం అనే వారు. నిజాం ప్రభుత్వాన్ని ఎదిరించేవారు కాదు. కాని సంఘ సంస్కర్తలన్నా, అస్పృశ్యతను ఖండించే కాంగ్రెసువాదులన్నా, జాతీయవాదులన్నా వారితో కయ్యానికి కాలు దువ్వేవారు. వాదం వేసుకునేవారు. బహిష్కరించేవారు. వరంగలు జిల్లా అవ్వల్ తాలూక్దారు (జిల్లా కలెక్టరు) సనాతనులైన కొందరు వకీళ్ళను ఉసిగొల్పాడు. వారు మహజరు తయారుచేసి సభను నిలుపుదల చేయవలసిందిగా విన్నవించుకున్నారు. దానిని సాకుగా తీసుకొని వరంగలు అధికారి గడియ గడియకూ సభా నిర్వాహకులకు ఆజ్ఞలివ్వడం మొదలుపెట్టాడు. సనాతనులను సమాధాన పరచడానికి బూర్గులవారు ప్రయత్నించారు. తక్కిన విషయాన్ని ఆదిరాజు వీరభద్రరావుగారు ఇట్లా చెప్పారు.* "ఈ యధికారితో రాయబారములు సలుపుటకు, వాదించుటకు శ్రీ రామకృష్ణరావుగారు పూనుకొనిరి. అప్పటున శ్రీ రావుగారు ప్రదర్శించిన సహనశీలము, కార్య చతురత, సమయోచిత బుద్ధి గణనీయాంశములు. ఆత్మగౌరవమునకుగాని, సభాగౌరవమునకు గాని భంగము రాకుండ మహాసభా నిర్వహణమే పరమ కర్తవ్యముగా భావించి కృతకృత్యులయిరి. 'అలవి కానిచోట నధికుల మనరాదు, కొంచెముండు టెల్ల కొదువ గాదు' అను సూక్తి ప్రకారము ఖడ్గవాదమునుగాక కార్యవాదమునే ప్రధానముగా భావించి సమాధాన పూర్వకముగా భావించిరి." నిజం చెప్పాలంటే ఖమ్మం ఆంధ్రమహాసభ కొన్ని తీర్మానాలను చర్చించకుండా వదిలివేయవలసి వచ్చింది. రామకృష్ణారావుగారు హరిజనోద్యమం, ఖాదీ ఉద్యమం, వీటన్నిటితో పాల్గొన్నారు. సంఘ సంస్కార కార్యకలాపాలలో పాల్గొనడంవల్ల అప్పటి సాంఘికాచారాల దృష్ట్యా ఆయన విమర్శలకు కూడా గురియైనారు.

---

* 'స్రవంతి' 1967 నవంబరు సంచిక వ్యాసం.

ఆంధ్రోద్యమంలో మాడపాటి హనుమంతరావు పంతులుగారికి సహాయకులుగా పనిచేసిన ఆదిరాజు వీరభద్రరావుగారు రామకృష్ణారావుగారు ఆంధ్ర మహాసభలకు చేసిన సేవలను గూర్చి ఇట్లా చెప్పారు. "తరువాత సమావేశమయిన ఆంధ్ర మహాసభ పరంపరలో రావుగారు ప్రముఖ పాత్రను వహించి కృషి సలిపిరి. ఆలోచనా శక్తి, రచనా శక్తి, విషయగ్రహణ శక్తి, క్లిష్ట సమస్యా పరిష్కారశక్తి శ్రీ రావుగారియందు పుష్కలముగా నుండుటచే ఆ శక్తులు ఆంధ్ర మహాసభ కెంతయో ఉపకరించెను. నియమావళి నిర్మాణము, మహాసభ సూత్ర నిర్ణయము, నిర్బంధ విద్యా విధానము, ఆంధ్ర నిధి సేకరణము, మున్నగు వివిధ కార్యకలాపములకు సంబంధించిన ఉపసంఘములందు సభ్యులయి, మార్గ దర్శకులయి, రాజ్యాంగ సూత్ర వేదిత్వమున తమకుగల అపార వైదుష్యమును రాజనీతి చతురతను ప్రదర్శించి, అందరను ముగ్ధుల గావించిరి."*

రామకృష్ణారావుగారి సతీమణి బూర్గుల అనంతలక్ష్మీదేవిగారు 1936 డిసెంబరులో మహబూబ్‌నగర్ జిల్లా షాద్‌నగర్‌లో జరిగిన ఐదవ ఆంధ్ర మహాసభ సందర్భంగా సంప్రదాయం ప్రకారం జరిగిన ఆంధ్ర మహిళా సమావేశానికి అధ్యక్షత వహించి మహిళలకు చక్కని ప్రబోధం చేశారు. ఈ ఐదవ ఆంధ్ర మహాసభకు కొండా వెంకటరంగారెడ్డిగారు అధ్యక్షులు. క్రమంగా "ఆంధ్ర మహాసభలో రావి నారాయణరెడ్డిగారొక నూతన వర్గమునకు నాయకత్వము వహించిరి. తత్ఫలితముగా తరువాత జరిగిన సభలలో జాతీయపక్షము, మరియు కమ్యూనిస్టు పక్షము అను రెండు ప్రస్ఫుటమైన వర్గాలు ఏర్పడినవి.....భువనగిరి మహాసభ తరువాత ఆంధ్ర మహాసభ రెండు మహాసభలుగా చీలిపోయినది. ఒకటి జాతీయాంధ్ర మహాసభ. రెండవది రావి నారాయణరెడ్డిగారి ప్రాబల్యము కలిగిన ఆంధ్ర మహాసభ. భువనగిరి మహాసభను బహిష్కరించిన ఆంధ్ర (జాతీయ) నాయకులు 1945లో మడికొండలో మందుముల నరసింగరావుగారి అధ్యక్షతన పండ్రెడవ మహాసభ కావించిరి. ఈ మహాసభకు కొండా వెంకటరంగారెడ్డి గారు పెట్టని కోటలై యుండిరి. ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు పంతులు

---

* 'స్రవంతి' 1967 నవంబరు సంచిక వ్యాసంలో.

గారి ఆశీస్సులు ఈ సభకు లభించినవి. బూర్గుల రామకృష్ణారావు పంతులుగారి సానుభూతి కూడా లభించినది."*

ఈ విధంగా రామకృష్ణారావుగారు జాతీయోద్యమ శక్తులను బలపరుస్తూ హైదరాబాదు రాష్ట్ర ప్రజాజీవితంలో ప్రముఖ స్థానమాక్రమించారు. 1946లో మెదకు జిల్లా కంది గ్రామంలో పదమూడవ ఆంధ్ర మహాసభ జమలాపురం కేశవరావుగారి అధ్యక్షతన జరిగిన తర్వాత, ఆంధ్ర మహాసభ స్టేట్ కాంగ్రెసులో లీనమైపోయింది. స్టేట్ కాంగ్రెస్ ఆంధ్ర ప్రాంత సంఘం ఏర్పడింది.

---

* 'తెలంగాణాలో జాతీయోద్యమాలు', రచయిత దేవులపల్లి రామానుజరావు, దేశీ ప్రచురణ, సెప్టెంబరు 1974.

# స్టేట్ కాంగ్రెసు నాయకుడు

హైదరాబాదు స్టేటు కాంగ్రెసు వ్యవస్థాపకులలో బూర్గుల రామకృష్ణారావు గారు ముఖ్యులు.

1937 డిసెంబరులో భారత జాతీయ కాంగ్రెసు మహాసభ సుభాస్ చంద్ర బోసు అధ్యక్షతన హరిపురాలో జరిగింది. ఆ సభకు హైదరాబాదు నుంచి చాలా మంది ప్రతినిధులు వెళ్ళారు. ఆ మహాసభలో దేశీయులు పోరాడి, సంపాదించే స్వాతంత్ర్యం దేశీయ సంస్థానాల ప్రజలకు కూడా సమానంగా వర్తిస్తుందనీ, అయితే దేశీయ సంస్థానాల ప్రజలు వారి శక్తిసామర్థ్యాల పైననే పూర్తిగా ఆధార పడి ఆందోళనలు, పోరాటం జరుపవలసి ఉంటుందనీ ఒక తీర్మానం చేయబడింది. అఖిల భారత జాతీయ కాంగ్రెసు ఒరవడిలోనే హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ అనే పేరుతో ఒక సంస్థను ఏర్పాటు చేయవలెనన్న సంకల్పం ఇక్కడి నాయకు లకు కలిగింది. 1938 జనవరి 29 నాడు వీరు ఒక సమావేశం జరిపి స్టేట్ కాంగ్రెసు స్థాపనకు ఏకగ్రీవంగా ఒక నిర్ణయం చేశారు. ప్రాథమిక సభ్యులను చేర్పించడానికీ, సంస్థను క్రమబద్ధంగా నిర్మాణం చేసేందుకు అవసరమైన ఇతర చర్యలు తీసుకోవడానికి 1938 జూలైలో ఒక తాత్కాలిక సమితిని (Provisional Committee) ఏర్పాటు చేశారు. ఈ సమితిలో బూర్గుల రామకృష్ణా రావు, జి. రామాచారి, హరిశ్చంద్ర హెడా, శ్రీధర నాయక్, జనార్దనరావు దేశాయి, సిరాజుల్ హసన్ తిర్మిజీ, పాండురంగ జోషి, రామకృష్ణ ధూత్ సభ్యులు. ఈ తాత్కాలిక సమితి జాతీయభావాలుగల అన్ని మతాల వారినీ, అన్ని కులాల వారినీ హైదరాబాదు స్టేట్ కాంగ్రెసులో చేరవలసిందని విజ్ఞప్తి చేసింది. దాదాపు 1200 మంది స్టేట్ కాంగ్రెస్ సభ్యులుగా చేరారు.

స్టేట్ కాంగ్రెస్ తాత్కాలిక సమితి కన్వీనర్ అయిన బూర్గుల రామకృష్ణా రావుగారు ఒక పత్రికా ప్రకటలో హైదరాబాదు స్టేట్ కాంగ్రెసుకు ఇండియన్ నేషనల్ కాంగ్రెసుతో ఎలాంటి సంబంధం లేదనీ, ఈ సంస్థ తన లక్ష్యాలలో,

కార్యక్రమాలలో ఈ రాష్ట్ర ప్రజలకే వర్తించి ఉండగలదనీ, రాజకీయంగా కాక మత రీత్యా బైటి ప్రాంతంలో పనిచేస్తూ ఉన్న ఏ సంస్థతోనూ సంబంధం కలిగి ఇది వ్యవహరించదనీ, ఆసఫియా రాజవంశపు ఛత్రచ్ఛాయ క్రింద బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపన ఈ సంస్థ లక్ష్యమనీ స్పష్టం చేశారు.* భారత జాతీయ కాంగ్రెసు అంటే నిజాం ప్రభుత్వం బెదిరిపోయేది కాబట్టి ఈ విధంగా చెప్పవలసి వచ్చింది. బాధ్యతాయుత ప్రభుత్వమంటే ఏమిటి అన్న ప్రశ్న ఇక్కడ వస్తుంది. అంటే ప్రజాస్వామిక పద్ధతి ప్రకారం వయోజన ఓటింగు హక్కుతో ఎన్నుకోబడ్డ ప్రతినిధులచే నడుపబడే ప్రభుత్వం. అయితే అట్టి ప్రభుత్వం నిజాం రాజు ఆధ్వర్యాననే పాలించగలదని స్టేట్ కాంగ్రెస్ నాయకులు స్పష్టం చేశారు.

కాని హైదరాబాదులో బాధ్యతాయుత ప్రభుత్వం అనేది ఏ పేరుతో ఏ రూపంలో ఏర్పడినా అది హిందూ ప్రజల ఆధిక్యతకే దారి తీస్తుందనీ, అట్టి ఉద్యమానికి తాము సమ్మతించరాదని నిజాం ముస్లిం నాయకులు భావించారు. బాధ్యతాయుత పరిపాలన ఆసఫ్‌జాహీ వంశం వారి నిరంకుశ పాలనకు గొడ్డలి పెట్టు అని నిజాం ప్రభుత్వం బెదిరిపోయింది. అయినప్పటికీ రామకృష్ణారావుగారు కొందరు మిత్రులను కలుసుకొని వారికి విశ్వాసం కలిగేట్టు నచ్చజెప్పారు వారు సహకరిస్తామని అన్నారు.

తాత్కాలిక సమితి సభ్యులను చేర్చిస్తూ పోయింది. సర్వసభ్య సమావేశాన్ని జరిపి స్టేటు కాంగ్రెసు నియమావళిని ఆమోదించడానికి, కార్యవర్గాన్ని ఎన్నుకోవడానికి 1938 సెప్టెంబరు 9 వ తేదీన సమావేశమవడానికి నిర్ణయించింది. కాని హైదరాబాదు ప్రభుత్వం సెప్టెంబరు నెల మొదటివారంలో శాంతి భద్రతలకు సంబంధించిన ప్రజారక్షణ శాసనాన్ని అమలుపరుస్తూ నిజాం వారి ఫర్మానాను జారీచేసింది. అప్పటి హైదరాబాదు ప్రధానమంత్రి సర్ అక్బర్ హైదరి ఆధ్వర్యాన 1938 సెప్టెంబరు 7 వ తేదీన నిజాం ప్రభుత్వం స్టేట్ కాంగ్రెసును చట్ట విరుద్ధమైన సంస్థగా ప్రకటిస్తూ నిషేధించింది. చట్ట విరుద్ధంగా ప్రకటించడానికి ప్రభుత్వం చెప్పిన కారణం స్టేట్ కాంగ్రెసు మత పాక్షిక

* '50 సంవత్సరాల హైదరాబాదు' - మందుముల నరసింగరావు, 1977.

సంస్థ అని! (Communal Organisation). దీనితో సెప్టెంబరు 9వ తేదీన జరగవలసిన సమావేశం వాయిదాపడింది. ఈ విధంగా స్టేట్ కాంగ్రెస్ అన్ని హంగులతో పుట్టకముందే నిజాం ప్రభుత్వం దానిని నిషేధించిందన్న మాట. దీనిపై స్టేట్ కాంగ్రెస్ తాత్కాలిక సమితివల్ల అధికారం పొందిన ప్రతినిధి— వ్యవహర్త హోదాలో బూర్గుల రామకృష్ణారావుగారు నిజాం ప్రభుత్వ రాజ్యాంగ వ్యవహారాల కార్యదర్శియైన నవాబ్ అలీయావర్ జంగ్‌ను కలిసి సంభాషణలు జరిపారు. స్టేట్ కాంగ్రెస్ ఏ విధంగానూ మతపాక్షిక సంస్థ కాదనీ, రాష్ట్రం వెలుపలి ఏ సంస్థతోనూ దీనికెట్టి సంబంధాలులేవనీ, అయితే సభ్యులు వ్యక్తిగతంగా బైటి రాజకీయ నాయకులతో పరస్పరం అభిప్రాయాలు తెలుపుకున్నా లేక బైటివారి సలహాలు పొందినా అట్టివారిని నిర్బంధపరచడం సాధ్యపడదనీ రామకృష్ణారావుగారు అలీయావర్ జంగ్‌గారికి తెలియపరిచారు. జంగ్‌గారు రావుగారి ముందు రెండు అంశాలు ఉంచారు. ఒకటి— స్టేట్ కాంగ్రెస్ పేరు మార్చాలి. ముఖ్యంగా 'కాంగ్రెసు' అనే పదాన్ని తొలగించాలి. రెండవది ప్రభుత్వం స్టేట్ కాంగ్రెసును మతపాక్షిక సంస్థ అని చెప్పింది. కాబట్టి ఇత్తెహాదుల్ ముసల్మీన్ నాయకుడైన బహద్దూర్‌యార్ జంగ్‌కూ, జాతీయవాది అయిన మందుముల నరసింగరావుగారికీ ఆ మధ్య జరిగిన సంభాషణలలో ఎంత వరకు సయోధ్యకుదిరిందీ, దాని వివరాలేమిటీ ప్రభుత్వానికి స్పష్టంచేయాలి. పై ఇద్దరి సంభాషణలు 'జంగ్-సింగ్ సంభాషణలు' అనే పేరుతో హైదరాబాదు చరిత్రలో ప్రసిద్ధిజెందినవి. జంగ్ అంటే బహద్దుర్‌యార్‌జెంగ్, సింగ్ అంటే మందుముల నరసింగరావు. రెండు మూడు నెలలపాటు ఈ సంభాషణలు జరిగాయి. ముస్లిముల మత సాంస్కృతిక హక్కులు, ప్రభుత్వోద్యోగాలు, బాధ్యతాయుత ప్రభుత్వం అనే అంశాలపై ఈ సంభాషణలు సాగినవి. తుదకు బాధ్యతాయుత ప్రభుత్వం అనే అంశంపై సంభాషణలు విఫలమైనవి.

బూర్గుల రామకృష్ణారావు స్టేట్ కాంగ్రెస్ తాత్కాలిక సమితి ప్రతినిధిగా అన్ని విషయాలు ప్రభుత్వ కార్యదర్శికి నచ్చజెప్ప ప్రయత్నించారు. కాని స్టేట్ కాంగ్రెసుపై నిషేధాన్ని తొలగించడానికి నిజాం ప్రభుత్వం నిరాకరించింది. సంప్రదింపులు విఫలమైనవి.* అప్పుడు కాంగ్రెసువారు తాత్కాలిక

* ఈ విషయాలు 'ఫ్రీడం స్ట్రగుల్ ఇన్ హైదరాబాద్' సంపుటాలలో నమోదు చేయబడి ఉన్నవి.

సమితిని రద్దుచేసి దాని స్థానంలో కార్యాచరణ సమితిని (Council of Action) ఏర్పాటుచేశారు. కార్యాచరణ సమితి సమావేశమై ప్రభుత్వాజ్ఞలను ధిక్కరిస్తూ మహారాష్ట్ర నాయకుడైన గోవిందరావు నానల్ నాయకత్వంలో 1938 అక్టోబరు 24 తేదీన హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు స్థాపించబడిందని ప్రకటిస్తూ, కార్యాచరణ సమితియే స్టేట్ కాంగ్రెస్ కార్యవర్గంగా వ్యవహరించ గలదని ప్రకటన చేసింది. దీని అధ్యక్షుడు గోవిందరావు నానల్; ప్రధాన కార్యదర్శి రామకృష్ణ ధూత్; సభ్యులు; రావి నారాయణరెడ్డి, జనార్దనరావు దేశాయి, శ్రీనివాసరావు బోరీకర్. వీరు స్టేట్ కాంగ్రెసుపై నిషేధాజ్ఞకు వ్యతిరే కంగా 1938 అక్టోబరు 24 తేదీన సత్యాగ్రహం చేశారు. ప్రభుత్వం వీరిని నిర్బంధించింది. మరి మూడు రోజులకు స్వామి రామానంద తీర్థ మొదటి డిక్టేటర్‌గా సత్యాగ్రహంచేసి అరెస్టు అయ్యారు. ఈ విధంగా కొన్ని దళాలు సత్యాగ్రహం చేశాయి. చివరకు గాంధీ మహాత్ముని ఆదేశానుసారం 1938 డిసెంబరు 24 తేదీన సత్యాగ్రహం నిలిపివేయబడింది. బూర్గుల రామకృష్ణారావు గారు ఈ సందర్భంలో సత్యాగ్రహంచేసి జైలుకు వెళ్ళలేదు. సంప్రదింపులు, రాయబారాలతో నిజాం ప్రభుత్వాన్ని ఒప్పించడానికి ఆయన శతవిధాల ప్రయత్నించారు. ఆయన ప్రధానంగా రాజ్యాంగ విధానవాది. ప్రజా బాహుళ్యపు నాయకులు కారు. స్వామీజీవలె ప్రజానీకపు నాయకులు (Mass leader)కారు. అటువంటివారు జైలుకు వెళ్ళడంకన్నా, బైట ఉండి సలహా సంప్రదింపులతో ఏమైనా సాధించేందుకు అవకాశాలు ఎల్లప్పుడూ ఉంటాయి.

రామకృష్ణారావుగారు అరెస్టు అయిన సందర్భాలు లేకపోలేదు. 1942 అక్టోబరు 2 వ తేదీన (అనగా క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో మహాత్ముని జన్మదినాన) వారు క్విట్ ఇండియా నినాదంచేస్తూ సత్యాగ్రహం చేయబూను కున్నారు. కాని కొందరు ముస్లిం నాయకులు వారి సభకు అనుమతి తెప్పిస్తామని వారిని ఆపారు. వారు తిరిగి అక్టోబరు 8వ తేదీన హైదరాబాదులోని విక్టరీ ప్లే గ్రౌండ్ మైదానంలో జాతీయపతాకాన్ని ఎగురవేస్తూ క్విట్ ఇండియా నినాదాలు చేస్తూ బహిరంగ సభలపై నిషేధాజ్ఞలను ఉల్లంఘిస్తూ సత్యాగ్రహంచేశారు. ప్రజలు రాకుండా పోలీసులు అన్ని మార్గాలలో నిలబడి జనాన్ని ఆప ప్రయత్నించారు. కాని ప్రజలు వందలకొద్దీ ఆ మైదానానికి వచ్చి క్విట్ ఇండియా నినాదాలు

చేశారు. రావుగారిని అరెస్టు చేసి మూడు రోజులు నిర్బంధంలో ఉంచి విడుదల చేశారు.

1947 మే 7 వ తేదీన సోషలిస్టు పార్టీ నాయకుడు జయప్రకాశ్ నారాయణ్ హైదరాబాదు వచ్చి సికింద్రాబాదు కర్బలా మైదానంలో జరిగిన బ్రహ్మాండమైన బహిరంగ సభలో నిజామును మీర్‌జాఫర్‌గా వర్ణించారు. మరుసటి రోజు ఆయన హైదరాబాదులో రఘునాథ్‌బాగ్ సభలో ప్రసంగించవలసి ఉంది. కాని పోలీసులు ఆ రాత్రే ఆయనను అరెస్టుచేసి హైదరాబాదు నుండి ఆయనను బహిష్కరిస్తున్నట్లు ప్రకటించి, బొంబాయికి పంపారు. రఘునాథ్‌బాగ్ సభను ప్రభుత్వం నిషేధించింది. జంటనగరాలలో ఉద్రిక్తత హెచ్చింది. 144 సెక్షన్ ప్రకటించారు. అయినా భాయి రామమూర్తినాయుడు సభ జరిపారు. వేల కొద్దీ జనం వచ్చారు. బూర్గుల రామకృష్ణారావుగారు ఈ బహిరంగ సభలో ప్రసంగిస్తూ జయప్రకాశ్ నారాయణ్‌వంటి స్వాతంత్ర్య యోధుణ్ణి హైదరాబాదు నుంచి బహిష్కరించడాన్ని ఖండిస్తూ తీర్మానం చదివారు. వారిని, వారితోబాటు రామమూర్తి నాయుడు, ఆర్. వి. బిడప్, బసవరాజు, ఈశ్వరయ్యలను ప్రభుత్వం నిర్బంధించింది. ఇవన్నీ స్టేట్ కాంగ్రెస్ పోరాటంలోని మహోజ్జ్వల ఘట్టాలు.

చివరకు నిజాం ప్రభుత్వం 1946 జూన్ 3 వ తేదీన స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధాన్ని ఉపసంహరించుకుంది. దాదాపు 8 సంవత్సరాలు స్టేట్ కాంగ్రెసు అజ్ఞాతవాసం చేయవలసి వచ్చింది. ఆంధ్ర మహాసభ, మహారాష్ట్ర కర్ణాటక పరిషత్తులు స్టేట్ కాంగ్రెసులో లీనమైపోయాయి.

స్టేట్ కాంగ్రెసు అధ్యక్షపదవికి జరిగిన ఎన్నికలలో స్వామి రామానంద తీర్థ, బూర్గుల రామకృష్ణారావుగారలు పోటీ చేశారు. చాలా గట్టిపోటీ ఇది. మూడు ఓట్లతో స్వామీజీ గెలిచారు. యువతరం వారు బూర్గులవారు మితవాది అని ప్రచారం చేసి స్వామీజీని గెలిపించ బూనుకున్నారు. స్వామీజీ ప్రజా బాహుళ్యపు నాయకుడు కదా.

హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు మహాసభ హైదరాబాదు నగరంలోని ముషీరాబాదు మైదానంలో 1947 జూన్ 16, 17, 18 తేదీలలో భారీ ఎత్తున

జరిగింది. స్వామి రామానంద తీర్థ అధ్యక్షత వహించారు. వారు తమ అధ్యక్షోప న్యాసంలో హైదరాబాదు ఇండియన్ యూనియన్‌లో విలీనం కావాలనీ, ప్రజా స్వామ్య పద్ధతిలో వయోజన ఓటింగుద్వారా శాసనసభకు ఎన్నికలు జరగాలనీ, భారత రాజ్యాంగ పరిషత్తులో పాల్గొనడానికి నిర్ణయించి హైదరాబాదు ప్రతినిధు లను ఎన్నుకోవాలనీ ఉద్ఘాటించారు.

బూర్గుల రామకృష్ణారావుగారు ఈ మహాసభలో ప్రధాన రాజకీయ తీర్మా నాన్ని ప్రవేశపెట్టారు. ఆ తీర్మానంలో హైదరాబాదు భారత యూనియన్‌లో విలీనం కావాలి. బాధ్యతాయుత ప్రభుత్వాన్ని స్థాపించాలి అని కోరారు. బ్రిటిషు వారు భారతదేశం నుంచి వెళ్ళిపోయాక తాను స్వతంత్ర ప్రతిపత్తిగల రాజు హోదాను పొందే అర్హత కలిగి ఉంటానని నిజాం ఒక ఫర్మాన్ ద్వారా ప్రక టించినందుకు ఈ తీర్మానంలో విచారం వెలిబుచ్చబడింది. హైదరాబాదు రాష్ట్రాన్ని భారతదేశంనుండి విడదీసి నిరంకుశ ప్రభుత్వాన్ని స్థాపించడానికి జరిగే ఎట్టి ప్రయత్నాన్నయినా ప్రతిఘటించవలసిందిగా స్టేట్ కాంగ్రెసు సంస్థ ప్రజానీకానికి పిలుపు నిచ్చింది. స్టేట్ కాంగ్రెసు ధ్యేయాన్ని సాధించడానికి, ముందు ముందు ఏర్పడబోయే ఎట్టి ఉపద్రవకర పరిస్థితి నైనా ఎదుర్కోవడానికి తగు చర్య తీసుకునే అధికారాలు కార్యవర్గం కలిగి ఉంటుందని కూడా ప్రకటించబడింది. ఈ తీర్మానంలో ఒక ముఖ్య విషయం ఏమిటంటే – హైదరాబారు రాష్ట్రంలోని ప్రజలు, వారు ఆంధ్రులు కాని, మహారాష్ట్రులుకాని, కన్నడులుకాని, హిందువులు లేక ముస్లిములు కాని అయా పరిసర ప్రాంతాలలో నివసించే ప్రజల తాలూకు వారేననీ, కొన్ని చారిత్రక సంఘటనలు కారణంగా కృత్రిమమైన హద్దులు ఏర్పడ్డవనీ నిజాం రాజుకు హెచ్చరిక చేయడం. కాబట్టి నిజాం ఈ హెచ్చరికను లక్ష్యపెట్టకపోతే కృత్రిమ మైన సరిహద్దులు చెరిపివేయబడతాయన్న హెచ్చరిక ఈ తీర్మానంలోనే ఉంది.

రాష్ట్రమంతటా భయానకమైన ఉద్రిక్త పరిస్థితి ఏర్పడినప్పుడు రామకృష్ణారావుగారు, కొండా వెంకట రంగారెడ్డి, డా. ఎం. చెన్నారెడ్డి, కాశీనాథరావు వైద్యగారలను వెంటబెట్టుకొని గ్రామాలలో పర్యటించారు. ప్రజలు హత్య గావింపబడుతున్నారు. ఆస్తులు దోపిడీ అవుతున్నవి. ఇళ్ళు తగలబెడుతు న్నారు. వెళ్ళిన ఈ కాంగ్రెసు నాయకులను పోలీసులూ, ఇత్తెహాదుల్ ముసల్మీన్

వారూ ఒక గ్రామంలో నిలువకుండా చేశారు. పగలు నిజాం పోలీసుల, రజాకార్ల దినక్‌కీ సర్కార్, రాత్రులు సాయుధ కమ్యూనిస్టుల రాత్‌కీ సర్కార్‌గా ఉంది పరిస్థితి! ఆ స్థితిలో ఈ నాయకులు గ్రామస్తులకు ధైర్యం చెప్పారు. కాంగ్రెస్ జెండా చూపి వారికి తమపట్ల విశ్వాసం కలుగజేశారు. వారితో మాట్లాడి ఊరట కలిగించారు.

నిజాం రాజ్యంలో ప్రజల ధన, మాన, ప్రాణాలకు రక్షణలేని స్థితి ఏర్పడినప్పుడు విఖ్యాత న్యాయవాదులైన రామకృష్ణారావు, ఎన్. కె. రావు, కొండా వెంకటరంగారెడ్డి గారలు రాష్ట్రంలోని న్యాయవాదులంతా కోర్టులను బహిష్కరించాలనీ, తద్వారా ప్రభుత్వాన్ని స్తంభింపజేయాలనీ విజ్ఞప్తి చేశారు. అన్ని జిల్లాలలో న్యాయవాదులు కోర్టులు బహిష్కరించారు. స్టేట్ కాంగ్రెస్ ఉద్యమం అప్రతిహతంగా సాగిపోయింది.

అయితే చివరకు పోలీసు చర్యతోగాని నిజాం లొంగలేదు. 1948 సెప్టెంబరు 13వ తేదీ తెల్లవారుజామున భారత సేనలు హైదరాబాదువైపు పురోగమిస్తూ సెప్టెంబరు 17వ తేదీ సాయంత్రానికి హైదరాబాదు చేరుకున్నవి. నిజాం లొంగిపోయాడు. మేజర్ జనరల్ చౌధురి ఆధ్వర్యాన మిలిటరీ ప్రభుత్వం ఏర్పాటైంది. ఈ విధంగా 1724లో హైదరాబాదులో ఏర్పడ్డ ఆసఫియా రాజ్యం అంతరించి, భారత యూనియన్‌లో హైదరాబాదు పార్టు బి రాష్ట్రమైంది. దరిమిలా నిజాం నవాబు మీర్‌ఉస్మాన్ అలీఖాన్‌ను హైదరాబాదు రాష్ట్ర రాజప్రముఖ్‌గా భారత ప్రభుత్వం నియమించింది.

పోలీసు చర్య జరగడానికి దాదాపు ఒక సంవత్సరం ముందు భారత ప్రభుత్వానికీ, హైదరాబాదు నిజాముకూ మధ్య యథాతథపు ఒడంబడిక జరిగింది. ఈ ఒడంబడిక పైన నిజాం రాజు 1947 నవంబరు 29వ తేదీన సంతకం పెట్టాడు. ఈ ఒడంబడిక ననుసరించి హైదరాబాదులో భారత ప్రభుత్వ ఏజెంట్ జనరల్‌గా కె. ఎం. మున్షీ నియమింపబడ్డారు. 1948 జనవరి 5వ తేదీనుంచి సెప్టెంబరు 21వ తేదీవరకూ మున్షీ హైదరాబాదులో ఆ పదవిలో ఉన్నారు. అప్పుడాయన సికింద్రాబాదు కంటోన్మెంటులోని 'దక్షిణ సదన్' అనే భవనంలో నివసించారు. నిజం చెప్పాలంటే అది ఆయనకు ఉన్నత పదవికాలం కాదు-కష్ట

కాలం-హైదరాబాదు జ్ఞాపకాలను గూర్చి ఆయన వ్రాసిన 'ది ఎండ్ ఆఫ్ ఆన్ ఇరా' అనే గ్రంథం చదివితే ఎంతటి ప్రమాదకరమైన కాలంలో ఆయన నిజాం రాజధానిలో నివసించారో తెలియవస్తుంది. ఆయన్ను సందర్శించడానికి నిజాం పోలీసులు ఎవరినీ వెళ్ళనిచ్చేవారుకారు. ఒకవేళ ఎవరైనా వెళ్ళి వస్తూ ఉంటే వారి పేరు, వివరాలు వ్రాసి ఉంచుకునేవారు. అట్టివారికి ఏమి కీడు జరుగుతుందో ఎవరూ చెప్పజాలేవారు కారు. మున్షీని చంపే ప్రయత్నాన్ని కూడా రజాకార్లు చేశారు! నిజాం ప్రధానమంత్రి లాయకలీ, అతని మంత్రులూ, ఉన్నతాధికార్లూ మున్షీని అవాంఛనీయమైన వ్యక్తిగా పరిగణించారు. వారి దృష్టిలో ఆయన ద్రోహి. భారత ప్రభుత్వ గూఢచారి. ఈ విధంగా నిజాం తాబేదార్లు మున్షీకి, హైదరాబాదు ప్రజలకూ మధ్య పెద్ద ఎత్తైన గోడ కట్టేశారు. అయినా ఆయన అందులో ధైర్యంగా ఉంటూ తన విధులు నెరవేరుస్తూ ఉండేవారు. పరిస్థితి ఇలా ఉన్నప్పటికీ కొందరు జాతీయవాదులు, దేశభక్తులూ నిజాం ఆంక్షలను లెక్కచేయకుండా 'దక్షిణ సదన్'కు వెళ్ళి ఆయనను దర్శించి మాట్లాడివస్తూ ఉండేవారు. అట్లా సాహసించి మున్షీని కలుసుకోవడానికి వెళ్ళిన వారిలో రామకృష్ణారావుగారు ప్రథములు. ఈ విషయాన్ని వెల్లడిస్తూ మున్షీగారే ఇలా వ్రాశారు: "రామకృష్ణారావు పూర్ణపురుషుడు. వినయశీలి.సచ్ఛీలుడు. నిజాముడు అతి సన్నిహితంగా ఉండే వ్యక్తుల కూటమి యొక్క విశ్వాసాన్ని సైతం చూరగొన గలిగిన స్ఫటిక సదృశమైన నిజాయతీపరుడు. ఆయన నాతో బహిరంగంగానే వ్యవహరించేవారు. భారతదేశంలో కలిసిపోవడానికి ఇష్టపడనట్టి నిజాం నిరోధక శక్తిని అధిగమించడానికి అనుసరించవలసిన విధానాలను గూర్చి నాకు చాలా సలహాలు వస్తూ ఉండేవి. వాటన్నిటిని గూర్చి నేను శ్రీ రామకృష్ణారావుతో చర్చించాను. ఆయన గుండె నిబ్బరమును, యుక్తాయుక్త విచక్షణను, సూక్ష్మ పరిశీలనా దృష్టిని పొగడకుండా ఉండలేక పోతున్నాను. ఒకప్పుడు నిజాం బంట్లు కొందరు శ్రీ రామకృష్ణారావును జైలులో పెట్టవలెనని చూచారు. క్రూరాతి క్రూరంగా గడచిన ఆ తొమ్మిది మాసాల చరిత్రలో ఒక పర్యాయం నిజాం నుంచి ఆయనకు మంత్రి పదవిని ఇస్తామని ఆహ్వానం కూడా వెళ్ళింది. బెదిరింపులకు లొంగిపోనట్టే, ఆయన ఎరగా చూపిన పదవీ వ్యామోహానికి కూడా వశుడు కాలేదు."*

---

* 'భవన్స్ జర్నల్' పత్రిక 1967 అక్టోబరు 8 సంచికలో 'కులపతి లేఖ' శీర్షికతో కె. ఎం. మున్షీ "మనసున మెదిలే ఆప్త మిత్రుడు బూర్గుల రామకృష్ణారావు" అంటూ వ్రాసిన వ్యాసంలో. ఈ వ్యాసం బూర్గులవారి సుగుణగణాలను చక్కగా అంచెనా వేసింది.

సర్ మిర్జా ఇస్మాయిల్ నిజాముకు ప్రధానమంత్రి అయిన తర్వాత ఆయన తన మంత్రి మండలిలో చేరవలసిందిగా ఒక నమ్మకస్తుడైన వ్యక్తి ద్వారా బూర్గుల రామకృష్ణారావుగారికి కబురు పంపారు. ఆ ఆహ్వానాన్ని బూర్గుల వారు నిరాకరించారు. ఒక వంక స్టేట్ కాంగ్రెస్ బాధ్యతాయుత ప్రభుత్వం కోసం, భారత యూనియనులో హైదరాబాదు సంస్థాన విలీనం కోసం, ఒక మహోద్యమం నడుపుతూ ఉండగా తాను తుమ్మితే ఊడిపోయే ముక్కులా ఉన్న ఆ మంత్రి మండలిలో చేరడం అర్థరహితమని బూర్గులవారు కబురుపెట్టారు. అయితే మిర్జా ఇస్మాయిల్ ఏ ఉద్దేశంతో హైదరాబాదు ప్రధానమంత్రిగా వచ్చాడో' ఆ లక్ష్యసాధనలో కృతకృత్యుడు కాగలిగితే తాను సంతోషిస్తానని తెలియ పరిచారు. రామకృష్ణారావుగారు చేర నిరాకరించడంతో ఇస్మాయిల్ చాలా నిరుత్సాహపడ్డాడు. పైగా మజ్లిస్ ఇత్తెహాదుల్ ముసల్మీనువారి చర్యలు పెద్ద ఉపద్రవంగా పరిణమించడంతో ఆయన ఇది సామదాన భేదోపాయాలతో అయ్యేపని కాదని బెంగుళూరు వెళ్ళిపోయి అక్కడినుంచి తన పదవికి రాజీనామా పంపాడు. నిజాము పిలువనంపినా రాలేదు. అలాగే నిజాం 1937లో ఇవ్వజూపిన హైకోర్టు న్యాయమూర్తి పదవినికూడా బూర్గులవారు నిరాకరించారు. అరావముదు అయ్యంగార్ సంస్కరణల కమిటీకి నివేదిక సమర్పించడానికై ప్రజల తరఫున మాడపాటి హనుమంతరావు పంతులుగారి అధ్యక్షతన ఏర్పాటు చేయబడ్డ కమిటీకి రామకృష్ణారావుగారు కార్యదర్శిగా ఉండి సమగ్రమైన నివేదికను తయారు చేశారు. ఆ పనిలో వీరు కనపరచిన ప్రతిభను, విజ్ఞతను నిజాం గమనించి హైకోర్టు న్యాయమూర్తి పదవి ఇస్తామంటే అంగీకరించలేదు. దేశంలో జాతీయోద్యమాన్ని బలపరచడం, నిజాం రాజ్యంలో ప్రజల హక్కులను సాధించడం రామకృష్ణారావుగారి ధ్యేయాలుగా ఉండేవి. ఆయన మంత్రిపదవిలోగాని, న్యాయమూర్తి పదవిలోగాని లేకపోయినా, ఆ పదవులలో ఉన్నవారు సైతం అభిమానించి, గౌరవించేటంతటి ప్రముఖ వ్యక్తిత్వం ఆయనది.

# పోటీ కాంగ్రెసు

హైదరాబాదు ప్రజా ఉద్యమం విజయవంతమై సంస్థానం భారత యూని యనులో విలీనమైపోయి, శాంతిభద్రతల పరిస్థితి కుదుటపడగానే ప్రజాప్రభుత్వం ఏర్పాటుకాబోయే సమయానికి స్టేట్ కాంగ్రెస్‌సంస్థ అతివాద, మితవాద వర్గాలుగా చీలిపోయింది. లాయకలీ మంత్రివర్గ ప్రేరేపణపై స్టేట్ కాంగ్రెసు అధ్యక్షుని అనుమతి లేకుండా నిజాం గారి రాజకీయ ప్రతిపాదనలను తీసుకొని సర్దార్‌పటేలు వద్దకు వెళ్ళారని ఆరోపిస్తూ శ్రీయుతులు బూర్గుల రామకృష్ణారావు, జి. రామాచారి కొండా వెంకటరంగారెడ్డి, కాశీనాథరావు వైద్య ప్రభృతులను కాంగ్రెసులోని అన్ని పదవుల నుంచి, స్టేట్ కాంగ్రెసు ప్రాథమిక సభ్యత్వం నుంచి, అధ్యక్షుడు స్వామి రామానంద తీర్థ తొలగించారు. తాము అటువంటి ప్రతిపాదనలేవీ తీసుకొని వెళ్ళలేదనీ, తాము వెళ్ళిన కారణాలను స్పష్టం చేస్తూ తమ సస్పెన్షన్‌ను రద్దుచేయవలసిందిగా ఈ నాయకులు కోరారు. సర్దారు పటేలు వినాయకరావు విద్యాలంకార్ గారికి ఇచ్చిన ఒక టెలిగ్రాములో లాయక్ అలీ మంత్రిమండలితో రాజీపడటానికై రామకృష్ణారావుగారు ఎప్పుడూ ఎలాంటి ప్రతిపాదనలూ చేయలేదని స్పష్టం చేశారు. అయినప్పటికీ అతివాదులైన స్వామీజీ వర్గంవారు వీరి తొలగింపును రద్దుచేయలేదు. అంతకు పూర్వమే కొండా వెంకటరంగారెడ్డి ప్రభృతులు స్వామీజీ గ్రూపులోని గోవిందదాస్ ష్రాఫ్, యస్. కె. వైశంపాయన్ మొదలగువారిని కమ్యూనిష్టులని బాహాటంగానే అంటూ ఉండేవారు. అందుకు ప్రతిగా స్వామీజీ అనుయాయులు రామకృష్ణారావు— వెంకట రంగారెడ్డి గ్రూపు వారిని మితవాదులనీ, అభివృద్ధి నిరోధకులనీ నిందిస్తూ ఉండేవారు. అయితే ఈ తొలగింపులు ఆ విభేదాలను మరింత విషమింపజేశాయి. పైగా నోటీసులివ్వడం, సంజాయిషీ అడగడం వంటి పద్ధతి ఏమీ లేకుండా స్వామీజీ కేవలం ఏకపక్షంగా నిరంకుశంగా వ్యవహరించినట్లు స్పష్టమవుతూనే వుంది. స్వామీజీ చాలా శాంత స్వభావుడు. ఆయన ఇట్లా వ్యవహరించడానికి గోవిందదాస్ ష్రాఫ్. మాడపాటి రామచంద్రరావు ప్రభృతులు కారకులై ఉంటా రనీ, స్టేట్ కాంగ్రెస్‌కు పరిపాలనా బాధ్యత అప్పగించబోయే సమయంలో వారు ఇలా చేయడం మితవాదులు అధికారంలోకి రాకుండా చూడటమేననీ అభిజ్ఞులు

ఊహించారు. అప్పుడు జనార్దనరావు దేశాయి అధ్యక్షులుగా, బూర్గుల రామకృష్ణా రావుగారు ప్రధాన కార్యదర్శిగా పోటీ కాంగ్రెసు సంస్థ ఏర్పాటైంది. స్వామీజీ కాంగ్రెసును గోసాయి కాంగ్రెస్ అనీ, పోటీ సంస్థను దేశాయి కాంగ్రెస్ అనీ ప్రజలు వ్యవహరించారు.

తొలగింపబడ్డ వర్గంవారు 1948 డిసెంబరు 4 వ తేదీన సమావేశమై స్వామీజీ నాయకత్వానగల స్టేట్ కాంగ్రెస్ కార్యవర్గం కాంగ్రెస్ వ్యవహారాలను నడపడానికి ప్రజావిశ్వాసాన్ని కోల్పోయింది కాబట్టి, దానిని ఇక కొనసాగ నివ్వడం సాధ్యపడదని అంటూ, ఒక తాత్కాలిక కేంద్ర కమిటీని ఏర్పాటు చేశారు. ఆ కమిటీయే స్టేట్ కాంగ్రెస్ ఆదర్శాలకూ, ప్రజాభీష్టానికీ ప్రాతినిధ్యం వహించగల ఏకైక కార్యవర్గమని స్పష్టం చేశారు. స్వామీజీ అధ్యక్షతన గల స్టేట్ కాంగ్రెస్ కార్యవర్గం అనుసరించిన నియంతృత్వ ధోరణిని ఖండించారు. నలుగురు ప్రముఖ కాంగ్రెస్ నాయకులను కాంగ్రెస్ నుంచి సస్పెండ్ చేయడమే కాక, కాంగ్రెస్ పోరాటంలో పాల్గొనలేదన్న అసత్యారోపణతో 46 మంది అఖిల హైదరాబాదు కాంగ్రెసు కమిటీ సభ్యులను సంస్థనుంచి బహిష్కరించారు. 62 మంది సభ్యులను అఖిల హైదరాబాదు కాంగ్రెసు కమిటీ సమావేశంలో పాల్గొన నివ్వలేదు. ఈ చర్యలన్నీ హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు భవిష్యత్తుకు విషమ స్థితిని తెచ్చిపెట్టాయి. అధ్యక్షుని ఈ చర్య నియంతృత్వ పద్ధతులను అనుస రించడం ద్వారా అభిప్రాయ ప్రకటనా స్వేచ్ఛను, ఎదిరి పక్షంగా ఉండగల స్వేచ్ఛను లేకుండా చేయడమే అవుతుందని పోటీ కాంగ్రెసు నాయకులు వారి తీర్మానంలో ఆరోపించారు.

పోటీ కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి అయిన బూర్గుల రామకృష్ణారావు గారు 1948 డిసెంబరు 7 వ తేదీన పత్రికలవారికి విడుదల చేసిన సుదీర్ఘ ప్రకటనలో* తమది పోటీ సంస్థగాని సమాంతర సంస్థ గాని కాదని అంటూ తాము ఇంతవరకూ ఉన్న కార్యవర్గానికి లోబడి ఉండటానికి నిరాకరిస్తున్నామనీ,

* 'హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు - తీర్మానములు, పత్రికా ప్రకటన' అనే పేరుతో పోటీ కాంగ్రెసువారు అచ్చువేసి పంచిన ఇంగ్లీషు లఘుపుస్తకం.

అది ప్రజల విశ్వాసాన్ని కోల్పోయిందనీ చెప్పారు. "స్టేట్ కాంగ్రెస్ వ్యవహారాలను మా కంట్రోలులోకి తీసుకున్నాము. మేమే స్టేట్ కాంగ్రెసు" అని అన్నారు. రావుగారు ఇంకా ఇలా చెప్పారు. "స్వామీజీ పైన, ఆయన కార్యవర్గం పైన ఈ తిరుగుబాటు చేసినవారిలో హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌ను స్థాపించిన వారున్నారు. మమ్మల్ని మితవాదులనీ, అభివృద్ధి నిరోధకులనీ దూషిస్తున్నారు. పరుషమైన మాటలవల్ల ప్రయోజనం లేదు. ప్రజా బాహుళ్యపు అభ్యున్నతికి ఉపయోగపడే అభ్యుదయకరమైన ఆలోచనలను మాలో ఒక్కరం కూడా ఎప్పుడూ వ్యతిరేకించలేదు. 1946 ఆగస్టులో జరిగిన అఖిల హైద్రాబాద్ కాంగ్రెసు కమిటీ సమావేశంలో జమీందారీ, ఫ్యూడల్, భూస్వామి వ్యవస్థ రద్దు స్టేట్ కాంగ్రెస్ లక్ష్యాలలో ప్రధానమైనదని ఉద్ఘాటిస్తూ నేనే ఒక తీర్మానాన్ని ప్రతిపాదించాను. హైదరాబాదు స్టేట్ కాంగ్రెసును క్రమేణా మార్క్సిస్టు సిద్ధాంత ఆచరణములపై ఆధారపడిన విధానాలకూ కార్యక్రమాలకూ బద్ధమై ఉండే సంస్థగా చేస్తూ ఉన్నట్లు గడచిన రెండేళ్ళుగా ఒక భావం ఏర్పడింది. స్వామీజీ చేసిన పత్రికా ప్రకటనను బట్టే మార్క్సిస్టులమని చెప్పుకునే సభ్యులు సంస్థలో ఉన్నట్లు విశదమవుతూ వుంది. వచ్చిన చిక్కేమిటంటే ఈ మార్క్సిస్టులు తమ పైన, కార్యవర్గంపైన ప్రాబల్యం వహించే అవకాశాన్ని స్వామిజీ వారికి కలుగ జేస్తున్నారు. రెండేండ్ల క్రిందట నల్లగొండ జిల్లాలో కమ్యూనిస్టు కార్యకలాపాలను ఎదుర్కోవలసిన సమస్య స్టేట్ కాంగ్రెసు కార్యవర్గం ముందుకు వచ్చినప్పుడు ఈ ప్రాబల్యం మరింత స్ఫుటంగా కానవచ్చింది. భారత జాతీయ కాంగ్రెసు సిద్ధాంతాలకు కట్టుబడి ఉన్నట్టి స్టేట్ కాంగ్రెసు కమ్యూనిస్టుల కార్యకలాపాలను ఖండించి, రైతాంగానికి సరియైన నాయకత్వం ఇవ్వవలెనని మేము కోరాము. 1947 జూన్‌లో జరిగిన వార్షిక మహాసభలో ఆమోదింపబడ్డ రాజకీయ పోరాటం తీర్మానాన్ని కూడా వీరు సక్రమంగా అమలు జరుపలేదు. హైదరాబాదు ప్రజలందరూ, వారి దృక్పథాలు ఎటువంటివైనా కాంగ్రెసుతో సహకరించారు. వేలాది గ్రామాధికార్లు, లాయర్లు, విద్యార్థులు, అప్పటి శాసనసభ సభ్యులలో చాలామంది, గడబిడ లేకుండా నిశ్శబ్దంగా పనిచేసిన అనేక గ్రూపులు, కార్యకర్తలు-అంతా స్టేట్ కాంగ్రెస్ చేపట్టిన ప్రజా ఉద్యమం విజయవంతం కావడానికి తోడ్పడ్డారు......... కాంగ్రెసును ఒకే నాయకత్వం క్రింద, అనుపగోడలుండే ఒక పెద్ద సంస్థగా పరివర్తింప చేయ బూనడం నియంతృత్వ మనిపించు

కుంటుంది... స్టేట్ కాంగ్రెస్ అనే ముసుగుతో ఒక కొత్త మార్క్సిజం లేక ఫాసిజం అనే ప్రమాదం రాబోతూ ఉన్నదని గ్రహించి మేమీ నిర్ణయానికి వచ్చాము......భారత జాతీయ కాంగ్రెసు సిద్ధాంతాలకు ఖచ్చితంగా కట్టుబడి ఉండనట్టి వ్యక్తులు స్టేట్ కాంగ్రెస్ పేరును ఉపయోగించుకోకూడదు. ప్రజలు ఈ విషయాన్ని గ్రహించాలి. అందుకనే ఈ అంశాన్ని నొక్కి చెప్పడానికే మేము సభ్యత్వపు దరఖాస్తు ఫారంలో సభ్యుడు కాగోరే ప్రతి వ్యక్తికి ఈ విధమైన ప్రతిజ్ఞ ఒకటి చేర్చాము.

రామకృష్ణారావుగారి పత్రికా ప్రకటన, తీర్మానపాఠం ఎంతో పకడ్‌బందీగా సిద్ధపరచిన పత్రాలు. అధికార కాంగ్రెసుకు అవి గట్టి జవాబుగానే ఉన్నాయి. రామకృష్ణారావు, కొండా వెంకట రంగారెడ్డికాక, మరెవరైనా సాధారణ వ్యక్తులైతే ఇలా స్వామీజీ వర్గంతో తలపడడం ఆత్మహత్యా సదృశమే అయ్యేది. కె. ఎం. మున్షీకూడా ఈ మాటే రావు-రెడ్డి వర్గంతో అన్నాడట. మీ వాదానికి తగిన బలముంటేనే మీరు తలపెట్టిన పని చేయండి అని చెప్పాడట. బలం ఉన్నదని రంగారెడ్డిగారు చెప్పారట. అంతే. పోటీసంస్థ వెలసింది.

అయితే పోటీసంస్థ ఏర్పాటు నెహ్రూగారికి చాలాఆగ్రహం తెప్పించిందనీ, చేసింది తప్పుఅని నెహ్రూ అన్నారనీ కొండా వెంకట రంగారెడ్డిగారి రచనవల్ల మనకు తెలియవస్తున్నది.* బొలారంలో నెహ్రూగారిని దర్శించి, ఆగ్రహోదగ్రులైన నెహ్రూగారి కోపపు మాటలువిని, నిరుత్సాహపడి రాత్రి పొద్దుపోయి ఇంటికి తిరిగివచ్చిన రామకృష్ణారావుగారు తమతో ఇంకా ఇలా అన్నట్లు రంగారెడ్డిగారు వారి స్వీయచరిత్రలో వ్రాశారు. "ఉభయ గ్రూపులను రేపు ఉపసంహరమ్మన్నారు. మీరు బల్లగుద్ది సమాంతర సంస్థ పెట్టించారు. కనుక ఏమి సమాధానం చెప్పుతారో రేపు మీరే చెప్పండి". అందుకు రెడ్డిగారు 'సరే, నేనే సమాధానము చెప్పుతాను' అన్నారు.

---

* 'స్వీయచరిత్ర- కె. వి. రంగారెడ్డి, ట్రస్టు ప్రచురణ, హైదరాబాదు, ప్రథమ ముద్రణ సెప్టెంబరు 1967.

దీనిని బట్టి రెండు విషయాలు స్పష్టమవుతున్నాయి. ఒకటి: స్టేట్ కాంగ్రెసులో క్రమశిక్షణ లేకపోవడం నెహ్రూగారికి మనః క్లేశం కలిగించింది. అందులోనూ పరిస్థితులు మామూలుస్థాయికి రాకుండా, భారత ప్రభుత్వదళాలను ఎదిరించి కమ్యూనిస్టులు సాయుధ పోరాటం జరుపుతున్నప్పుడు స్టేట్ కాంగ్రెసులో ఈ కీచులాటలు ఆయనకు మనస్తాపం కలిగించాయి. కనుక పోటీ సంస్థ వారిని నెహ్రూ మందలించారు. రెండవ విషయం ఏమిటంటే, పోటీసంస్థ పెట్టడంలో కొండా వెంకటరెడ్డిగారే ప్రధాన కారకులు.

చివరకు సర్దారు పటేలుగారు వారి కార్యదర్శి వి. పి. మీనన్‌తోపాటు హైదరాబాదు వచ్చి 1949 జనవరి 26 వ తేదీన బొలారంలో ఉభయ గ్రూపులను ఒకచోట సమావేశపరచి, రెండు వర్గాలకు సమాన ప్రాతినిధ్యం ప్రాతిపదికపై కార్యనిర్వాహకవర్గాన్ని ఏర్పరిచారు. ఒకే కాంగ్రెసు శ్రీ దిగంబరరావు బిందూ అధ్యక్షతన పనిచేయ సాగింది. అయితే మనస్సులలో ఉన్న విభేదాలు పూర్తిగా అంతరించలేదనీ, అయినా వాటిని పాటించకుండా సమన్వయంతో కార్యకలాపాలను జరిపామనీ రంగారెడ్డిగారు వారి స్వీయచరిత్రలో చెప్పారు. ఆ సమన్వయవాది బూర్గుల రామకృష్ణారావుగారే. పోటీసంస్థ శాశ్వతంగా ఉండాలని రామకృష్ణారావుగారి ఉద్దేశంకాదు. స్వామీజీ వర్గంవారికి అదొక షాక్ ట్రీట్‌మెంట్ మాత్రమే కావాలని ఆయన వాంఛించారు. తరువాత హైదరాబాదు స్టేటు కాంగ్రెసు అఖిలభారత కాంగ్రెసుకు అనుబంధ సంస్థయై, హైదరాబాదు రాష్ట్ర కాంగ్రెసు కమిటీ అయింది.

స్టేట్ కాంగ్రెసులో తీవ్రస్థాయికి చేరుకున్న ఈ తగాదాలవల్ల హైదరాబాదు పరిపాలన ప్రజా ప్రతినిధులకు అప్పగించే విషయం నిరవధికంగా వాయిదా పడిపోయింది. రాష్ట్రంలో శాంతిభద్రతల పరిస్థితులుకూడా బాగాలేవు. అయితే స్టేట్ కాంగ్రెస్ రెండు గ్రూపులూ ఏకమైనందువల్ల కాంగ్రెస్ బలపడి, కమ్యూనిస్టులకున్న ప్రజాబలం తగ్గిందని ఉమ్మెత్తల కేశవరావుగారు అభిప్రాయపడ్డారు. ఏమైనా ఈ ఐక్యత దీర్ఘకాలంపై కాంగ్రెసుకు మేలు కలిగించింది. ప్రజాప్రతినిధులను ఎన్నుకోవడానికి వెంటనే ఎన్నికలుమాత్రం జరగలేదు. 1952 దాకా ఎన్నికలకోసం వేచి ఉండవలసి వచ్చింది.



బూర్గుల రామకృష్ణారావుగారు పూనాలోని ఫెర్గుసన్ కాలేజీలో బి.ఏ. విద్యార్థిగా ప్రొఫెసర్లతో—
కుడివైపు చివర మొదటి వరుసలో షేర్వానీ ధోవతితో నిల్చున్నవాడు బూర్గుల



డాక్టర్ బూర్గుల రామకృష్ణారావుగారి మంత్రివర్గం (హైదరాబాదు రాష్ట్రం)



బేగంపేట విమానాశ్రయంలో అప్పటి భారత ప్రధాని పండిత
జవహర్‌లాల్ నెహ్రూకు డా॥ బూర్గుల రామకృష్ణారావుగారు
స్వాగతం చెబుతున్న దృశ్యం.

# మంత్రి పదవి

మేజర్ జనరల్ జె. ఎన్. చౌధురి ఆధ్వర్యాన, ఆయన మిలిటరీ గవర్నర్‌గా 1948 సెప్టెంబరు 18 తేదీ నుంచి మిలిటరీ ప్రభుత్వం అమలులోకి వచ్చింది. అయితే పరిపాలన సివిలు పద్ధతిలోనే జరిగింది. మిలిటరీ గవర్నర్ ప్రభుత్వంలో పి. ఎన్. బాఖ్లే ఐ. సి. ఎస్. సివిల్ అడ్మినిస్ట్రేటరుగా, నవాబ్ జైన్ యార్జంగ్, రాజా ధోండేరాజ్, సి. వి. ఎస్. రావు, పి. హెచ్. కృష్ణారావు మెంబర్లుగా ఉన్నారు. ఆ పిమ్మట మిలిటరీ ప్రభుత్వం స్థానే ఎం. కె. వెల్లోడి ఐ. సి. ఎస్. ఆధిపత్యాన ఒక తాత్కాలిక ప్రభుత్వం 1949 డిసెంబరు 1వ తేదీన ఏర్పాటు చేయబడింది. అందులో మొదట్లో అంతా సివిలియనులే ఉన్నారు. తరువాత అందులో స్టేటు కాంగ్రెసుకు ప్రాతినిధ్యం కల్పించే ఉద్దేశంతో బూర్గుల రామకృష్ణారావు, వినాయకరావు విద్యాలంకార్, వి.బి. రాజు, ఫూల్‌చంద్ గాంధి గారలను 1950 జూన్ 12వ తేదీన మంత్రులుగా వేశారు. అంటే ప్రజా ప్రతినిధులు నలుగురుకి వెల్లోడి ముఖ్యమంత్రిగా ఏర్పడ్డ తాత్కాలిక మంత్రిమండలిలో స్థానమిచ్చారన్నమాట. హైదరాబాదు పరిపాలనను ప్రజాస్వామికం చేయడంలో ఇది మొదటిమెట్టు. ఈ నలుగురూ కాంగ్రెసువారు. బూర్గులవారికి రెవిన్యూ విద్యాశాఖలు ఇవ్వబడ్డవి. ఈ ప్రభుత్వం సాధారణ ఎన్నికలు జరిగి, ప్రజా ప్రభుత్వం ఏర్పడేవరకూ – అనగా 1952 మార్చి వరకూ కొనసాగింది. కమ్యూనిస్టుల సాయుధ పోరాటాన్ని, వారి హింసాకాండనూ ప్రజాప్రతినిధులైన నలుగురికి ప్రభుత్వంలో స్థానమివ్వడంద్వారా ఎదుర్కోవాలన్న ఉద్దేశంతో కేంద్ర ప్రభుత్వం ఈ మార్పును తెచ్చింది. ప్రభుత్వంలో చేర్చుకోబడ్డ నలుగురు కాంగ్రెస్ నాయకులూ ప్రజలలో పేరు ప్రఖ్యాతులు కలవారు కాబట్టి ప్రజలకుకూడా కొంత ధైర్యం, విశ్వాసం కలిగాయి. మిలిటరీ ప్రభుత్వం కేవలం బలంతో సాయుధ పోరాటాన్ని ఎదుర్కొనడంవల్ల అమాయకులైన వారిపై దౌర్జన్యాలు జరగడం తటస్థించింది. ఈ విషయంలో కేంద్రానికి ఫిర్యాదులుకూడా వెళ్ళాయి.

మిలిటరీ ప్రభుత్వకాలంలో రాష్ట్రంలో భూ విషయకంగా కొన్ని విప్లవాత్మకమైన సంస్కరణలు అమలు జరిగాయి. నిజాం అత్రఫ్‌బల్దా అనే మొత్తం జిల్లాను తన సర్ఫెఖాస్‌గా ఉంచుకున్నాడు. అంటే అది అతని స్వంత జాగీరుగా ఉండేది. దానిపై వచ్చే ఆదాయాన్ని అతడు వ్యక్తిగతంగా అనుభవించేవాడు. మిలిటరీ ప్రభుత్వం అతడి సర్ఫెఖాస్ జిల్లాను రాష్ట్రప్రభుత్వ పాలనక్రిందికితెచ్చి, భూములపై రైతులకు పట్టాహక్కు లిప్పించింది.

రాష్ట్రం మొత్తంలో 1500 మందిదాకా జాగీర్దార్లు ఉండేవారు. సుమారు 6500 గ్రామాలు జాగీరు ప్రాంతాలుగా ఉండేవి. మిలిటరీ ప్రభుత్వం ఈ జాగీర్లను రద్దుచేసి ఆ గ్రామాలను రాష్ట్ర ప్రభుత్వ పాలన క్రిందికి తెచ్చింది. ఇది మహత్తరమైన సంస్కరణ. దేశముఖ్, దేశపాండ్యాలకిచ్చే ఆనువంశిక రుసుములు రద్దుచేయబడ్డవి. బూర్గుల రామకృష్ణారావుగారు కూడా ఒక చిన్న జాగీర్దారు, దేశపాండ్యా. అది లిటిగేషన్ చిక్కులలో పడిపోయింది. చివరకు వారు దానిని గెలుచుకున్నారుగాని, వెంటనే సంస్కరణలు రావడంతో దానిని వదులుకున్నారు.

మిలిటరీ ప్రభుత్వం రాష్ట్రంలో వచ్చిన సంక్షోభం దృష్ట్యా అనాథులకు, ఆర్తులకూ పునరావాసం కల్పించే కార్యక్రమాన్ని అమలుపరచింది. జిల్లాలనుంచి కొన్ని ముస్లిం కుటుంబాలు భయభ్రాంతులై నగరానికి వలసవచ్చి నిరాశ్రయులై ఉండగా జాఫర్ హుసేన్ కన్వీనర్‌గా 'సలామతీ కమిటీ' ఏర్పాటుచేసి అనాథ స్త్రీలకు పెన్షన్‌లు ఇప్పించారు. గృహ దహనాలు, లూటీలు జరిగి ఉంటే వారికి తిరిగి పునరావాసం కల్పించారు. తరువాత ముల్లా అబ్దుల్ బాసిత్ కార్యదర్శిగా మరొక కమిటీ ఏర్పడింది. ఆ కమిటీ నివేదికలో అనాథకుటుంబాలకు ప్రభుత్వం చేసిన సహాయం వివరింపబడింది. రామకృష్ణారావుగారు స్వయంగా ముస్లిం కుటుంబాలను పరామర్శించి, వారికి సహాయం అందేట్టు చూచినందుకుగాను వారికి ప్రత్యేకంగా ఆ నివేదికలో కృతజ్ఞతలు తెలుపబడ్డవి. రెవిన్యూ, విద్యాశాఖల మంత్రిగా రామకృష్ణారావుగారు అనేక సంస్కరణలు అమలు జరిపారు. జిల్లాకొక కళాశాలను ఏర్పాటు చేశారు. అంతకుముందు అన్ని జిల్లాలలో కళాశాలలు లేవు. ఉన్నత పాఠశాల స్థాయివరకూ మాతృభాషను బోధనా భాషగా చేశారు.

తెలంగాణాలో సాయుధ పోరాటాన్ని ఉపసంహరించుకుంటూ తాము చేసిన తీర్మానాన్ని కమ్యూనిస్టు పార్టీవారు 1951 అక్టోబరు 21వ తేదీన పత్రికలకు విడుదల చేశారు. ఇందుకు తగు కారణాలు ఉన్నవి. జాగీర్లు రద్దయ్యాయి. రక్షిత కౌలుదార్ల చట్టం మరింత క్రమబద్ధం చేయబడింది. వారికి అనేక సౌకర్యాలు కలుగజేయబడ్డవి. కమ్యూనిస్టులు భారత ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాటం జరుపుతున్నారని ప్రజలకు తెలిసిపోయింది. భారతరిపబ్లిక్ రాజ్యాంగం సిద్ధమైంది. జనరల్ ఎన్నికలు జరగబోతున్నాయని ప్రజలకు తెలియవచ్చింది. కమ్యూనిస్టులకు ప్రజల సహకారం క్రమేణా తగ్గిపోయింది. వారి పార్టీ కార్యకర్తలలో చీలికలు రాసాగాయి. వారి ఆయుధ సామగ్రిని భారత సైన్యం పట్టుకొంటూఉంది. ఇందువల్ల పరిస్థితిని సమీక్షించుకొని పార్టీ పోరాటాన్ని విరమించుకుంది. ఆ తర్వాత కొంత కాలానికి ఈ సాయుధ పోరాటం విఫలమైందని పార్టీ అగ్రనాయకులే అంగీకరించారు.

# ముఖ్యమంత్రి

"రెండు వందల యేండ్ల నుండి చిమ్మ
చీకటుల క్రమ్మి, వెలుతురు రేక గనని
మాకు ప్రథమ ప్రజా ముఖ్యమంత్రి వీవు
కీర్తనీయ, బూర్గుల రామకృష్ణ రాయ!"*

1950 జనవరి 26వ తేదీన అమలులోకి వచ్చిన భారత రిపబ్లిక్ రాజ్యాంగము ననుసరించి దేశమంతటితో పాటు హైదరాబాదు రాష్ట్రంలో కూడా సాధారణ ఎన్నికలు జరిగాయి. బూర్గుల రామకృష్ణారావు గారు కాంగ్రెసు పార్టీ అభ్యర్థిగా మహబూబ్‌నగరు జిల్లా షాద్‌నగర్ నియోజక వర్గం నుంచి 'కాడెడ్లు' చిహ్నంతో పోటీ చేశారు. వీరితో పోటీచేసిన స్వతంత్ర అభ్యర్థి లక్ష్మణరెడ్డిగారు బారెట్లా. హైదరాబాదు హైకోర్టు న్యాయమూర్తిగా పనిచేసి పదవీ విరమణ చేసిన వారు. వారు రాజాబహదూర్ వెంకటరామారెడ్డిగారి కుమారులు. ఈ ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థుల తరపున స్వామి రామానందతీర్థ, బూర్గుల రామకృష్ణారావు గారు, ఇతర నాయకులు ప్రచారం చేశారు. షాద్‌నగర్ నియోజకవర్గంలో రామకృష్ణారావుగారు కొన్నివేల ఓట్ల మెజారిటీతో గెలిచారు. హైదరాబాదు రాష్ట్రంలో కాంగ్రెసు మెజారిటీ పార్టీగా వచ్చిందికాని అది స్వల్పమైన మెజారిటీ.

రాష్ట్ర శాసన సభలో మొత్తం స్థానాలు—175
కాంగ్రెసుపార్టీ గెలుచుకున్న స్థానాలు—93
పీపుల్స్ డెమోక్రటిక్ ఫ్రంట్, ఇతర ప్రతిపక్షాలు కలిసి మొత్తం
స్థానాలు —77

---

* దాశరథిగారి పద్యం.

ముఖ్యమంత్రి ఎవరుకావాలి అనే విషయంలో చాలా తర్జన భర్జన జరిగింది. స్టేట్ కాంగ్రెసు అధ్యక్షులైన స్వామి రామానందతీర్థగారు దిగంబర రావు బిందూకు ముఖ్యమంత్రి పదవి లభింపజేయడానికి ప్రయత్నించారు. కాని అందుకు బిందూగారే అంగీకరించలేదు. ఢిల్లీలో నెహ్రూగారితో, గోపాలస్వామి అయ్యంగార్‌తో బిందూగారు స్వయంగా తాను పోటీచేయనని చెప్పి, బూర్గుల రామకృష్ణారావుగారే ముఖ్యమంత్రి పదవికి సమర్థులని అంగీకరించారు. అంతటితో రాష్ట్ర శాసనసభా కాంగ్రెసు పక్షం నాయకత్వం ఆంధ్రునిదేనని తేలిపోయింది. ఇది సమంజసమైన నిర్ణయం కూడా. హైదరాబాదు రాష్ట్రం మూడు భాషా ప్రాంతాలున్న రాష్ట్రం. విస్తీర్ణంలో, జనాభాలో తెలంగాణా పెద్దది. తెలంగాణాలోనే కమ్యూనిస్టుల బెడద ఉండేది కాబట్టి ఆ ప్రాంతానికి చెందిన, పాలనా సామర్థ్యంగల, సామరస్య దృష్టిగల కాంగ్రెసుపార్టీ నాయకుడు ముఖ్యమంత్రి కావడం వాంఛనీయమని అభిజ్ఞులు భావించారు. కాంగ్రెసుపార్టీలో ఒక వర్గం ఏ దృష్టితో అప్పుడు వ్యవహరించిందో తెలుసుకోవాలంటే, రామకృష్ణా రావుగారిని గూర్చి రాజకీయ వర్గాల అంచనాను గ్రాహ్యం చేసుకోవాలంటే ఈ దిగువ ఉదాహరించిన వ్యాఖ్య కొంతవరకు ఉపకరిస్తుంది:

"మూడు ముఖ్యమైన పదవులు ఆంధ్రులకు రావాలని ఓ బహిరంగసభలో కొండా వెంకట రంగారెడ్డి కుండ పగలగొట్టి చెప్పినాడు. 'ఇంతవరకూ మహా రాష్ట్రిలు ముందుగా ఉంటూ వచ్చినారు. స్వాతంత్ర్యం వచ్చినది గనుక వెనుక బాటుగా వున్న తెలంగాణావారికి అవకాశం ఇవ్వాలి. ముఖ్యమంత్రి పదవి, రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్ష పదవి, హైదరాబాదు నగర మేయరు పదవి తెలంగాణా వారికి కేటాయించాలి' అని రెడ్డి చెప్పినాడు. ఈయన శుద్ధ ప్రాంతీయవాది అని అంతా విమర్శించినారుగాని చివరికి ఆయన జోస్యం చెప్పినట్టు అట్లాగే జరిగింది. రామకృష్ణారావు ముఖ్యమంత్రి అయినాడు. కొండా వెంకట రంగారెడ్డి రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడైనాడు. మాడపాటి హనుమంతరావు హైదరాబాదు మేయరైనాడు."*

---

*. కపిల కాశీపతిగారు 'బ్రహ్మానందయాత్ర' అనే గ్రంథంలో. మే 1970.

ఈ రచయితయే రామకృష్ణారావుగారి రాజకీయ చతురతను గూర్చి ఇట్లా వ్యాఖ్యానించారు.

"ఇవన్నీ ఊరకే వాదించగా వచ్చినవి కావు. 1952 ఎన్నికలు జరిగే ముందే తగాదాలు ప్రారంభమైనవి. స్టేట్ కాంగ్రెసులో రామానంద తీర్థ గ్రూపూ, రెడ్డి-రావు గ్రూపు అట్లాగే ఉన్నవి. ఎన్నికలకి అభ్యర్థుల్ని నిర్ణయించడానికి ఉపసంఘం ఏర్పర్చవలసి వచ్చినది. రామకృష్ణారావు గడసరి. పైగా మహారాష్ట్రి, కన్నడబాషలు వచ్చినవాడు. మహారాష్ట్రంలో చదువుకున్నవాడు. ఈ ముగ్గురి మధ్యా సామరస్యం కుదర్చడానికి ప్రయత్నించేవాడు. రాజకీయాలలో రాజీ అనేది అవసరమనీ, పురోభివృద్ధికి సోపానమనీ తెలిసినవాడు. తన కుందేటికి మూడే కాళ్ళనే స్వభావం కలవాడు కాడు. అంతేకాక తలలు లెక్కవేసే తరుణంలో హైదరాబాదులో ఆంధ్రులే ఎక్కువ గనుక ఆంధ్రులకి ముఖ్యస్థానాలు రాక తప్పదని తెలిసినవాడు...*"

బూర్గుల రామకృష్ణారావుగారు హైదరాబాదు ముఖ్యమంత్రిగా 1952 మార్చి 6 వ తేదీన పదవీ స్వీకారము చేశారు. ఆనాడు హైదరాబాదు తెలుగువారి ఆనందానికి మేరలేదు. కాంగ్రెసు పార్టీకి సమర్థుడైన వ్యక్తి ముఖ్యమంత్రిగా లభించాడని ప్రతిపక్షం కూడా గుర్తించింది. ఆనాటి ప్రతిపక్షం పీపుల్స్ డెమోక్రటిక్ ఫ్రంట్. (పి. డి. ఎఫ్) దీనిలో కమ్యూనిస్టులు, వారి అనుయాయులు ఉండేవారు. వారు ఉద్యమంలో రాటుదేలినవారు. రాజకీయ పరిస్థితులు బాగా ఎరిగినవారు. చక్కగా మాట్లాడగలిగినవారు. ఫ్రంట్ నాయకుడు వి. డి. దేశపాండే వందేమాతరం ఉద్యమంలో విద్యార్థుల నాయకుడు. మంచి పార్లమెంటేరియన్. మఖ్దూం మొహియుద్దీన్ వంటి కమ్యూనిస్టు నాయకుడూ అభ్యుదయకవీ శక్తిమంతుడైన వక్త ఆనాటి శాసనసభ్యుడు. విద్యాధికులు కానట్టి ఫ్రంట్ శాసన సభ్యులు కూడా ఒక విషయం చర్చకు వస్తే దానిని కూలంకషంగా పరిశీలించి వారి దృక్పథాన్ని చెప్పడంలో రాటుదేలినవారని అప్పటి హైదరాబాదు శాసన సభా చర్చల సంపుటాలను (హైదరాబాదు అసెంబ్లీ డిబేట్స్) తిరగవేస్తే తెలియ వస్తుంది. వీరందరికీ కాంగ్రెసు ముఖ్యమంత్రి జవాబు చెప్పాలి. హైదరాబాదు అప్పుడు-'బి' రాష్ట్రం కాబట్టి నిజాం నవాబు నవాబ్ మీర్ ఉస్మానలీఖాన్‌ను

* కపిల కాశీపతిగారు "బహ్మానందయాత్ర" అనే గ్రంథంలో.

భారత ప్రభుత్వం రాజప్రముఖ్‌గా నియమించింది. ఆయన రాజ్యాంగరీత్యా రాష్ట్ర అధిపతి మాత్రమే.

శాసనసభలో సభ్యులు తెలుగు, ఉర్దూ, ఇంగ్లీషు, మరాఠీ, కన్నడ భాషలలో మాట్లాడుతూ ఉండేవారు. ఆ భాషలలో ప్రశ్నలు వేస్తూఉండేవారు. ఎవరే భాషలో మాట్లాడితే ముఖ్యమంత్రి ఆ భాషలో ఏమాత్రం తడుముకోకుండా, ఆ భాషలోని సామెతలను కూడా ప్రయోగిస్తూ సమాధానాలు చెప్పేవారు. ఈ వైదుష్యాన్ని, వైదగ్ధ్యాన్ని చూడాలన్న కుతూహలంతో శాసనసభను సందర్శించిన వ్యక్తులను ఈ రచయిత ఎరుగును. డా. సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు బూర్గుల వారి బహుభాషా పాండిత్యాన్ని గుర్తించి లోలోపల వారిని ప్రశంసా భావంతో చూచేవారు. ఉత్తరప్రదేశ్‌కు రావుగారు గవర్నరుగా వెళ్ళబోయేటప్పుడు రాధాకృష్ణన్‌గారు వారితో "మీ బహుభాషాపాండిత్యం అక్కడ మీకు బాగా ఉపయోగపడగలదు" అని అన్నారు. ఆర్యసమాజీయులెవరైనా సంస్కృతపద భూయిష్ఠమైన హిందీలో భాషణము జరిపితే వారికి అలాంటి హిందీలోనే రావుగారు బదులు చెప్పేవారు. దక్షిణభారత హిందీ ప్రచారసభ ఆంధ్రశాఖకు వీరు పెద్ద అండగా ఉండేవారు. బూర్గులవారు హైదరాబాదును పంచవేణీ సంగమమని తరచు వర్ణిస్తూ ఉండేవారు. పంచభాషా కవి సమ్మేళనాలతో వినోదిస్తూ ఉండేవారు. తెలంగాణా కవి దాశరథి "...వాగ్ధాటిన్ ధీ పటిమన్ విధానసభనంతన్ మంత్రముగ్ధమ్ముగా ఆటాడించెడి నీ మహా ప్రతిభ దేశాధ్యక్షు మెప్పించెడిన్" అన్నారు. ఆయన ఇంకా ఇలా శ్లాఘించారు:

"రాజ్యపాలనమున, ప్రజారక్షణమున
సాహితీ రంగమున, కళా సరణిలోన
సార్వభౌమత్వము గడింప జాలితీవు
కృష్ణరాయుడవే, రామకృష్ణరాయ!"

రామకృష్ణారావుగారి మంత్రివర్గంలో మంత్రులు వీరు: దిగంబరరావు బిందు, వినాయకరావు విద్యాలంకార్, కొండా వెంకటరంగారెడ్డి, ఫూల్చంద్‌గాంధి, వి.బి. రాజు, డా॥ జి.ఎస్. మెల్కోటే, నవాబ్ మెహదీ నవాజ్ జంగ్, డా॥ ఎం. చెన్నారెడ్డి, అన్నారావు గణముఖి, దేవీసింగ్ చౌహాన్, శంకరదేవ్, జగన్నాథ

రావు చందర్కీ. శాసనసభ స్పీకరుగా కాశీనాథరావు వైద్య ఎన్నికైన్నారు. ప్రతిపక్షనాయకుడు వి.డి. దేశపాండే. ఈయన పీపుల్స్ డెమోక్రటిక్ ఫ్రంట్‌కు చెందినవాడు.

శాసనసభా నాయకుడు ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావు. కొంతకాలం పోయినతరువాత స్వామీజీ గ్రూపుకు చెందినవారికీ, ముఖ్య మంత్రికీ అభిప్రాయ భేదాలు కలిగాయి. ఆ కారణంగా వి.బి. రాజు, ఫూల్‌చంద్ గాంధి, జగన్నాథరావు చందర్కీగారలు మంత్రివర్గం నుంచి రాజీనామా చేశారు. దేవీసింగ్ చౌహాన్ మాత్రం తన రాజీనామాను ఉపసంహరించుకున్నాడు. రాజీ నామా చేసినవారు తాము రామకృష్ణారావు గారితో కలిసి పనిచేయజాలమని అన్నారు. అంతేకాని వేరే కారణాలేమీ వారు చూపలేదు. వారి రాజీనామాలకు ముందే మంత్రివర్గం పెద్దగా ఉందని చెప్పి, దాని సైజును తగ్గించడానికై గోపాల రావు ఎక్బోటే అధ్యక్షతన ఒక సంఘాన్ని నియమించారు. ఆ సంఘం తన నివేది కను కూడా దాఖలు చేసింది. కాంగ్రెసు అధిష్ఠాన వర్గం ఆ నివేదికను ఆమోదిం చింది. ఆ తరువాత ముఖ్యమంత్రిగారు ఈ దిగువ పేర్కొనబడ్డ 8 మందిని అదనంగా తమ మంత్రిమండలిలో చేర్చుకున్నారు.

గోపాలరావు ఎక్బోటే-క్యాబినెట్ హోదాగల మంత్రి. డిప్యూటీ మంత్రులు: అరిగె రామస్వామి, శ్రీమతి సంగెం లక్ష్మీబాయి, శ్రీనివాసరావు ఎక్లేకర్, భగవంతరావు ఘాటే, ఎం. ఎస్. రాజలింగం, పల్లెర్ల హనుమంతరావు, విరూ పాక్షప్ప. ముగ్గురు మంత్రుల రాజీనామాలకు ముందు మంత్రిమండలిలో కొన్ని విషయాలపై విభేదించడం ఉండేది. వారు వెళ్ళిపోయిన తరువాత మంత్రిమండలి అభిప్రాయభేదాలు లేకుండా ఏకవాక్యతతో సంఘటిత రీతిలో పనిచేసింది. అస మ్మతి వర్గం అంటూలేదు. ఈ మంత్రిమండలి మార్పులు చేర్పులు ఏమీలేకుండా 1956 అక్టోబరు 31వ తేదీ దాకా కలసికట్టుగా పనిచేసింది.

హైదరాబాదు శాసనసభ మొదటి సమావేశం 1952 మార్చి 21వ తేదీ నుండి 1952 ఏప్రిలు 7వ తేదీ దాకా జరిగింది.

ముఖ్యమంత్రి పదవిని స్వీకరించిన వెంటనే రామకృష్ణారావుగారు హైదరాబాదు ఆలిండియా రేడియో కేంద్రంనుంచి ప్రసంగిస్తూ "భారతదేశంలో

హైదరాబాదు విడదీయరాని భాగం. స్వతంత్ర ప్రవృత్తితో ఆలోచించడంగానీ, వ్యవహరించడంకానీ హైదరాబాదు ప్రజలకు తగదు. బాధ్యతాయుత ప్రభుత్వం కావాలన్న ప్రజలకోర్కె నేటికి ఈడేరింది" అని అన్నారు.

బూర్గుల రామకృష్ణారావుగారి మంత్రివర్గం రాష్ట్రంలో అనేక అభ్యుదయ కరమైన సంస్కరణలను ప్రవేశపెట్టింది. వీటిలో ప్రత్యేకించి చెప్పుకోదగ్గవి భూసంస్కరణలు.

మిలిటరీ ప్రభుత్వం నిజాంగారి సర్ఫెఖాస్ జిల్లాను రాష్ట్రప్రభుత్వపాలన క్రిందికితెచ్చి ఆ భూములపై రైతులకు పట్టా హక్కులిచ్చింది. మిలిటరీ ప్రభుత్వమే జాగీర్లను రద్దుచేసి, జాగీరు గ్రామాలను రాష్ట్రప్రభుత్వ పాలన క్రిందికి తెచ్చింది.

బూర్గులవారు ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో హైదరాబాదు ఈనాముల రద్దు బిల్లు 1954-55లో చట్టంగా ఆమోదింపబడింది. దీనిననుసరించి ఈనాము భూములను రైత్వారీ భూములుగా మార్చడం జరిగింది. ఇనాందార్ల హక్కులను రైత్వారీ భూకామందుల హక్కులుగా పరిగణించడమైనది.

హైదరాబాదు కౌల్దారీ మరియు వ్యవసాయ భూముల చట్టం, (1951) 1950 లోనే ఆమోదింపబడి, కౌల్దారీ హక్కులను రికార్డుచేసే విధానమొకటి ప్రవేశపెట్టడం జరిగింది. ఈ చట్టం భూస్వామి తన సొంత సేద్యం కొరకు తన క్రింద ఉంచుకోదగిన భూ విస్తీర్ణమును ఆర్థిక కమతానికి అయిదు రెట్లుగా నిర్ణయించింది. అంతేకాక కౌల్దారు తన కబ్జాక్రిందఉన్న భూమిని భూస్వామినుంచి క్రయము చేసేందుకు సమంజసమైన ధరలనుకూడా నిర్ణయించింది. ఈ ధర భూమి వెరశి ఉత్పత్తికి మూడురెట్లుగా ఉండవచ్చని నిర్ణయింపబడింది.

పోతే బూర్గుల రామకృష్ణారావుగారి ప్రభుత్వం సదరు చట్టాన్ని ప్రణాళికా సంఘం వారి సిఫారసులకు అనుగుణంగా చేసేందుకై ఇంకా కొంత సవరించింది. ఈ సవరణ 1954 ఫిబ్రవరినుంచి అమలులోకి వచ్చింది. సవరింపబడిన చట్టం ముఖ్య విశేషాలు ఇవి: (1) భూసంస్కరణల అమలుకు కొత్తకొలబద్దగా

కుటుంబకమతము అనేదానిని ప్రవేశపెట్టడం జరిగింది. (2) కౌలు సొమ్ము తగ్గింపబడి భూమిశిస్తుకు ఇన్ని రెట్లని చెప్పి కౌలుసొమ్మును నిర్ణయించడం జరిగింది. (3) భూస్వామి సొంత సేద్యంకొరకు కౌలుదారు స్వాధీనంలోఉన్న భూమిని తీసివేసుకోవడంపై కొత్తగా నిర్బంధాలు విధింపబడ్డవి. (4) భవిష్యత్తులో భూమిని సంపాదించే విషయంలో కమతం సైజుపై గరిష్ఠ పరిమితులు విధింపబడ్డవి. (5) సులభమైన పద్ధతిపై కౌలుదార్లకు భూములు విక్రయంచేసే విధానం అమలులోకి తేబడింది. మిగులు భూములను లేదా అసమర్థరీతిలో సాగు చేయబడుతూ ఉండే భూముల యాజమాన్యమును ప్రభుత్వం స్వీకరించడం లేక ప్రభుత్వం అట్టి భూములను తీసివేసుకోవడం మరియు అట్టి సందర్భాలలో చెల్లించదగు నష్టపరిహారాన్ని నిర్ణయించడం జరిగింది. అలా తీసివేసుకున్న భూములను సహకారసేద్యం నిమిత్తమై సహకార సంఘాలకు అప్పగింత పెట్టవచ్చు.

బేసిక్ కమతానికంటె ఇంకా తగ్గిపోయేటట్టుగా కమతాలను ముక్కచెక్కలు చేయడాన్ని ఈ చట్టం నిషేధించింది.

స్థానిక ప్రాంతాల విభజనమునుగూర్చి, కుటుంబ కమతాల నిర్ధారణను గూర్చి ప్రభుత్వానికి సలహాలిచ్చేటందుకై భూముల లెక్కల సంఘమొకటి (Land Census Commission) ఏర్పాటు చేయబడింది. ఈ కమీషన్‌వారి సిఫారసులను ప్రభుత్వం ఆమోదించింది.

రామకృష్ణారావుగారు ప్రవేశపెట్టిన శాసనం చాలా విప్లవాత్మకమైనది. అటువంటి శాసనం అంతకుముందు దేశంలో ఎక్కడా లేదు. రావుగారు భూమి యాజమాన్యం విషయంలో కుటుంబ గరిష్ఠ పరిమితిని విధించి, మిగులు భూములను భూస్వాముల నుంచి ప్రభుత్వం తీసుకొని సొంత భూములు లేని సేద్యదారులకు ఇప్పించే ఏర్పాటు చేశారు. ఈ బిల్లు 1953 ఏప్రిలులో హైదరాబాదు శాసనసభలో చర్చకు వచ్చింది. ముఖ్యమంత్రిగారు ఈ సందర్భంలో చేసిన సుదీర్ఘ ప్రసంగం చదవదగింది. వారీ ప్రసంగాన్ని ఉర్దూలో చేశారు, శాసన సభ్యులందరూ అర్థం చేసుకునేందుకు వీలుగా. రాష్ట్రంలో రక్షిత కౌలుదార్ల చట్టం 1950 నుంచే అమలులో ఉంది. కాని పెద్ద విస్తీర్ణంలో భూములున్న భూస్వా

ముల నుంచి భూములను తీసుకొని వాటిని సేద్యంచేసే వారికిచ్చే ఏర్పాటు పూర్వం లేదు. అది వీరి హయాంలో వచ్చింది. ఇంతటి విప్లవాత్మకమైన భూసంస్కరణలు దేశంలో మరెక్కడా రాలేదు. ఇది ఒక అభ్యుదయకరమైన ప్రయోగం. ఈ చట్టం ముఖ్యోద్దేశం తాము స్వయంగా భూములను సేద్యం చేయకుండా తమ ఆక్రమణ క్రింద ఉంచుకునే మధ్యవర్తులను తొలగించడం. స్వంత సేద్యం చేసుకునే వారి క్రిందికి భూమిని తెచ్చి, వ్యవసాయోత్పత్తిని హెచ్చించడం ఈ శాసనం లక్ష్యం. కుటుంబకమతం నికరాదాయం రూ. 800/- ల్యాండ్ కమీషన్‌వారు భూముల స్థానిక పరిస్థితులను విచారించి సదరు ఆదాయానికి తగిన భూమిని నిర్ణయిస్తారు. గరిష్ఠ ఆదాయానికి మించిన భూమి ఉంటే భూస్వామికి నష్టపరిహారమిచ్చి మిగులు భూమిని తీసుకుంటారు. కుటుంబ ఆదాయానికి నాలుగున్నర రెట్లు గరిష్ఠ ఆదాయంగా ఎంచబడింది. దానికితగ్గ భూమిని భూస్వామి కింద ఉంచవచ్చు.

భూస్వాములు కౌలుదార్ల నుంచి హెచ్చు కౌలు తీసుకోకుండా ఈ కొత్త శాసనం నిరోధించింది. వారు కౌలు భూములు కొనదలుచుకుంటే చట్టంలో భూముల విలువ నిర్ధారణ చేయబడింది.

పెద్ద భూస్వాములు సేద్యం చేయకుండా భూములను పడావా ఉంచినట్లయితే అట్టి భూములను లాగుకొని రైతులకు ఇవ్వడం జరుగుతుందని ప్రభుత్వం హెచ్చరించింది.

అంటే భూస్వాములకు స్వంత సేద్యం చేసుకోవడానికై ఒక అవకాశం ఇవ్వడం న్యాయమని ప్రభుత్వం భావించింది. ప్రభుత్వోద్యోగులు ఉద్యోగ విరమణ తరువాత స్వంత సేద్యం చేసుకోవడానికి భూమి ఉండేట్టుగా ఈ చట్టం ద్వారా వీలుకల్పించబడింది. అలా చేసుకోకపోతే అది రైతులకు పోతుంది. భూమి కలవారిని భూమిహీనులను చేయడంలో అర్థం లేదని ప్రభుత్వం భావించింది. శాసనసభలో కమ్యూనిస్టులు భూస్వామి కుటుంబపు గరిష్ఠ ఆదాయం రెండువేలు చాలునని వాదించారు. చివరకు ఈ బిల్లు సెలెక్టు కమిటీ ఆమోదాన్ని పొంది, చట్టమైంది. బూర్గుల రామకృష్ణారావుగారు మన దేశంలో భూ కమతాలపై గరిష్ఠ పరిమితిని విధించిన ప్రథమ ముఖ్యమంత్రిగా వాసికెక్కారు.

రామకృష్ణారావుగారి హయాములోనే 1952 సంవత్సరపు హైదరాబాదు కౌలుదారీ (బేదఖలీలు బదలాయింపుల నిరోధం) ఆర్డినెన్సు 1952-53లో చట్టంగా ఆమోదించబడింది. భూస్వాములు కౌలుదార్లను బేదఖలు చేయకుండా (భూముల నుంచి వెళ్ళగొట్టకుండా) ఈ ఆర్డినెన్సు తేబడింది. దీని ద్వారా బేదఖలీల కార్యాయాలన్నీ (ప్రొసీడింగ్సు) నిలిపివేయబడ్డవి. భూములపై కబ్జా తిరిగి కౌలుదార్లకు ఇవ్వడం కూడా జరిగింది.

మూడు కుటుంబ కమతాలకు మించిన భూములు కలిగి ఉన్నట్టి భూస్వాముల భూములను సేద్యం చేస్తూ ఉన్న కౌలుదార్లను రక్షిత కౌలుదార్లుగా ప్రకటించే శాసనం 1956 మార్చి నుంచి అమలులోకి వచ్చింది. ఇందులోని ముఖ్య విశేషమేమిటంటే – కౌలుదార్లకు భద్రత చేకూర్చబడింది. కౌలు గడువు తీరిపోయి, పొలం సేద్యం చేసుకునే కౌలుదారును భూమినుండి భూకామందు బేదఖలు చేసే ప్రమాదం ఇక లేకుండా పోయింది. భూకమతాలపై గరిష్ఠ పరిమితి అమలులోకి తేబడింది. రక్షిత కౌలుదార్లు అనబడే ఒక కొత్త రైతు వర్గం భూమి అమరిక విధానంలో (Land tenure System) వ్యవహారంలోకి వచ్చింది.

కౌలుదార్లకు భూయాజమాన్యాన్ని సంక్రమింపజేసే శాసనాన్ని వర్తింపు చేసే విషయంలో రామకృష్ణారావుగారు మొదట ఎంపిక చేసిన జిల్లా ఎటువంటిదీ అంటే అక్కడ శాసనంవల్ల దెబ్బతినే భూస్వాములు వీరి బంధు వర్గానికి చెందిన వారో, లేక దగ్గరి మిత్రులో కావడం తటస్థించింది. అయినా వీరు వెనుదీయలేదు. అందుచేత వీరి బంధువులే మొన్న మొన్నటిదాకా అంటూ ఉండేవారు – మా రామకృష్ణారావు తెచ్చిన శాసనం మాకే మొదట ఎసరు పెట్టిందని!

"బూర్గుల ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు రాష్ట్రమంతటా భూ కమతాల లెక్కలతోపాటు హక్కుల రికార్డులు కూడా తయారుచేయబడ్డవి. నామమాత్రపు పట్టాదార్లు తొలగింపబడ్డారు. వాస్తవంగా భూమి తమ అధీనంలో ఉంచుకున్నవారే భూములపై యాజమాన్యం పొందగలిగారు. అట్టివారే రెవిన్యూ లెక్కల నిమిత్తమై శిస్తు చెల్లింపుదార్లుగా పరిగణింపబడ్డారు. ప్రధాని నెహ్రూ ఆశించిన అభ్యుదయకరమైన సంస్కరణలను బూర్గుల ప్రవేశపెట్టి మధ్యతరగతి నాయకత్వానికి

ప్రతినిధిగా నిలిచారు. తెలుగు నేలను పాలించిన ముఖ్యమంత్రులలో బూర్గుల స్థానం విశిష్టమైనది".*

రామకృష్ణారావుగారు ముఖ్యమంత్రిగా ఉండగానే నిజాం రాజరికానికి ఒక ప్రత్యేక చిహ్నంగా ఉండిన ఉస్మానియా సిక్కా కరెన్సీ రద్దు చేయబడింది. నిజాం పాలనలో అతగాడి ప్రత్యేక కరెన్సీ, నాణెములు ఉండేవి. వాటిని హాలీ రూపాయలని అనేవారు. బ్రిటిషిండియా రూపాయలను కల్దారు రూపాయలనేవారు. ఈ రెండిటికీ మారకపు రేటు ఉండేది. హాలీ రూపాయ కల్దారు రూపాయకన్నా కొంచెం తక్కువ. మారకం చేసుకుంటే మధ్య దళారీలు లాభపడుతూ ఉండే వారు. అయినా ఈ ప్రత్యేక సిక్కా ఎందుకని చెప్పి హాలీ కరెన్సీని, నాణెములను రద్దుచేశారు. దీనిపై స్వప్రయోజనపరులు కొందరు ఒక ఆందోళన లేవదీశారు. ప్రభుత్వం ఆ ఆందోళనను అణచివేసింది. ఈ విధంగా రామకృష్ణారావుగారు హాలీ సిక్కాను రద్దుచేసి, ఇండియా కరెన్సీని ఇక్కడ వ్యాప్తంచేశారు.

బూర్గులవారి హయాంలోనే వరంగలు జిల్లా చాలా పెద్దగా ఉన్నదని చెప్పి ప్రజల సౌకర్యం కొరకై 1953 అక్టోబరు 1 వ తేదీనుంచి ఖమ్మంజిల్లాను ప్రత్యేకంగా ఏర్పాటు చేశారు.

1955 జూలై 1 వ తేదీనుంచి అవినీతి నిరోధక శాఖ ఏర్పాటు చేయబడింది. ఈ శాఖ 54 కేసుల్లో విచారణ జరిపింది.

వీరి హయాంలో అంతకు ముందున్నట్టి ప్రభుత్వోద్యోగుల విచారణ ట్రిబ్యూనల్ పునర్వ్యవస్థీకరింపబడింది.

రామకృష్ణారావుగారి హయాంలో విద్యారంగంలో పలు సంస్కరణలు అమలులోకి వచ్చాయి. వీరు వెల్లోడీ మంత్రివర్గంలో రెవిన్యూ విద్యాశాఖల

* 'ఆంధ్రప్రదేశ్ చరిత్ర — ఆధునికయుగం'నుంచి - ఈ గ్రంథ రచయిత శ్రీ జి. వెంకట రామారావు.

మంత్రిగా ఉన్నప్పుడే జిల్లాకొక కళాశాల చొప్పున ఏర్పాటు చేశారు. అంతకు మునుపు అన్ని జిల్లాలలో కళాశాలలు లేకుండేవి. ఉన్నత పాఠశాల స్థాయిలో తెలుగును బోధనా భాషగా వీరు ప్రవేశపెట్టారు. ముఖ్యమంత్రి అయిన తరువాత విద్యా సౌకర్యాలను రాష్ట్ర జనాభాలో 75 శాతానికి అందేట్టుగా విస్తరింపజేశారు. 500 లేక అంతకు మించిన జనాభా ఉన్న అన్ని గ్రామాలలో ఏదో ఒక పాఠశాల పెట్టించారు. నిర్బంధ ప్రాథమిక విద్యా చట్టం క్రింద ఉన్న ప్రాంతం ఇంకా విస్తరింపజేయబడింది. పాఠశాలల ఉపాధ్యాయులకు ట్రెయినింగు సౌకర్యాలు ప్రతి జిల్లాలో కల్పించబడ్డవి.

రామకృష్ణారావుగారు ముఖ్యమంత్రిగా ఉండగా విద్యారంగంలో అనుసరింపబడ్డ భాషా విధానం ఉత్తమమైంది. త్రిభాషా సూత్రం అంగీకరింపబడింది. మొదటి తరగతి నుంచీ మాతృభాష ప్రవేశపెట్టబడింది. మొదట మాతృభాష నేర్చుకున్న తరువాత మూడవ తరగతినుంచీ హిందీ రెండవ భాషగా ప్రవేశపెట్టారు. 5 వ తరగతి నుంచీ ఇంగ్లీషు ప్రవేశపెట్టారు. ఈ విధంగా మొదటి తరగతినుంచీ మాతృభాష,3వ తరగతినుంచీ హిందీ, 5వ తరగతినుంచీ ఇంగ్లీషు ప్రవేశపెట్టి హైదరాబాదు ప్రజా ప్రభుత్వం మిక్కిలి ఆదర్శప్రాయమైన భాషా విధానాన్ని అనుసరించిందని చెప్పవలసి ఉన్నది. ప్రాథమిక పాఠశాలల సంఖ్య 4,000 నుంచి వీరి హయాంలో 14,000 కు పెరిగింది.

కాలేజీలలో 3 సంవత్సరాల డిగ్రీకోర్సు ప్రవేశపెట్టవలెనన్న రాధాకృష్ణన్ కమీషన్ సిఫారసును హైదరాబాదు ప్రభుత్వం అమలు జరిపింది.

హైదరాబాదు రాష్ట్రం యొక్క మూడు భాషా ప్రాంతాలలో ట్రెయినింగు కళాశాలలు, పశు సంవర్ధన కళాశాలలు, వ్యవసాయ కళాశాలలు, ఇంజనీరింగు కళాశాలలు స్థాపింపబడ్డవి.

బూర్గులవారి హయాంలోనే వరంగలు, ఔరంగాబాదులలో విశ్వ విద్యాలయాల స్థాపనకు బిల్లులు ప్రవేశపెట్టబడ్డవి.

ఉర్దూ యొక్క ఉపయోగాన్ని, ప్రయోజనాలను దెబ్బతీయకుండా, మాతృభాష బోధనాభాష అయ్యేట్టుగా రాష్ట్ర విద్యావిధానం మార్చబడింది.

7 వ తరగతి వరకూ బేసిక్ విద్యను ప్రవేశపెట్టిన రాష్ట్రాలలో హైదరాబాదు మొదటి రాష్ట్రం.

మొదలియార్ కమీషన్ వారి సిఫారసులను అమలుపరుస్తూ, బూర్గుల వారు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడే వివిధములైన కోర్సులతో బహుళార్థ సాధక ఉన్నత పాఠశాలలు నెలకొల్పబడ్డవి. ప్రజా గ్రంథాలయముల చట్టం అమలులోకి తెచ్చారు. హైదరాబాదు నగరంలో ఉండే అసఫియా స్టేట్ లైబ్రరీ పేరును హైదరాబాదు స్టేట్ సెంట్రల్ లైబ్రరీగా మార్చారు. వీరి హయాంలోనే "ఫ్రీడం స్ట్రగుల్ ఇన్ హైదరాబాద్" అనే హైదరాబాదు స్వాతంత్ర్యోద్యమ చరిత్ర ఆంగ్లంలో నాలుగు సంపుటాలుగా ప్రచురింపబడింది.

రామకృష్ణారావుగారు ముఖ్యమంత్రి కాగానే రాజకీయంగా ఒక గొప్ప విజయం సాధించారు. నల్లగొండ జిల్లాలో జరిగిన ఉప ఎన్నికల ఫలితాలు ఆయనకీ విజయాన్ని చేకూర్చిపెట్టాయి. సరోజినీ నాయుడు కుమారుడు డా. ఎస్. ఎం. జయసూర్య, రావి నారాయణరెడ్డిగారలు నల్లగొండ జిల్లాలో పార్లమెంటుకూ, శాసనసభ స్థానాలకూ గెలిచారు. ఏదో ఒకటే ఉంచుకోవాలి కాబట్టి వారు శాసన సభ స్థానాలకు రాజీనామాచేశారు. అందువల్ల భోనగిరి, పెద్ద మునగల్లు, హుజూర్ నగర్ అనే మూడు శాసనసభ స్థానాలు ఖాళీ అయినవి. ఈ మూడు నియోజక వర్గాలలో ఉప ఎన్నికలు జరిగాయి. స్వామీజీకి సన్నిహితుడుగా, రాజకీయ తాత్వికుడుగా పేరు పొందిన గోవిందదాస్ ష్రాఫ్ కాంగ్రెసునుంచి రాజీనామా చేసి, పీపుల్స్ డెమోక్రటిక్ ఫ్రంట్ అభ్యర్థిగా భోనగిరినుంచి పోటీ చేశారు. ఇది కమ్యూనిస్టు ప్రముఖులు రావి నారాయణరెడ్డిగారి జన్మస్థానం. ఈ ఉప ఎన్నికలో కాంగ్రెసు అభ్యర్థిగా నిలిచిన హరిజన యువకుడు గోకా రామలింగం కొద్ది ఓట్ల మెజారిటీతో గెలిచాడు. ఇది రిజర్వుడు స్థానం కాదు. పెద్ద మునగల్లు నియోజక వర్గంలో కమ్యూనిస్టు ప్రముఖుడూ, సాయుధ పోరాట నాయకుడూ అయిన దేవులపల్లి వెంకటేశ్వరరావుపై పోటీచేసి కాంగ్రెసు అభ్యర్థి కంచినేపల్లి పెదవెంకట రామారావు గెలిచారు. ఈ నియోజక వర్గంలో ఎన్నికల ప్రచారం జరిగేటప్పుడు లంబాడీల మహాసభలో లంబాడీ పెద్దలు ఇద్దరిమధ్య ముఖ్యమంత్రి రామకృష్ణారావు గారిని కూర్చుండబెట్టి పదిజతల ఎడ్ల బండిమీద ఊరేగింపుగా

సభా వేదికవద్దకు తీసుకొని వెళ్ళారు. హుజూర్‌నగర్ నియోజక వర్గంలో కమ్యూనిస్టు అభ్యర్థి గెలిచాడు. అంతకుముందు జరిగిన సాధారణ ఎన్నికలలో ఈ నల్లగొండ జిల్లాలో పార్లమెంటు స్థానాలలో, శాసనసభ స్థానాలలో కాంగ్రెసు పార్టీ పూర్తిగా పరాజయం పొందింది. ఒక పార్లమెంటు స్థానానికి పోటీ చేసిన రావి నారాయణరెడ్డిగారు దేశంలో అందరికన్నా, చివరకు నెహ్రూకంటె కూడా ఎక్కువ ఓట్లు సంపాదించిన ఘనత దక్కించుకున్నారు. ఉప ఎన్నికల ఫలితాలపై నెహ్రూ రామకృష్ణారావుగారిని అభినందిస్తూ టెలిగ్రాం పంపారు.

రామకృష్ణారావుగారు ముఖ్యమంత్రిగా ఉండగానే 1955 డిసెంబరు 10వ తేదీన భారత ప్రధాని నెహ్రూ నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు శంకుస్థాపన చేశారు. ఇది దేశంలోని గొప్ప ప్రాజెక్టులలో ఒకటి. తెలుగుజాతి ఒక పెద్ద ఉద్యమం లేవదీసి సాధించుకున్న ప్రాజెక్టు ఇది. ప్లానింగ్ కమీషన్ ఉపాధ్యక్షుడుగా ఉండిన వి.టి. కృష్ణమాచారి దీనికి అడ్డుపుల్ల వేశాడనీ, దుర్గాబాయి దేశ్‌ముఖ్ జోక్యం కలిగించుకున్నారనీ, హైదరాబాదు మంత్రివర్గం ఒక తీర్మానం చేయవలసి వచ్చిందనీ చెబుతారు. అసలు ఈ ప్రాజెక్టును ఊహించినవాడు నవాబ్ అలీనవాజ్ జంగ్ అనే హైదరాబాదు ఇంజనీరు. దీని నిర్మాణం విషయంలో ఆంధ్ర నాయకులలో ఎవరు ప్రతికూలంగా ఉండినారు, ఎవరు దీనిని సమర్థించారు అనే విషయంలో నేటికీ తర్జన భర్జనలున్నాయి. ఇది ఆంధ్ర – హైదరాబాదు రాష్ట్రాల ఉమ్మడి స్కీముగా ప్రారంభమైంది. రామకృష్ణారావుగారు ఈ ప్రాజెక్టు వల్ల తెలుగుదేశానికి చెందిన తెలంగాణా ఆంధ్ర ప్రాంతాలు రెండూ లాభం పొందుతాయి కాబట్టి దీనిని హృదయపూర్వకంగా సమర్థించి, ప్రారంభదశలో హైదరాబాదు రాష్ట్రం వైపు జరుగవలసిన పనుల నన్నిటినీ చురుకుగా చేయించారు. నాగార్జునసాగర్ కంట్రోలుబోర్డు ఏర్పడినప్పుడు అందులో ఆంధ్ర ముఖ్యమంత్రి బెజవాడ గోపాలరెడ్డి, హైదరాబాదు ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావు, నీలం సంజీవరెడ్డి, గౌతు లచ్చన్న, వినాయకరావు విద్యాలంకార్, డా॥ జి. ఎస్. మెల్కోటే సభ్యులుగా ఉన్నారు.

నాగార్జునసాగర్ రిజర్వాయర్‌వల్ల మునిగిపోయే ఏలేశ్వరం స్థలం త్రవ్వకాల విషయమై బూర్గులవారు ముఖ్యమంత్రిగా భారత ప్రభుత్వ మంత్రి

హుమాయూన్ కబీర్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి ఆ పని వేగిరంగా జరిగేట్టూ, అక్కడి పురావస్తు సంపద పరిరక్షింపబడేట్టూ శ్రద్ధతీసుకున్నారు.

మొదట్లో కాంగ్రెసు శాసనసభా పక్షంలోనూ మంత్రివర్గంలోనూ సంపూర్ణ సహకారం లేకపోయినా రామకృష్ణారావుగారు పరిపాలన సక్రమంగా నడిచేటట్టు శ్రద్ధ వహించారు. కాంగ్రెసులో అన్ని ముఠాలను సమన్వయ పరుచుకుంటూ వచ్చారు. శాసనసభలో ప్రతిపక్షాల వాదనలను, ఆరోపణలను ఎదుర్కోవడంలో మంచి ప్రజ్ఞచూపారు. నిర్ణయాలను చేయడంలో వాస్తవాలను దృష్టియందుంచుకొని ఆచరణ సాధ్యమైన రీతిలో ఆలోచించి చేసేవారు. మొత్తంపై హైదరాబాదు పరిపాలనలో సుస్థిరత్వాన్ని నెలకోల్పగలిగారు.

రామకృష్ణారావుగారి మంత్రివర్గం ఏర్పడ్డ 10 నెలలకే ప్రతిపక్షం తరపున శాసనసభ్యుడు జి. రాజారాం వారి మంత్రివర్గంపై 1952 డిసెంబరు 17వ తేదీన అవిశ్వాస తీర్మానాన్ని తెచ్చారు. ప్రభుత్వ విధానాలు సవ్యంగా లేవనీ, ప్రజాభీష్టానికి వ్యతిరేకమైన విధానాలను అనుసరిస్తున్నారనీ, భూసంస్కరణల విషయంలో, సేల్సుటాక్సు, సిర్పూరు సిర్‌సిల్క్ పరిశ్రమల విషయంలో ప్రభుత్వం ప్రజల అభిమతానికి విరుద్ధంగా వ్యవహరించిందనీ, కనుక ప్రభుత్వం ప్రజల విశ్వాసాన్ని కోల్పోయిందనీ, శాసనసభ ప్రభుత్వంపై అవిశ్వాసాన్ని ప్రకటిస్తూ ఉందనీ ఆ తీర్మానం సారాంశం. మఖ్దూం మొహియుద్దీన్, వి.డి. దేశపాండే వంటి ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు ఈ తీర్మానంపై చర్చలో పాల్గొని బూర్గులవారి ప్రభుత్వంపై ధ్వజమెత్తారు.

మంత్రివర్గం అధికారంలోకి వచ్చి సంవత్సరం కూడా కాలేదు, ఏమి చేయడానికైనా వ్యవధి చాలదు అని శాసనసభ స్పీకర్ అన్నారు.

రామకృష్ణారావుగారు తీర్మానంలో ప్రస్తావింపబడ్డ ప్రతి ఒక్క అంశానికీ సమాధానం చెప్పారు. వారి సమాధానం సహేతుకంగానూ, వాస్తవాలు ఆధారంగానూ, సమర్థవంతంగానూ ఉంది. సమాధానం ఉర్దూలో చాలా పేజీలలో రికార్డు చేయబడివుంది. 1952 డిసెంబరు 19వ తేదీన తీర్మానంపై సభ్యుల ఓటింగు తీసుకున్నారు. సభలో హాజరైఉన్న సభ్యులలో 77 మంది అవిశ్వాస తీర్మానానికి

అనుకూలంగా ఓటు చేశారు. 95 మంది వ్యతిరేకంగా ఓటు వేశారు. అవిశ్వాస తీర్మానం వీగిపోయింది.

నిజాం నిరంకుశత్వం నుంచి, మధ్యయుగాల ఫ్యూడల్ వ్యవస్థ నుంచి, మతోన్మాదపు చిహ్నాలు తుడిచిపెట్టుకు పోకుండా దాని అవశేషాలు ఇంకా బాగా కన్పిస్తూ ఉన్న స్థితినుంచి అప్పుడే బైటపడ్డ హైదరాబాదు రాష్ట్రానికి ముఖ్య మంత్రిగా పదవిలో కొనసాగగల స్తోమత ఉండటం సామాన్యమైన విషయం కాదు. తెలుగువారు, మహారాష్ట్రులు, కన్నడిగులు కలిసిఉన్న రాష్ట్రమిది. పైగా తాము పాలకజాతికి చెందినామని తలంచే ముస్లిములు అధికంగా ఉన్న ప్రాంత మిది. ఉత్తరదేశీయులు, మార్వాడీలు, ఆంధ్రేతరులు ఇక్కడి ఆర్థిక వ్యవస్థపై పెత్తనం కలిగిఉండేవారు. రాజా పన్నాలాల్‌పిట్టీ వంటి లక్ష్మీపుత్రులు ప్రాబల్యం వహించిఉన్న ప్రాంతం. ఇక జాగీర్దార్లు, అమీర్లు మున్నగువారి ప్రాభవం ఉండనే ఉంది. వీరందరి విశ్వాసాన్ని చూరగొన్నవాడై ఉండాలి ముఖ్యమంత్రి. వారందరినీ ఎవరి స్థానంలో వారిని ఉంచుతూ, భారత ప్రభుత్వ విధానాలను నిరాటంకంగా అమలు జరుపుకు పోవాలి. ఏ వర్గం పట్లా మొహమాటం చూపడా నికి వీలులేదు. అయితే ఆ చేసేది ఏదో ఎవరికీ క్లేశం కలిగించకుండా చేయాలి. సభ్యత, సంస్కారం, నాగరీకము, సహనం, నిదానం, మర్యాద చూపాలి. హైదరాబాదు సంస్కృతి అనబడే ఒక ప్రత్యేక నాగరికతను (అలాంటి సంస్కృతి ఒకటి పెంపొందినమాట మాత్రం నిజం. అయితే అది కృత్రిమ మైనదీ, ఫ్యూడల్ సంబంధమైనదీ కాదా అంటే అది వేరే విషయం. హైదరాబాదు సంస్కృతి అనేది ఇచటి ప్రత్యేక ధాచరికం వల్లా, అమీరుల శ్రీమంతుల జీవితపు షోకదలవల్లా, భోగమూ, బద్ధకం వల్లా, ఉర్దూభాషా సాహిత్యాల ప్రభావం వల్లా, ముస్లిం సంస్కృతి సభ్యతల ప్రాభవం వల్లా, ఆనందానుభూతిపై మోజువల్లా పెంపొందిన ఒక సంస్కృతి విశేషం. దానిని అన్ని మతాలవారూ మన్ననచేస్తూ అనుషిస్తూ, అలా చేయడంలో ఒక ఆనందానుభూతిని పొందుతూ ఉండేవారు. మతోన్మాదులకు అందులో స్థానం ఉండేది కాదు. కాని చాలామంది ముస్లిములు అలాంటి సంస్కృతి ఒకటి ఇక్కడ ఉద్భవించి అది ఉత్థాన స్థితిలో ఉన్నందుకు గర్వించేవారు.) తానూ పాటిస్తున్నట్లు పైకి కనిపించే విధంగానైనా ప్రవర్తనలో చూపాలి. ఈ విషయంలో కూడా రామకృష్ణారావుగారు లోపం లేకుండా మసులు కొనేవారు. హైదరాబాదు సంస్కృతికి వ్యతిరేకికానట్టి, దానిపై గౌరవం కలిగ్గి

నట్టి సంస్కారవంతుడూ, సాహితీపరుడూ పదవిలో ఉన్నాడన్న భావాన్ని ఆయన ఇచటివారిలో కలిగించగలిగారు. అయితే ఆయన నూటికి నూరుపాళ్ళు జాతీయవాది, జాతీయోద్యమం నుండి ఆవిర్భవించిన 'కాంగ్రెస్ కల్చర్' మేధావి అన్న విషయాన్ని వారెరుగుదురు. తక్కిన అన్ని విషయాలకన్న, కాంగ్రెసు విధానాలకూ, ఆదర్శాలకూ, లక్ష్యాలకూ మొదటి ప్రాధాన్యాన్ని ఇచ్చే పెద్ద మనిషిగా కూడా వారెరుగుదురు. ఈ విషయంలో జవహర్‌లాల్‌నెహ్రూ గారికి కూడా రామకృష్ణారావు గారిపై గట్టి నమ్మకం ఉండేది. తక్కిన మితవాదుల నుంచి వీరిని వేరుచేసి పండితనెహ్రూ చూడగలిగారన్న విషయం స్వామీజీ సన్నిహితవర్గం ఆయన అభ్యుదయవాది కాడు అని పదేపదే అంటున్నప్పటికీ ఆయననే ముఖ్యమంత్రి పదవిలో కొనసాగనివ్వడమే. ఆ రోజులలో కూడా ఒక రాష్ట్రంలో ముఖ్యమంత్రిగా ఎవరు కొనసాగాలన్న విషయాన్ని కాంగ్రెసు అధిష్ఠాన వర్గం వారే నిర్ణయిస్తూ ఉండేవారు. అయితే కాంగ్రెసు శాసనసభా పక్షంలో పదవిలో ఉండే ఆ వ్యక్తికి అధిక సంఖ్యాకుల మద్దతు ఉందా లేదా అనే విషయాన్ని మాత్రం కనిపెట్టేవారు. మద్దతు లేకపోతే దిగిపొమ్మనేవారు.

బూర్గుల రామకృష్ణారావుగారి ముఖ్యమంత్రి పదవికి ఎప్పుడైనా ముప్పు వస్తే అది ప్రజల నుంచి వచ్చిందికాదు. కాంగ్రెసు అధిష్ఠానవర్గం నుంచి వచ్చిందికాదు. ఒక భాషా ప్రాంతం వారి నుంచి లేక ఒక మతంనుంచివచ్చింది కాదు. అది నిస్సందేహంగా రాష్ట్ర కాంగ్రెసులోని గ్రూపులవల్ల వచ్చిందే. స్వామీజీ వర్గానికి చెందిన ముగ్గురు మంత్రులు రాజీనామాలు చేసిన తర్వాత రామకృష్ణారావుగారు తమ మంత్రివర్గాన్ని పునర్నిర్మించి అసమ్మతి వర్గంవారు లేకుండానే చివరిదాకా ముఖ్యమంత్రి పదవిని నిర్వహించారు. అంటే స్వామీజీ వర్గం అలాగే ఉంది. రెడ్డి—రావు వర్గం అనబడేదీ అలాగే ఉంది.

ఈ ఉభయ వర్గాలకూ అసలు ప్రాతిపదిక రీత్యానే విభేదాలున్నాయి. సిద్ధాంత సంబంధమైన అభిప్రాయ భేదాలు ప్రబలంగా ఉండేవి. ఒకరిపై ఒకరికి విశ్వాసంలేదు. మా మతాలు వేరు అన్నట్టు ఉండేది వారి ముఠాతత్వం. ఈ విషయం కాంగ్రెసువాది అని చెప్పుకోబడ్డ గోవిందదాస్ ష్రాఫ్ (ఇతడు స్వామీజీకి మిత్రుడు. అంతరంగికుడు, రాజకీయ తాత్త్వికుడు, సచివుడు) ఆ

తర్వాత జరిగిన ఉప ఎన్నికల్లో పి.డి.ఎఫ్. అభ్యర్థిగా పోటీ చేయడాన్నిబట్టే విశదమవుతూవుంది. అంటే కాంగ్రెసువాది అనుకోబడ్డవాడు నిమిషాలలో పీపుల్స్ డెమోక్రటిక్ ఫ్రంట్ మనిషిగా మారిపోయాడు! ఆ ఉపఎన్నికలో అతను ఓడిపోయాడు, ఆ రాజకీయ సంఘటన తర్వాత స్వామీజీ అనుచరవర్గం బలం నైతికంగా తగ్గిపోయింది. అయినా రామకృష్ణారావుగారి నాయకత్వమంటే గిట్టనివారు నెహ్రూగారికి ఏవో ఫిర్యాదులుచేశారు. హైదరాబాదు కాంగ్రెసు శాసనసభా పక్షంలో రామకృష్ణారావుగారి బలం పోయిందనీ, వారు ముఖ్యమంత్రి పదవిలో కొనసాగడానికి అనర్హులనీ అధిష్ఠాన వర్గానికి చెప్పారు. చెప్పడమేకాదు, వారిపై ధ్వజమెత్తి హైదరాబాదులో, ఢిల్లీలో ప్రచారం చేశారు. ఇది విచారించి చూడవలసిన విషయమని భావించి నెహ్రూ స్వయంగా హైదరాబాదు వచ్చి కాంగ్రెసు శాసన సభ్యుల సమావేశాన్ని హైదరాబాదులో 1954 జనవరి 6 వ తేదీన ఏర్పాటుచేసి ఎవరు ముఖ్యమంత్రిగా ఉండాలో సభ్యులు వారి వారి అభిప్రాయాలను వ్రాసి ఇవ్వవలసిందని కోరారు. రహస్య ఓటింగు పద్ధతి పెట్టారు. శాసన సభ్యులు బిత్తరపోయారు. అయినా రామకృష్ణారావుగారికి శాసన సభాపక్షంలో బలం తగ్గిపోయింది అంటూ వినవచ్చిన కాకిగోలకు సమాధానంగా పార్టీ సభ్యుల అభిప్రాయం తెలుసుకోవడానికి అదే సరైన పద్ధతి అని నెహ్రూ గారికి తోచింది. ఆ సమావేశ విశేషాన్ని అప్పటి కాంగ్రెసు శాసన సభ్యురాలు శ్రీమతి సంగెం లక్ష్మిబాయి ఒక వ్యాసంలో ఈ విధంగా వ్రాశారు. *

ప్రత్యక్ష సాక్షి కథనంవలె ఉన్న ఈ వృత్తాంతం పాక్షికమైనదని అనుకోవడానికి వీలులేదు.

"అప్పుడు హైదరాబాదులో కులతత్వాల బాధ ఉండేదికాదు. కొండా వెంకట రంగారెడ్డిగారికి శత విధాలుగా రామకృష్ణారావుగారిని చీఫ్ మినిష్టర్ చేయాలని దృఢ సంకల్పం ఉండేది. ప్రప్రథమంగా హైదరాబాదు స్టేట్‌లో

* డా॥ ఎం. చెన్నారెడ్డి షష్టిపూర్తి అభినందన సంచికలో (జనవరి 13, 1979) శ్రీమతి సంగెం లక్ష్మీబాయిగారి వ్యాసం. ఈమె చిన్నతనంలో ఉన్నవ లక్ష్మీనారాయణ దంపతులు గుంటూరులో నెలకొల్పిన శారదా నికేతనంలో చదువుకున్నారు.

ఎంతో ధీశక్తిగల బూర్గుల రామకృష్ణారావుగారిని నాయకునిగా ఎన్నుకోవడం జరిగింది. ఆ రోజులలో దినదిన గండంగా ఉండేవి. శాసనసభలో కమ్యూనిస్టు సభ్యులు చాలామంది ఉండేవారు. విశ్వాస రాహిత్య తీర్మాన ప్రమాదం ఉండేది. రామకృష్ణారావుగారు మేధావి. మెదలకుండా రామచిలుకను పంజరములోనికి తెచ్చినట్లు కొందరిని తమ కాంగ్రెసులోకి చేర్చుకున్నారు. (దీని అర్థం పార్టీ ఫిరాయింపులు చేయించారనికాదు. అటువంటిదేమీ జరగలేదు – రచయిత) కాంగ్రెసు సంస్థను గట్టిపరిచారు. స్వామీజీ గ్రూపువారు నలుగురు మంత్రులు మంత్రి మండలి నుండి రాజీనామాచేశారు. కాంగ్రెసుకు ముప్పువచ్చునని పండిట్ నెహ్రూ పరుగెత్తుకొని వచ్చారు. పార్టీ మీటింగులో రంగారెడ్డిగారిని పిలిచి అడిగారు. రామకృష్ణారావుగారు తిరిగి నాయకులుగా వస్తారనే నమ్మకం తమకు ఉందని రెడ్డిగారు హామీ ఇచ్చారు. కాంగ్రెసులో అలజడి రేగింది. షా మంజిల్‌లో మీటింగు పెట్టారు. అందరం చేరినాం అక్కడికి. పండిట్‌జీ వచ్చి దర్వాజా బంద్ కరో అన్నారు. అందరం హాజరు అయినామో లేదో చూశారు. ఆయన ఒక టేబిలు మీద కూర్చున్నారు. మేము మొదటి వరుసలో కూర్చున్నాం. నెహ్రూజీ గభాలున లేచివచ్చి నా చేతిలో ఉన్న లంబాడీ పూసలతో పొదిగిన నా చేతి సంచీని గుంజుకున్నారు. నేను దిగాలుపడి చూస్తూ ఉండగా సంచీలో ఉన్న వన్నీ- కాగితాలు, చిల్లర డబ్బులు - బల్లమీద గుమ్మరించారు. అంతకుముందే చింపి ఇచ్చిన చీటీల మీద మీ ఓటును నమోదు చేయాలని చెప్పి, ఎవరూ లేచిరావద్దని పండిట్‌జీ ఆజ్ఞ ఇచ్చారు. తనే స్వయంగా తన చేతికర్ర చంకలో పెట్టుకొని చేతితో నా సంచీ పట్టుకొని, తనే స్వయంగా మా వద్దకు వచ్చి ఒకటి, రెండు, మూడు అని ఓట్లు లెక్కపెట్టుకున్నారు. శాసనసభ్యులందరివద్దకూ వెళ్ళి చీటీలు తీసుకున్నారు. లెక్కపెట్టి చూస్తే బిందూగారికి 8 ఓట్లు, ఫూల్‌చంద్‌గాంధిగారికి 4 ఓట్లు! తక్కిన ఓట్లు అన్నీ రామకృష్ణారావుగారికి వచ్చినవి. ఆ విధంగా రామకృష్ణారావుగారు మరొకసారి ముఖ్యమంత్రిగా రావడం జరిగింది".

బూర్గుల వారిని ముఖ్యమంత్రి పదవినుండి దించడానికి అసంతృప్తి వాదులు చేసిన ప్రయత్నం భారత ప్రధాని సమక్షంలో ఇలా విఫలమైంది. ఇట్లా ముఖ్యమంత్రి రామకృష్ణారావుగారు అనేక పరీక్షలు ఎదుర్కోవలసి వచ్చింది. కాబట్టే "రామకృష్ణారావుగారి ముఖ్యమంత్రిత్వం బహు యాతనలతో కూడుకొని

సాగినది" అని ఉమ్మెత్తల కేశవరావుగారు అన్నారు.* దీనికి వారు చూపిన కారణాలు ఇవి. : "మొదటి యాతన అస్తినాస్తితో కూడిన పార్టీ మెజారిటీ. రెండవది శాసనసభలో కమ్యూనిస్టుల బలమగు ప్రతిపక్షము. విచ్ఛిన్నతయే పార్టీవారి అప్పటి రాజనీతి. మూడవది భూసంస్కరణలు చేయుటకు పూను కున్నందున భూస్వాములు, సంపన్నుల అసహకారము. నాల్గవది ప్రత్యేక తెలంగాణా ఉద్యమాన్ని ఎదుర్కొనుట వలన తనను బలపరచే తెలంగాణా శాసన సభ్యులతో విరోధము. అయిదవది స్టేట్ కాంగ్రెస్ అధ్యక్షులగు స్వామిజీ నిరసన. ముందు నూయి, వెనుక గోయి. యేక్షణంలో ప్రభుత్వము పడిపోతుందో అన్న పరిస్థితిలో ఉండేవారు.''

ఈ అసంతృప్తి వర్గంవారు దైనందిన పరిపాలనను కూడా సాఫీగా సాగ నివ్వనందుకు రామకృష్ణారావు ఒక దశలో విసుగుజెంది కోపోద్రిక్తులై తాను ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేస్తానని ప్రధాని నెహ్రూగారికి, భారత ప్రభుత్వ దేశవ్యవహారాల మంత్రి పండిత గోవింద వల్లభపంత్‌గారికి లేఖలు వ్రాశారు. రావుగారు పంత్‌గారికి వ్రాసిన లేఖ నకలును, అందుకు పంత్‌గారు రావుగారికి వ్రాసిన సమాధానం నకలును ఈ రచయిత చూడటం తటస్థించింది. 1955 ఏప్రిల్ కాలపు ఉత్తర ప్రత్యుత్తరాలివి. మొదటి రెండు సంవత్సరాలలో స్వామీజీ గ్రూపువారు తనను పదవినుండి తొలగించ విశ్వ ప్రయత్నాలు చేయగా, ఈ సంవత్సరం రంగారెడ్డి గ్రూపు ఆ పనికి పూనుకున్నదనీ, ఇట్టి పరిస్థితిలో ప్రభుత్వ సుస్థిరత ఎలా సాధ్యమో తనకు అర్థం కావడం లేదనీ, ఇప్పుడు ఈ గ్రూపువారి లక్ష్యం ఇప్పుడున్న ఒకరిద్దరు బ్రాహ్మణ మంత్రులను తొలగించి,వారిస్థానే మరింతమంది బ్రాహ్మణేతర మంత్రులను నియమించేందుకు తనపై వత్తిడి తేవడమేనని బోధపడుతున్నదనీ,ఈ విధంగా మంత్రివర్గమనేది ఏ రూపంలో ఎలా ఉండాలో పార్టీ సభ్యులకు ఆటవస్తువైపోయిందనీ, ఇట్టి స్థితిలో తాము పనిచేయజాలమని, ప్రతి సంవత్సరం పార్టీయొక్క అవిశ్వాస తీర్మానాన్ని ఎదుర్కోవలసి రావడం ఆత్మగౌరవం కల మనిషికి సంకటంగా ఉంటుందనీ,

---

* బూర్గుల రామకృష్ణారావు జీవిత చరిత్ర - రచన: ఉమ్మెత్తల కేశవరావు. అక్టోబరు - 1983.

అందుచేత నాయకత్వంలో మార్పు జరిగితే చెరిపి శుభ్రం చేసిన పలక మాదిరిగా ఉండి, కొత్త నాయకుడు కొత్త మంత్రివర్గాన్ని ఏర్పాటు చేసుకోవచ్చునని బూర్గులవారు వారి లేఖలో తెలియపరిచారు. అప్పుడు ఢేబర్‌గారు కాంగ్రెసు అధ్యక్షులు.

అందుకు పంత్‌గారు సమాధానం వ్రాస్తూ పార్టీ నాయకత్వంలో మార్పు సంగతి ఆలోచించడమే తమ మానసిక ప్రశాంతతను భంగపుచ్చేదిగా ఉందని అంటూ ఇలా అన్నారు: "హైదరాబాదు పెద్ద రాష్ట్రం. ప్రవాహాలు, ఎదురు ప్రవాహాలు అసంఖ్యాకంగా ఎప్పుడూ పనిచేస్తూనే ఉంటాయి. ఈ పరిస్థితిలో కూడా మీరు స్థిరంగా సమతూకాన్ని నిలబెట్టుకుంటూ రాగలిగారు. ఈ పనిని విజయవంతంగా చేయగలిగిన మరొక వ్యక్తి ఉన్నాడా అని నా సందేహం. ఉన్నదానిని చెడగొట్టడానికి ఏవేవో సాధనాలతో ఆశలు చూపి మనుషులను ఆ క్షణానికి కూడగట్టుకోవచ్చు. కాని మీరు నిష్క్రమించారంటే గ్రూపు వైషమ్యాలు అసంతృప్తి వర్గీయుల విచ్చిత్తికి కూడా దారితీసి, తత్ఫలితంగా ప్రభుత్వం లాంఛన ప్రాయంగానైనా పనిచేయడం అసాధ్యమవుతుంది. బిందూ ఎన్నిక కూడా ప్రమాదరహితంగా జరిగేదని అనుకోలేము. కనుక ఈ స్థితిలో ఈ విపత్తు రాకుండా మీరు నివారించవలెనని నేను మిమ్ము కోరుతున్నాను. మీ ఆరోగ్యం కార్యభారం వహించడానికి మిమ్మల్ని అశక్తులుగా చేయని పక్షంలో ఈ విషయాన్ని ఇంతటితో ముగింపజేసి, ఏ ప్రయత్నాన్ని అయినా విరమించుకోవలసిందిగా కోరుతున్నాను."

1955 మే 2వ తేదీన రామకృష్ణారావుగారు చెన్నారెడ్డివద్దనుంచి ప్లానింగ్ అభివృద్ధి శాఖలను తీసేసుకోవలసిన పరిస్థితి వచ్చింది.

ముఖ్యమంత్రిగా రామకృష్ణారావుగారు విజయవంతంగా పదవీ నిర్వహణ చేసినట్లు స్టేట్ కాంగ్రెసులోని అన్ని వర్గాలు అంగీకరించాయి. అసలు వీరిని పార్టీ నాయకునిగా ఎన్నుకోవడం కాంగ్రెసు శాసనసభా పక్షం చేసిన సమంజస మైన నిర్ణయమని ఆ తరువాతి సంఘటనలు రుజువు చేశాయి. కాంగ్రెసు పార్టీకి అత్యంతము సమర్థుడైన ముఖ్యమంత్రి లభించారని ప్రతిపక్షం లోలోపల అను కునేది. మంచి పరిపాలనాదక్షులూ, పార్లమెంటేరియనూ కావడంవల్ల వీరు

శాసనసభలో జరిగే వాద ప్రతివాదాలలో సమర్థవంతంగా సమాధాన మివ్వ గలిగారు. అప్పటి కాంగ్రెసుపార్టీ మెజారిటీ 3 లేక 5 మాత్రమేనని చెబుతారు. ఐదుగురు కాంగ్రెసు సభ్యులు పార్టీనుంచి వెళ్ళిపోతే ప్రభుత్వం పడిపోయే అధికార పక్షమది! పైగా అప్పుడు పార్టీ ఫిరాయింపులపై ఆంక్షలు లేవు! ఆ స్థితిలో ఆయన తన టర్మ్ పూర్తి అయ్యేదాకా పదవిలో ఉండి ప్రభుత్వాన్ని నడుపుకు రాగలిగా రంటే ఆయన ఎంతటి ప్రతిభావంతుడో ఊహించవలసిందే. ఆయన కొండా వెంకట రంగారెడ్డిగారి వైపు మొగ్గుచూపేవారని కొందరు అనేవారు. వాస్తవ మేమిటంటే—వీరిద్దరూ ఆత్మీయులు. రంగారెడ్డిగారి చిత్తశుద్ధిని, ఋజువర్తనమును రావుగారు ఎరుగుదురు. రావుగారి వైదుష్యంపై, సమర్థతపై, స్థిరమైన నడవడిపై రెడ్డిగారికి అచంచలమైన విశ్వాసం ఉండేది. ముఖ్యమంత్రిగా రామకృష్ణారావుగారు ఏ ఒక్క వర్గంవారి చెప్పుచేతలల్లో ఉండి పనిచేయలేదు. ఏ ఒక్క వర్గంవారి మాటకూ హెచ్చు ప్రాముఖ్యం ఇవ్వలేదు. ఆయన కాంగ్రెసు హైకమాండుకు మాత్రమే విధేయులై ఉండి పనిచేశారు. దృఢమైన జాతీయవాది కాబట్టి తన సంస్థ తాను ఏమి చేయవలెనని ఆశిస్తుందో దానిని గూర్చి ఆయనకు చక్కని అవగాహన ఉండేది. ఆయన తమ సహచరులపట్ల ఎన్నడూ నిరంకుశంగా ప్రవర్తించలేదు. ఏ మంత్రియొక్క శాఖ పనిలోనూ జోక్యం కలిగించుకోలేదు. ఏ మంత్రికీ ఉత్తర్వులివ్వలేదు. తాము నిర్దేశించిన విధానాలనుబట్టి ఎవరి శాఖను వారు నడుపుకోనిచ్చేవారు. ఈ విషయాన్ని వారి మంత్రివర్గంలో క్యాబినెట్ హోదాగల మంత్రిగా పనిచేసిన గోపాలరావు ఎక్బోటే ధ్రువపరిచారు. శాసనసభ చర్చలలో ఒక సభ్యుని ప్రసంగానికి ఆయన అడ్డుతగిలేవారుకారు. అలాగే తన ప్రసంగానికికూడా అడ్డు తగలవద్దని ఒకసారి ప్రతిపక్ష నాయకుని హెచ్చరించారు. నేటివలె అది ఒకేభాష మాట్లాడబడే ప్రాంతంకాదు. బహు భాషల హైదరాబాదు రాజ్యం. ప్రాంతీయాభిమానాలు ఉండేవి కావని చెప్పలేము. తమ భాషవాడు కాదు కాబట్టి ఆయనను ఆంధ్రేతరులు విమర్శనాదృష్టితోనే పరిశీలించేవారు. ముఖ్యమంత్రి భాషకు చెందినవారిలో అధిక సంఖ్యాకులు కాంగ్రెసుపార్టీకి ప్రతిపక్షమైన వారు. అయినా పూర్తి టర్మ్ పరిపాలించగలిగిన తెలుగు వెలుగు బూర్గులరామకృష్ణా రావుగారు. మరొక ఆంధ్రుడు లేదా మరొక మహారాష్ట్రుడు లేక మరొక కన్నడ నాయకుడు అప్పట్లో ఆ విశిష్ట గౌరవానికి అర్హుడైనవాడు లేడనే చెప్పవచ్చు. బూర్గులవారి ముఖ్యమంత్రి పదవి విషయమై తక్కినవారి మాట అలాఉండనిచ్చి

స్టేట్ కాంగ్రెసు సంస్థకు తిరుగులేని ప్రజాబాహుళ్యపు నాయకుడూ, శాసనసభ కాంగ్రెసు పార్టీ నాయకత్వానికి బూర్గులను ఎదిరించిన గ్రూపును సమర్థించిన వాడూ అయిన స్వామి రామానంద తీర్థగారి అభిప్రాయానికి హెచ్చు విలువ ఉంటుందనేది పరమ సత్యం. స్వామీజీ చాలాకాలం తర్వాత తాము రచించిన ఒక గ్రంథంలో* తమ అనుభవాలూ, జ్ఞాపకాలు నమోదుచేస్తూ రామకృష్ణారావు గారి వ్యక్తిత్వానికి ఈ విధంగా ఘనంగా జోహార్లు అర్పించారు:-

"రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఆయన పదవీ బాధ్యతలను నిర్వహించిన కాలంలో బూర్గుల రామకృష్ణారావు సుస్థిరమైన పరిపాలనను ప్రజలకివ్వగలిగారు. రాష్ట్ర శాసనసభలో జరిగిన చర్చలను బట్టి చూస్తే ఆయన ఆరోగ్యవంతమైన స్వచ్ఛమైన ప్రజాస్వామిక సంప్రదాయాలనూ, రివాజులనూ నెలకొల్ప ప్రయత్నించారని తేటతెల్లమవుతూ ఉంది. శాసనసభా నాయకుడుగా ఆయన వ్యవహరించిన తీరును ప్రతిపక్ష సభ్యులు కూడా తరచు ప్రశంసిస్తూ వచ్చారు. హైదరాబాదు స్టేట్‌కాంగ్రెసు అధినేతగా నేను పరిపాలన దృష్ట్యా, ప్రజాదృక్పథం దృష్ట్యా ప్రజలకు సంబంధించిన అనేక సమస్యలను గూర్చి ఆయనతో చర్చించవలసిన అవసరం ఉండేది. ముఖ్యమంత్రిగా ఆయనతో నేను జరిపిన వ్యవహార విషయకమైన సంప్రతింపులలో, దైనందిన పరిపాలనా విషయాలలో జోక్యం కలుగజేసుకోరాదన్న ఒక విధానాన్ని ఖచ్చితంగా పాటించాను...ఆనాటి కొన్ని ప్రాథమికాంశాల విషయంలో మా ఇద్దరి మధ్య అత్యంతము స్నేహపూర్వకమైన సంబంధాలు ఉండేవి. ఈనాటికీ కూడా ఎప్పటివలెనే పరస్పర గౌరవ భావంతో మిత్రులుగా ఉన్నాము.

బూర్గుల రామకృష్ణారావు హైదరాబాదు రాష్ట్ర ప్రజా జీవితం తాలూకు అనేకాంశాలతో బహుకాలంగా బహుముఖ ప్రత్యక్ష సంబంధం కలిగిఉన్నవారు. హైదరాబాదు స్వాతంత్ర్య సమరానికి తామూ తమ సేవలను యథోచిత రీతిని

---

* 'మెమాయర్స్ ఆఫ్ హైదరాబాద్ ఫ్రీడం స్ట్రగుల్'- రచన : స్వామి రామానంద తీర్థ. పాపులర్ ప్రకాశన్, బొంబాయి -1967, ఈ గ్రంథం బూర్గులవారు చనిపోయిన ఏడే ప్రచురింపబడింది.

అందజేసినవారు. ఆయన బహు భాషావేత్త. మంచి రాజ్యాంగవిధాన వాది. ఉన్నత శ్రేణికి చెందిన పార్లమెంటేరియను."

బూర్గులవారు తాము ఉన్నత పదవిలో ఉన్నా సంస్థకు చెందిన కార్యకర్తలు వచ్చినప్పుడు వారిని మర్యాదగా పలుకరించి మాట్లాడేవారు. కార్యకర్తలు కూడా వారంటే అభిమానం చూపేవారు. తమ నివాసంలో తరచు కార్యకర్తలతో ఇష్టాగోష్టులు జరిపి ప్రజా సమస్యలను చర్చించేవారు.

ఏ కారణాలవల్లనైతేనేమి ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటు కావడంలో జాప్యం జరుగుతున్నందుకు రామకృష్ణారావుగారు అసంతృప్తి చెందుతూ ఉండేవారు. ఆయన ఆంధ్ర ప్రాంత కాంగ్రెసు నాయకులకు మొదటినుంచీ ఇచ్చిన సలహా ఆంధ్ర రాష్ట్రం ఏర్పరచుకోండి. కాంగ్రెసు పార్టీని పటిష్ఠం చేయడానికి ఐకమత్యంతో పనిచేయండి. ప్రకాశంగారు కిసాన్ మజ్దూర్ ప్రజా పార్టీ పెట్టారు. ప్రకాశం గారిని కాంగ్రెసులో తిరిగి చేరవలసిందిగా రామకృష్ణారావు సలహా ఇచ్చారు. ఆంధ్రరాష్ట్ర శాసనసభలో కమ్యూనిస్టుల స్థానాలు **41** అయితే, కాంగ్రెసు స్థానాలు 40. అయినా ప్రకాశంగారు ముఖ్యమంత్రి అయ్యారు.

ఆంధ్రలో కాంగ్రెసు పార్టీలో సుస్థిరత లేనందుకు బూర్గులవారు విచారం వ్యక్తం చేశారు. సుస్థిరత తేవడానికి వీరు కృషి చేశారు. ఆంధ్ర ప్రజలకు ఆంధ్ర కాంగ్రెసు నాయకులపై విశ్వాసం ఏర్పడాలంటే మొదట పార్టీని పటిష్ఠం చేయడం అవసరం అంటూ బూర్గుల ప్రకాశం పంతులుగారికి లేఖ వ్రాశారు. అలాగే ఆంధ్రలో రాజకీయ సుస్థిరత ఉంటే విశాలాంధ్ర రావడం సులభమవుతుంది కనుక కాంగ్రెసును వదలివెళ్ళిన అతిరథమహారథులంతా తిరిగి కాంగ్రెసులోకి రావడాన్ని తాము అభిలషిస్తామని అంటూ తెన్నేటివిశ్వనాథం గారికి కూడా ఒక లేఖ వ్రాశారు బూర్గుల. హైదరాబాదు ముఖ్యమంత్రిగా పనిచేస్తూ ఈవిధమైన రాజకీయ పరిణామాన్ని వాంఛించి, బూర్గుల తెరవెనుక ప్రయత్నాలు చేశారు. ఆంధ్ర కాంగ్రెసు నాయకులు బూర్గుల వారితో సలహా సంప్రదింపులు జరుపడం వల్ల ఆంధ్రలో కాంగ్రెసు పార్టీ ఐక్యతకు అవి దోహదం చేశాయి. ప్రకాశం, తెన్నేటి విశ్వనాథం లేని ఆంధ్రకాంగ్రెసు బలమైన పార్టీ కాజాలదని బూర్గుల వారి అభిప్రాయం.

ఆంధ్రలో 1955 ఫిబ్రవరిలో మధ్యంతర ఎన్నికలు జరిగినప్పుడు బూర్గులవారు హైదరాబాదునుంచి 500 మంది కార్యకర్తలను పంపి అక్కడి ఎన్నికలలో కాంగ్రెసు విజయానికి తోడ్పడ్డారు. ఐకమత్యంలో పోటీ చేసేసరికి కాంగ్రెసు, ప్రజాపార్టీ, కె. ఎం. పి. లతో కూడిన యునైటెడ్ ఫ్రంట్‌కు విజయం లభించింది. లోక్‌సభలో కాంగ్రెస్ చీఫ్‌విప్‌గా ఉన్న దేవకాంత బారువా ఆంధ్ర ఎన్నికలలో కాంగ్రెస్ గెలుపుకు బూర్గులవారు చేసిన సహాయానికి కృతజ్ఞత తెలుపుతూ వారికి లేఖ వ్రాశారు. అప్పటి యునైటెడ్ ఫ్రంట్ నాయకులకు బూర్గులవారొక లేఖ వ్రాస్తూ "ఆంధ్ర, తెలంగాణా ఉభయ ప్రాంతాలకూ ఉపద్రవమైన కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని ఎదుర్కోవడంలో మీరొక పుణ్యవిధిని నెరవేరుస్తున్నారు" అన్నారు. కమ్యూనిస్టు సిద్ధాంతమంటే సాయుధ పోరాటం, హింసతో కూడిన కమ్యూనిస్టు ఉద్యమమని వారి అభిప్రాయం. యునైటెడ్ ఫ్రంట్ మంత్రివర్గంలో బెజవాడ గోపాలరెడ్డి (ముఖ్యమంత్రి) నీలం సంజీవరెడ్డి (డిప్యూటీ ముఖ్యమంత్రి), కల్లూరి చంద్రమౌళి, కళా వెంకటరావు, గౌతు లచ్చన్న, డా. ఎ. బి. నాగేశ్వరరావు, కె. ఓబుల్‌రెడ్డి వంటి ఉద్దండులు ఉన్నారు. విశాలాంధ్ర వచ్చే సమయానికి ఆంధ్రలో ఈ విధంగా పటిష్ఠమైన ప్రభుత్వం ఉండటం చాలా మంచిదే అయింది. కాంగ్రెసూ బలపడింది.

హైదరాబాదునగరంలో బర్కత్‌పురాలో ఆంధ్రయువతీమండలి అనే సంస్థ ఉంది. ఈ సంస్థ 1955 అక్టోబరులో స్థాపింపబడింది. స్త్రీల—ముఖ్యంగా మధ్యతరగతి స్త్రీలసంస్థ పూర్వం హైదరాబాదులో లేదు. లేడీ హైదరీక్లబ్బు ఉన్నత కుటుంబాల స్త్రీలసంస్థ- ఆంధ్ర యువతీమండలి మధ్య తరగతి, దిగువ మధ్యతరగతి స్త్రీలకు ఉద్దేశింపబడింది. అది వారి సాంఘిక, ఆర్థిక, విద్యా, వైజ్ఞానిక అభివృద్ధికి కృషి చేయడానికి పూనుకుంది. "శ్రీమతి బూర్గుల అనంతలక్ష్మీదేవి ఆంధ్ర యువతీమండలిలో సభ్యురాలైన తరువాత బూర్గుల రామకృష్ణారావుగారి సలహా సంప్రదింపులు లేకుండా ఈ సంస్థకు సంబంధించిన ఏపనీ సాగలేదు. ఈ సంస్థ నియమావళిని రచించినవారు రామకృష్ణారావుగారే- రావుగారు ఒక్కొక్క సోపానము ఎక్కుతున్నప్పుడల్లా యువతీమండలికూడా వారితోపాటు ఆ సోపానాలు ఎక్కుతూ వచ్చింది. వారు హైదరాబాదు రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు ఆంధ్ర యువతీమండలి స్వంతభవనము నిర్మించు

కున్నది. బర్కత్‌పురాలో చౌరస్తామీద అరఎకరం స్థలంలో విశాలమైన రెండం తస్థుల భవనం నిర్మాణమైందంటే కృషి ఎంతగా జరిగిఉండెనో ఇప్పుడు అంచెనా వేయడం కష్టం"*

ముఖ్యమంత్రిగా రాత్రి పొద్దుపోయేవరకూ ప్రభుత్వఫైళ్ళు చూచి ఉత్తర్వులు వేసి, తమను చూడడానికి వచ్చిన ముఖ్యులతో, కార్యకర్తలతో అత్యవసరంగా జరుపవలసి ఉన్న చర్చలను, సంప్రదింపులను ముగించిన తర్వాత, పడకగదికి వెడుతూ ఏ సంస్కృత కావ్యాన్నో తీసుకుపోయి కొంత సేపు పఠనంచేసి, ఆ పిమ్మట విశ్రమించేవారు. ఈ పదవిలో ఉండగా శిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారి సహాయంతో సంస్కృతంలో అధ్యయన రచనా దులు విశేషంగా చేశారు. జిల్లాలలో అధికార పర్యటనలు జరుపుతూకూడా దగ్గరలో ఏదైనా కావ్యగోష్ఠి జరుగుతూ ఉంటే ఆ సభనలంకరించి తమ కొత్త రచన చదివి వినిపించి వెళ్ళేవారు.

---

*. స్రవంతి 1967 నవంబరు సంచికలో శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారి వ్యాసంనుంచి.

# భూదానోద్యమానికి చేయూత

బూర్గుల రామకృష్ణారావుగారు హైదరాబాదు రెవిన్యూ మంత్రిగా ఉండగా తెలంగాణాలో భూదానోద్యమం ఆవిర్భవించడం యాదృచ్ఛిక సంఘటన.

మొదట రజాకార్లవల్ల, నిజాం పోలీసుల వల్ల, ఆ తరువాత కమ్యూనిస్టుల సాయుధ పోరాటంవల్ల హింసకు తావలమైపోయిన తెలంగాణాలో శాంతియాత్ర జరపాలనుకున్నారు సర్వోదయ నాయకులు వినోబాభావే. 1951 ఏప్రిల్ 15 వ తేదీన ఆయన శివరాంపల్లి నుంచి కాలినడకన శాంతియాత్ర ప్రారంభించారు. ఏప్రిల్ 18 వ తేదీన నల్లగొండ జిల్లా పోచంపల్లిలో జరిగిన ఒక సమావేశంలో ఆయన ప్రసంగించారు. అక్కడ చేరిన హరిజనులు "మాకు దున్నుకోవడానికి భూమి కావాలి. భూమి ఇప్పించండి" అని వినోబాను అర్థించారు. తాను భూమి ఎక్కడినుండి తేగలనని వినోబా సందిగ్ధావస్థలో పడ్డారు. అప్పుడు పోచంపల్లి భూస్వామి వెదిరె రామచంద్రారెడ్డి వంద ఎకరాల భూమిని హరిజనులకు పంచడానికి దానంగా ఇవ్వగలనని ప్రకటించారు. అలాగే ఇచ్చారు. ఈ విధంగా 1951 ఏప్రిల్ 18 వ తేదీన పోచంపల్లిలో భూదానోద్యమం ప్రారంభమైంది. అంతేకాని భూదానోద్యమం ఆరంభించాలని వినోబా బయలుదేరలేదు. హరిజనుల కోర్కె ఆ ఉద్యమా విర్భావానికి కారణమైంది. వినోబాగారి ఈ తెలంగాణా పాదయాత్రవల్ల రెండునెలల్లో 12 వేల ఎకరాలు భూదానం లభ్యమైంది. వినోబా యాత్రలో చిల్లేపల్లిలో బూర్గులవారు వినోబాను కలుసుకున్నారు.

రామకృష్ణారావుగారు రెవిన్యూ మంత్రిగా ఉండి భూదాన కార్యక్రమాన్ని హృదయపూర్వకంగా సమర్థించారు. దానంగా వచ్చిన భూమిని బీదలకు పంచడానికై 'శ్రీ ఆచార్య వినోబా భావే సర్వోదయ భూయజ్ఞ హైదరాబాదు లాండ్ రెవిన్యూ స్పెషల్ రూల్స్' తయారుచేయించి, 1951 ఆగస్టు 15 వ తేదీ గెజెట్‌లో ప్రకటింప జేశారు. ఇలా దీనికి చట్టబద్ధంగా ఒక స్థాయిని కలుగజేసిన

కీర్తి రామకృష్ణారావు గారికే దక్కింది. భారతదేశంలో వీరు దీనికి ఆద్యులు. ఇది చాలా సాదా నియమావళి. దేశంలో మొట్టమొదటిసారిగా భూదాన సేకరణ వితరణలకు సంబంధించిన ప్రభుత్వ నియమావళి ఇది. వినోబా విజ్ఞప్తి ననుసరించి ఒక భూమిపై తనకుగల సర్వహక్కులను వదులుకోదలచిన రిజిష్టర్డు భూకామందు లేదా ఆ భూమిపై హక్కుగల వేరొక వ్యక్తి ఎప్పుడైనా సరే ఫారం 1 పై రాజీనామా వ్రాసి తహసీల్దారుకు దాఖలు చేయవలెను. దానిని వినోబా నామినేట్ చేసిన సెంట్రల్ కమిటీ సభ్యుడుగాని లేదా సెంట్రల్ కమిటీచే ఏర్పాటు చేయబడ్డ స్థానిక కమిటీ సభ్యుడుగాని సాక్షిగా దృవీకరించవలసి ఉంటుంది. అప్పుడది మరొక వ్యక్తికి లావునీగా మంజూరు చేయబడుతుంది. అలా భూమిపై హక్కును వదులుకునే వ్యక్తి రాష్ట్ర ప్రాంతంలో భూముల న్యాయోచితమైన పంపిణీని కాంక్షించి, శాంతి సంతుష్టులను కాంక్షించి వదులుకుంటున్నాడని అర్థం. తహసీల్దారు రాజీనామాను ఆమోదించగానే అప్పటి నుంచి భూమి ప్రభుత్వ స్వాధీనమవుతుంది. దానిని ఎవరికి మంజూరు చేయాలో భూమి పంపిణీ కమిటీ కొందరు వ్యక్తులను ఎంపిక చేస్తుంది. గ్రామంలో సహకార సంఘం ఏర్పడితే భూమిని పొందిన వ్యక్తి ఆ సంఘంలో చేరాలి. ఇది ఒక షరతు. రెండవ షరతు ఏమిటంటే, అలా పొందిన భూమిని పదేండ్లదాకా అమ్మకూడదు. మంజూరైన భూమి సాగుచేయదగ్గ బంజరు భూమి అయితే దానిని పొందినవ్యక్తి కబ్జా పొందిన రెండేండ్లలోపల సాగుకు లాయకీ చేసి సాగుచేయటం ఆరంభిస్తే మొదటి మూడేండ్లవరకూ అది భూమి శిస్తు విధింపు నుంచి మినహాయింపబడుతుంది. ఇందుకు స్టాంపు ఫీజుగాని రిజిస్ట్రేషన్ చార్జీలు కాని వసూలు చేయబడవు. ఈ నియమావళి 1951 ఆగస్టు 9వ తేదీ నుంచి అమలులోకి వచ్చి 1957 ఆగస్టు 9వ తేదీ వరకూ చెల్లదగి ఉండగలదు. భూమి పంపిణీ కార్యకలాపానికి తోడ్పడే ఉద్దేశంతో ఈ సాదా నియమావళిని హైదరాబాదు ప్రభుత్వం తయారుచేసింది.

రామకృష్ణారావుగారు రెవిన్యూ మంత్రిగానే కాక ఒక గాంధేయ కార్యకర్తగా కూడా భూదానోద్యమానికి చేయూత నిచ్చారు. యావద్భారత దేశానికి పరిపాలన రీత్యా మార్గదర్శకులైనారు.

1952లో ముఖ్యమంత్రి అయిన తరువాత వీరు ఈ ఉద్యమాన్ని తీవ్రతరం చేయడానికి అవిరళ కృషిచేశారు. భూదాన కార్యక్రమ సమావేశాలు ఎన్నో ముఖ్యమంత్రి నివాసమైన 'షా మంజిల్'లో జరిగాయి.

రామకృష్ణారావుగారు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడే వినోబా రెండవసారి పర్యటనకై ఆంధ్ర ప్రాంతం వైపునుంచి (కృష్ణా జిల్లా నుంచి) తెలంగాణాకు వస్తూ ఉంటే ఖమ్మం జిల్లా కల్లూరు గ్రామం వద్ద వీరు తమ మంత్రివర్గ సహచరులతో సహా వినోబాకు అఖండ స్వాగతమిచ్చారు.

భారత రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ పాలమాకుల గ్రామానికి వచ్చి వినోబాను కలిసారు. ఈ సందర్భాన బూర్గులవారు కూడా హాజరై ఉన్నారు.

తర్వాత భారత ప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూ వచ్చి మాధవరావు పల్లెలో (మహబూబ్‌నగర్ జిల్లా) వినోబాను కలుసుకొని భూదానోద్యమ ప్రగతిని గూర్చి తెలుసుకున్నారు. ఇక్కడ నెహ్రూగారి ఉపన్యాసాన్ని బూర్గులవారు తెలుగులోకి తర్జుమా చేశారు.

రామకృష్ణారావుగారు కేరళ గవర్నరుగా వెళ్ళిపోయిన తరువాత కూడా హైదరాబాదు వచ్చినపుడల్లా భూదాన కార్యకర్తలను సమావేశపరచి కార్యక్రమాన్ని సమీక్షిస్తూ ఉండేవారు. వీరు ఆంధ్రప్రదేశ్ శాసనసభ స్పీకర్ అయ్యదేవర కాళేశ్వరరావుగారిని ఒకమారు కలుసుకోవడం తటస్థించినప్పుడు "భూదానోద్యమం ఈ గడ్డన పుట్టింది. ఇది ఒక విప్లవోద్యమం. దీనికి మీరంతా సహకరించాలి" అని చెప్పారు.

వీరు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు నిజాం రాజును నచ్చచెప్పి ౩౬౦౦ ఎకరాల భూమిని భూదానంగా ఇప్పించారు. అంతేగాక 1955లో స్వయంగా తమకున్న భూమిలో ఆరవ భాగం భూమిని భూదానంగా ఇచ్చి షాద్‌నగర్ సమావేశంలో పాల్గొన్న కాంగ్రెసువాదులందరిచేత కూడా భూదాన పత్రాలు పూర్తి చేయించారు.

యజ్ఞాలు, దానాలు మానవులకు చిత్తశుద్ధిని కలిగించేవని బూర్గులవారి విశ్వాసం. అయితే తెలంగాణా సమస్యను కమ్యూనిస్టులు ఆగ్రేరియన్ సమస్య అన్నారు. అంటే కొద్దిమంది చేతుల్లో వందలకొద్దీ ఎకరాల భూమి ఉండి, సాగు చేసుకునేవాడికి భూమి లేనట్టి వ్యావసాయిక భూముల సమస్య అని భావం. కమూనిస్టులు చెప్పిన దానిని స్టేట్ కాంగ్రెసు అధ్యక్షులు స్వామిరామానందతీర్థ గారు కూడా సమర్థించారు. అయితే అప్పుడు భారత ప్రభుత్వంలో పటేలుగారికో మరెవరికో ఆ మాట అన్నందుకు స్వామీజీపై ఆగ్రహం కలిగిందట! కాని కమ్యూనిస్టులు చెప్పిన దానిలో యథార్థం లేకపోలేదు. విసునూరు రామచంద్రా రెడ్డికి అంత భూమి ఉండగా, వినోబాను భూమి అడిగిన హరిజనులకు ఎన్నో యేండ్ల తరబడి చెక్కంత భూమి కూడా లేదు! సుప్రసిద్ధ కాంగ్రెసువాది, 'రయ్యత్' పత్రికా సంపాదకులు అయిన మందుముల నరసింగరావుగారు కూడా "తెలంగాణాలో కమ్యూనిస్టు ఉద్యమ ప్రప్రథమ దశ గ్రామీణ భూస్వామ్య విధానానికి విరుద్ధంగా జరిపిన కమ్యూనిస్టు పోరాటము" అని అంగీకరించారు.* పేదవారికి భూమిలేని ఇట్టి కొరతను భూదానోద్యమం వల్ల రక్తపాతం లేకుండా, శాంతియుతంగా తీర్చవచ్చునని వినోబా వలెనే రామకృష్ణారావుగారు కూడా ఆశించి, ఆ ఉద్యమం పట్ల శ్రద్ధాసక్తులు చూపి, తాము చేయవలసిందంతా చేశారు.

---

* '50 సంవత్సరాల హైదరాబాదు' - రచన మందుముల నరసింగరావు పుట 337.

# గ్రంథాలయోద్యమ పోషకుడు

ఆంధ్రదేశ గ్రంథాలయ 25వ మహాసభ 1944లో ఖమ్మం జిల్లా సింగరేణి కాలరీస్‌లో బూర్గుల రామకృష్ణారావుగారి అధ్యక్షతన జరిగింది. ఇటువంటి సభ తెలంగాణాలో జరగడం ఇదే మొదటిసారి. దీనికి గాడిచర్ల హరిసర్వోత్తమ రావు, చెరుకువాడ నరసింహం, అయ్యంకి వెంకటరమణయ్య, పాతూరి నాగభూషణం మున్నగు పెద్దలు విచ్చేశారు. ఈ మహాసభలో విశాలాంధ్ర ఏర్పడవలెననే తీర్మానం చేయబడటం ఒక విశేషం. అప్పటికి స్టేట్ కాంగ్రెసుపై నిజాం విధించిన నిషేధాజ్ఞ అట్లాగే ఉంది. మరి విశాలాంధ్రను గూర్చిన తీర్మానమంటే నిజాం ప్రభుత్వం ఏమని బోధపరచుకున్నదో ఏమో! లేకపోతే రామకృష్ణారావు గారు సభాధ్యక్షులు కాబట్టి మరేం ముప్పురాదనుకొని తక్కినవాటిని వారు పట్టించుకోలేదా? ఏమైనప్పటికీ ఆంధ్ర మహాసభ కాలంనాటి నిజాం పోలీసు శాఖాధిపతి ఆర్మ్‌స్ట్రాంగ్ మహాశయుడు అననే అన్నాడుకదా గ్రంథాలయాలు విప్లవ సంఘాలని! రామకృష్ణారావుగారు అగ్రాసనాధిపత్యం వహించిన ఈ గ్రంథాలయ మహాసభలో నిజాం రాజ్య అస్తిత్వ నిర్మూలనకే అంకురార్పణ చేయబడింది. ఆ తరువాత ఒక పుష్కరానికి (1956)లో విశాలాంధ్ర విషయంలో బూర్గులవారు ఒక స్థిరమైన వైఖరి అవలంబించి పూర్తిగా బైటపడ్డారు. ఏమైనా ఆంధ్రులు గ్రంథాలయోద్యమం ద్వారా కూడా తమ అభీష్ట సిద్ధికి ప్రయత్నించారు.

హైదరాబాదు నగరంలో సుల్తాన్‌బజారులో ఉన్న శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం నిజాం రాష్ట్రాంధ్రులకు తల్లి వంటి సంస్థ. దీనిని జమీందార్లు మొదలుకొని ఉన్నతోద్యోగులు, న్యాయవాదులు, డాక్టర్లు, ఆచార్యులు, అన్ని వృత్తులవారు, అన్ని కులాలవారు, చిన్న పెద్ద అనే భేదం లేకుండా భాషా దృష్టితో సేవించారు. దీనికి సేవచేసే అవకాశం కలగడమే తమ భాగ్యంగా భావించారు. దీనిని కొమర్రాజు వెంకటలక్ష్మణరావు, మునగాల రాజా నాయని వెంకటరంగారావు బహద్దరువారు, రావిచెట్టు రంగారావు గారలు 1901 సెప్టెం

బరు 1వ తేదీన (ప్లవ నామ సంవత్సర శ్రావణ బహుళ తదియ, ఆదివారం) స్థాపించారు. అంటే ఇరవయ్యో శతాబ్ది, ఈ గ్రంథాలయమూ దాదాపు ఒకేసారి పుట్టాయన్నమాట. ఇది నిజాం రాష్ట్రంలోని మొట్టమొదటి గ్రంథాలయం. దీని ఆవిర్భావంతోనే తెలంగాణాలో గ్రంథాలయోద్యమం ఆరంభమైంది. తెలుగు భాషకు ఆదరణ లేనటువంటి రోజులలో తెలుగుభాషాభివృద్ధికి, తెలుగు సంస్కృతి వికాసానికి కృషిచేసే ఉద్దేశంతో దీనిని పెద్దలు స్థాపించారు. తెలంగాణాలో 1922 నుంచి ఆరంభమైన ఆంధ్రోద్యమం అతి త్వరగా రాష్ట్రమంతటా వ్యాపించడానికి అనువైన వాతావరణాన్ని కల్పించిన ఘనత ఈ భాషా నిలయానికే చెందుతుంది. ఇచ్చటి వివిధ భాషా సారస్వతోద్యమాలలో ఈ భాషా నిలయం ప్రత్యక్షంగానో పరోక్షంగానో భాగస్వామియై ఉండి దోహదం చేసింది. పారతంత్ర్యంలో చిక్కుకొనిపోయి పరభాష, పరవేషంతో జీవిస్తూ ఉన్న తెలుగువారియందు ఈ భాషా నిలయం మరల మాతృభాషా మమకారాన్ని గుర్తెరిగింపచేసింది. వాస్తవానికి ఈ భాషా నిలయం ఉద్యమమే తెలంగాణాలోని ప్రప్రథమ ఆంధ్రోద్యమం.

ఇటువంటి ప్రాముఖ్యం గల శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయానికి బూర్గుల రామకృష్ణారావుగారు 1950 నుంచి 1952 వరకూ, 1956 నుంచి 1957 వరకూ, 1963 నుంచి 1966 వరకూ అధ్యక్షులుగా ఉండి దీని అభివృద్ధికి కృషి చేశారు.

1927 ఫిబ్రవరి 16, 17, 18 తేదీలలో ఈ భాషానిలయ రజతోత్సవాలు అత్యంత వైభవంతో జరిగినప్పుడు రామకృష్ణారావుగారు దీనికి గౌరవ కార్యదర్శిగా పనిచేశారు. 1952 సెప్టెంబరు 1 నుంచి మూడు రోజులపాటు స్వర్ణోత్సవం జరిగినప్పుడు బూర్గులవారు భాషానిలయానికి అధ్యక్షులుగా ఉండటమే కాక స్వర్ణోత్సవ మహాసభకు అధ్యక్షతకూడా వహించి ఉత్సవాలను దిగ్విజయంగా జరిపించారు. అప్పుడు వీరు హైదరాబాదు రాష్ట్రానికి ప్రథమ ప్రజా ముఖ్యమంత్రి. వీరి ఆధ్వర్యాననే రజతోత్సవ సంచిక, స్వర్ణోత్సవ సంచికకూడా ప్రచురింపబడ్డవి. రజతోత్సవాల సందర్భంలో ఈ భాషానిలయ చరిత్రను వీరే నివేదించుతూ "ఏ మహారాజు శుభనామ ప్రేరణవలన ఆంధ్ర భాషా విషయక కార్యముల కొక యుత్తేజము జనించునో, ఏ సర్వంసహాధీశుని చంద్ర శాలాంగణము ఆంధ్ర భారతికి రచ్చసావడి యయ్యెనో, ఏ సార్వభౌముడు ఆంధ్ర కర్ణా

టక సామ్రాజ్యములనేగాక, భాషా సామ్రాజ్యమును గూడ నధివసించెనో అట్టి శ్రీమన్మహా రాజాధిరాజ, రాజ పరమేశ్వర, మూరు రాయరగండ, ఆంధ్రభోజ శ్రీ వీర ప్రతాప శ్రీ కృష్ణదేవ మహా రాయల వారి పట్టాభిషేక శుభదినమును స్మరించుచూ..." భాషా నిలయ చరిత్రను ముగించారు. రజతోత్సవం జరిగి నప్పుడు బూర్గులవారు ప్రసిద్ధ న్యాయవాది; ఆంధ్రోద్యమ నాయకులు.

భాషా నిలయ స్వర్ణోత్సవాలలో హైదరాబాదు ముఖ్యమంత్రి రామకృష్ణా రావుగారు ఖద్దరు టోపీ ధరించి, అధ్యక్షోపన్యాసం చేసిన దృశ్యం, నగర ప్రముఖులూ, గ్రంథాలయోద్యమ నాయకులూ ఆసీనులై ఉన్న ఆ మహాసభ దృశ్యాలు నేటికీ స్మృతికి వస్తున్నాయి. తెలుగు ప్రజలు తెలుగు ముఖ్యమంత్రి సభాపతిగా జరుపుకున్న ఒక మహోత్సవ మది. రాజ్యాలు మారినా, రాజకీయాలు మారినా అత్యంత శక్తిమంతమైన 'తెలుగుభాషకు ఎటువంటి ముప్పురాదు, అది చెక్కు చెదరకుండా నిలిచి తీరుతుంది అన్న తమ ప్రగాఢ విశ్వాసాన్ని రామకృష్ణారావుగారు వారి అధ్యక్షోపన్యాసంలో ప్రకటించిన వైనం గమనార్హ మైంది. "దేశభాషలందు తెలుగు లెస్స' అను ఆర్యోక్తి నిజమే అయినచో మన తెలుగుభాషకు ఇతర భాషలవల్ల భంగం కలుగుతుందన్న భావము ఎన్నటికి ఉండరాదు. మనభాష సజీవమైన, సచేతనమైనటువంటి భాష. ఆంధ్రులున్నంత వరకూ ఆంధ్ర భాషకూడా ఉంటుంది. ఎందుకు ఈ ఆందోళన కలుగుతూందో నాకు అర్థము కావడము లేదు. హిందీగాని, ఉర్దూగాని, ఇంగ్లీషుగాని మరే భాష గాని తెలుగు భాషను నాశనం చెయ్యలేవు. మన భాషకు ఏమీ సంక్షోభము లేదని నేను గట్టిగా మనవి చేసుకొంటున్నాను. రాజకీయంగా గాని మరే విధంగా గాని మార్పులు వచ్చినా తెలుగుభాషకు నష్టము లేదు......రేపు రాష్ట్ర భాషగా హిందీ దక్షిణ దేశంలోకి వస్తే దానిపై దక్షిణదేశపు ముద్ర, సంస్కృతియొక్క ముద్ర తప్పకుండా పడుతుంది. కనుక ఇతర భాషలయొక్క రాబోవు ఆక్రమణలవల్ల భయపడవలసిన అవసరము ఏ మాత్రము లేదని, ఈ భయాన్ని మీ హృదయ ములో నుంచి తీసివేయాలని సర్వేశ్వరుని ప్రార్థిస్తున్నాను".

లోకంలో ఏ జాతికైనా సరే, భాష ప్రాణం వంటిదని చెబుతూ రామకృష్ణా రావుగారు "సంస్కృతి అనే పదములో అనేక విషయములు ఇమిడియున్నను, వేష భాషలు ముఖ్యముగా గమనింపబడు చుండును. వేషము జాతికి కేవలము

బాహ్య చిహ్నమగుటచే దానిని ఎప్పటికప్పుడు యిష్టానుసారముగా మార్చుకొనవచ్చును. కాని భాష ఆంతరంగిక మగుటచే మార్చుకొనరానిది. ఒకవేళ దేశ కాల పాత్రముల ననుసరించి అనివార్య కారణములవలన భాషలలో మార్పు కలిగెనేని అట్టి మార్పే సంస్కృతియందు వెంటనే ప్రతిఫలించును. భాష సచేతనమై దినదినాభివృద్ధి గాంచుచుండునేని, ఆ జాతియు నట్లే పురోగమనము చేయుచుండును. దురదృష్ట వశమున భాషయే పతనావస్థకు గురి అయ్యేనేని ఆ జాతియు పతనము వంకకు మొగ్గక తప్పదు. ఈ పరస్పర సంబంధము ఒక చారిత్రక సత్యము" అంటూ భాషను ఎప్పటికప్పుడు అభివృద్ధి పరచుకోవలసిన ఆవశ్యకతను గూర్చి దేశీయులను వీరు హెచ్చరించారు. అంతేకాక "నేటి ప్రజా స్వామిక స్వాతంత్ర్య వాతావరణమున భాషా సారస్వతములతో పాటు సభ్యత సంస్కృతుల నభివృద్ధి నొందించి తగిన వాతావరణము సృష్టించి తెలుగువారి మేధా సంపత్తికి ప్రతిభావ్యుత్పత్తులకు పదునుపెట్టి ఆంధ్ర జాతియొక్క పూర్వ విశిష్టతను పునఃస్థాపించే బాధ్యత యీ ప్రముఖ భాషానిలయపు మూపుపై పడుచున్నది" అని చెప్పారు.

ఈ స్వర్ణోత్సవ సందర్భంలో ఏర్పాటుచేసిన మహిళాసభకు ప్రారంభకురాలు రామకృష్ణారావుగారి సతీమణి బూర్గుల అనంతలక్ష్మీదేవిగారు. అధ్యక్షురాలు ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు.

జన విశ్వాసము గొన్న యాంధ్ర సచివుల్
　　స్తంభంబులై నిల్వ
రాజ్య నయాధ్యక్షుడు బూర్గులాన్వయ
　　విధుం డధ్యక్షుడై యుండ
దెల్గు నిసుంగుల్ తమ తాతతో నిడు
　　నతుల్ గొంచుం దెలంగాణ
మండన భాషా సదనంబు
　　ప్రేమమెయి విజ్ఞాపించు సుస్వాగతిన్.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రనిర్మాత

సువిశాలమైన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవతరణకు ముఖ్యకారకులు బూర్గుల రామకృష్ణారావుగారు. ఆ రోజుల్లో తెలుగునేల అంతా ఒకటి అయ్యే విషయంలో తెలుగు ప్రజలలో ఏకాభిప్రాయం లేకపోవడం శోచనీయమైన విషయం. పైగా ఇతర రాజకీయ శక్తులు తెలుగునేల ఏకం కాకుండా అడ్డుపడజొచ్చాయి. ఈ సమస్య భిన్నాభిప్రాయాలతో జటిలమైంది. ఆవులు మలిపినవాడు అర్జునుడు అన్నట్లు రామకృష్ణారావుగారు సరియైన సమయంరాగానే ఆంధ్రులకు ఒకే రాష్ట్రం ఉండవలెనని ఉద్ఘాంటించి సమస్యను ముగింపు చేశారు. ఆమాట అన్నప్పుడు ఆయన హైదరాబాదు ముఖ్యమంత్రి. కనుక ఆయన అభిప్రాయానికి ఉన్న విలువ అందరికీ తెలిసిందే. ఒకే స్టేటును చేయాలని చూస్తూఉన్న కేంద్రానికి కూడా హైదరాబాదు ముఖ్యమంత్రి అభిప్రాయం తగు బలాన్ని చేకూర్చింది. కాబట్టే పట్టాభి సీతారామయ్యగారు రామకృష్ణారావుగారిని 'మహాంధ్ర రాజనీతిజ్ఞుడు' అన్నారు.* అసలు అప్పటి రాజకీయ పరిస్థితిని గూర్చి ఒక అభిజ్ఞుడు ఇలా

---

* దాశరథి కావ్యం 'మహాబోధి'కి పట్టాభిగారు వ్రాసిన ప్రస్తావనలో - ఈ కావ్యాన్ని కవి షష్ఠ్యంతాలతో సహా బూర్గుల వారికి అంకితమిచ్చారు. రామ కృష్ణారావుగారు కృతిని స్వీకరిస్తూ ఇలా ఒక పద్యం చెప్పారు;

నీ కవితాప్రశస్తి రజనీకర
        చారుమయూఖ పుంజముల్
ప్రాకెను యావదాంధ్రమున,
        ప్రాజ్ఞులు మెచ్చగ బౌద్ధగాధలన్
గైకొని యల్లి నట్టి నవకావ్య
        వధూటిని సాదరంబుగా
నాకిడినావు, ధన్యుడను నవ్యత
        దాశరథీ! కవీశ్వరా!

వ్రాశారు. "ఈ కమీషన్ వెయ్యడంతోనే (రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కోసం తగు సిఫారసులు చేయడానికై భారత ప్రభుత్వం ఫజల్అలీ అధ్యక్షతన నియమించిన రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కమీషన్. ఇందులో పండిత హృదయనాథ కుంజ్రూ, సర్దార్ కె. ఎం. పణిక్కర్ ఇతర సభ్యులు). భారత దేశం అంతా ఉత్సాహం రేకెత్తింది. కాని హైదరాబాదు రాజ్యంలో తెలంగాణాలో నిరుత్సాహం కలిగినది. పక్కనున్న ఆంధ్ర భాగాలతో కలిస్తే తమకు నష్టం కలుగుతుందని కొందరు నాయకులు భయపడినారు. ప్రతి రాజకీయపార్టీ తన వైఖరి పునః పరిశీలన ప్రారంభించినది. అఖిల భారత పార్టీలకి సంబంధం లేకుండా ప్రాంతీయ దృక్పథంతో, వ్యక్తి ప్రయోజన దృష్టితో ముఠాతత్త్వంతో, విశాలాంధ్రవస్తే మనకి అనుకూలమా ప్రతికూలమా అని తర్జన భర్జన ప్రారంభించినారు. ఒక్క కమ్యూనిస్టు పార్టీ మాత్రం అప్పుడూ ఇప్పుడూ విశాలాంధ్ర పక్షమే."*

'రామకృష్ణారావుగారు మొదట్లో తెలంగాణము వేరే స్టేటుగా ఉండవలెనని చెప్పినవారు డిల్లీ వెళ్ళి వస్తూనే మారిపోయా'రని కొండా వెంకటరంగారెడ్డిగారు వారి 'స్వీయ చరిత్ర'లో వ్రాశారు. కాని అది ఎంతవరకు నిజమో తెలియదు. ఆయన ఎప్పుడూ ప్రత్యేక తెలంగాణా వాదిగా ముద్ర వేయించుకున్నవారు కాదు. రంగారెడ్డిగారు వారి పుస్తకంలో చెప్పినట్లు (పుట 142) తెలంగాణా ఆంధ్రములను కలుపకూడదని బూర్గుల వారు ఎప్పుడూ ప్రచారం చేయలేదు. కాకపోతే ఇదమిత్థమని వారు తేల్చిచెప్పని మాట నిజమే. వారి మంత్రి మండలిలో డిప్యూటీ మంత్రిగా పనిచేసిన ఎం. ఎస్. రాజలింగంగారు ఈ విషయాన్ని ధ్రువీకరిస్తూ చాలాకాలం తర్వాత ఒక వ్యాసంలో ఇట్లా వ్రాశారు: "రామకృష్ణారావుగారు విశాలాంధ్రకు అనుకూలంగా ఉన్నా చాలాకాలం వారు ఏదీ తేల్చి చెప్పలేదు. చెన్నారెడ్డి చిన్న రాష్ట్రాలు ఉండడం మంచిదని వాదించారు"** రామకృష్ణారావుగారు ఢిల్లీ నుంచి తిరిగి వచ్చేటప్పుడు బేగంపేట విమానాశ్రయంలో పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ "తెలంగాణా రాష్ట్రము వేరుగా నుండుట నష్టదాయకమని, తెలంగాణ, ఆంధ్ర కలిసి విశాలాంధ్ర ఏర్పడుట మంచిదని" అన్నారు.

---

* కపిల కాశీపతి 'బ్రహ్మానంద యాత్ర' లో,

** ఎం. ఎస్. రాజలింగంగారు 'చెన్నారెడ్డి షష్టిపూర్తి' సంచికకు వ్రాసిన వ్యాసంలో.

ఫజల్ అలీ కమీషన్ సూటిగా విశాలాంధ్ర రాష్ట్రం ఏర్పాటుచేయాలని చెప్పలేదు. వారు తొమ్మిది తెలుగు జిల్లాలను హైదరాబాదు రాష్ట్రంగా ఏర్పాటు చేయాలన్నారు. ఇట్టి హైదరాబాదు రాష్ట్రాన్ని ఆంధ్రరాష్ట్రంతో కలుపవచ్చు. కాని ఈ కలవడం 1961 లో జరగబోయే జనరల్ ఎన్నికల తర్వాత జరగ వలసి ఉంటుంది. ఆ ఎన్నికల తర్వాత ఏర్పడ్డ హైదరాబాదు శాసనసభ మూడింట రెండు వంతుల మెజారిటీతో కలుపుదలకి అంగీకరిస్తేనే ఈ సంలీనం జరగాలి, అని సిఫారసు చేశారు ఫజల్ అలీ కమీషన్‌వారు.

అప్పుడు బొంబాయి ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడుగా ఉన్న ఎస్. కె. పాటిల్, అఖిలభారత కాంగ్రెసు కమిటీ కార్యాలయ కార్యదర్శులు ఇద్దరు రహస్యంగా తెలంగాణా జిల్లాలలో పర్యటించి, ప్రజాభిప్రాయాన్ని కనుగొని ప్రత్యేక తెలంగాణా కోరేవారే చాలా ఎక్కువమంది ఉన్నట్లు రిపోర్టు చేశారని రంగారెడ్డిగారు వారి పుస్తకంలో తెలిపారు.

కొన్నాళ్ళకు ప్రధాని నెహ్రూ తెలంగాణా నాయకుల్ని ఢిల్లీకి పిలిపించి మాట్లాడారు. ఆ సమావేశంలో రామకృష్ణారావుగారు "రంగారెడ్డి, చెన్నారెడ్డి అంగీకరిస్తే అందరూ అంగీకరిస్తారు" అని అన్నారు. కాని రంగారెడ్డిగారు ప్రజలు 95 శాతం మంది ఒప్పుకోవడం లేదని చెప్పారు. నెహ్రూ వెంటనే "తొంభై ఐదు శాతం, తొంభై ఐదు శాతం" అని రెట్టించి ఊరుకున్నారు. నెహ్రూ గారి ఈ మాటనుబట్టే కేంద్రం ఒకే ఒక పెద్ద రాష్ట్రానికి సుముఖంగా ఉన్నదని తేలిపోయింది. అలా సుముఖంగా ఉండడానికి కారణం హైదరాబాదు రాష్ట్రాన్ని ప్రత్యేకంగా ఉంచితే ఎప్పటికైనా ఏతావాతా కలుగబొయ్యే ప్రమాదాన్ని కేంద్ర నాయకులు గుర్తించడమే. ముఖ్యంగా అప్పటి కేంద్ర హోం మంత్రి పండిత గోవింద వల్లభపంత్ ఈ ప్రమాదాన్ని బాగా అవగాహన చేసుకున్నాడు. అయితే కేంద్ర ప్రభుత్వంలో సీనియర్ మంత్రియైన మౌలానా అబుల్ కలాం ఆజాద్ గారికి హైదరాబాదు రాష్ట్ర విచ్ఛిత్తి ఇష్టంలేదు. దానిని అలాగే ఉంచాలని ఆయన శాయశక్తులా ప్రయత్నించారు. ఫజల్ అలీ కమీషన్ కూడా ఆజాద్‌గారి అభిప్రాయాన్నే మన్నించింది. కాని బూర్గుల రామకృష్ణారావుగారు హైదరాబాదు ముఖ్యమంత్రిగా ఫజల్‌అలీ కమీషన్ చేసిన సిఫారసు మంచిదికాదు. అది నిష్ప్రయోజనమైనదని అంటూ ఆంధ్రరాష్ట్రంలో తెలంగాణా జిల్లాలను కలిపివేయాలని

వాదించారు. అప్పుడు కేంద్ర మంత్రిమండలి ఈ విషయాన్ని తీవ్రంగా చర్చిస్తోంది. అక్కడ జరిగిన విషయాలను కె. ఎం. మున్షీ బైటపెట్టారు.* "హైదరాబాదును ముక్కలుగా విభజించడానికి ఇష్టపడని శక్తి సంపన్నులగు మంత్రులు ఒకరిద్దరు ఆనాటి కేంద్ర మంత్రివర్గంలో ఉండేవారని" మున్షీ వ్రాశారు. ఆజాద్ వెంటనే రామకృష్ణారావుగారిని "మీ ప్రతిపాదనకుగల ఉద్దేశ మేమిటి" అని ప్రశ్నించారు. అందుకు సమాధానంగా రామకృష్ణారావుగారు "హైదరాబాదు ప్రక్క రాష్ట్రాలలో విలీనమైపోయినప్పుడు అది విశాలమైన ఈ దేశంలో ఒక చిన్న భాగంగా ఉండిపోగలదన్న విషయం విస్మరించరాదు. అప్పుడు నేను దానికి ముఖ్యమంత్రిగా ఉండను. నా ఈ ప్రతిపాదనకు అర్థం నా రాజకీయ మరణ వారంటుపై నేనే సంతకం చేసుకోవడమన్నమాట." అని నిర్భయంగా చెప్పారు. ఆజాద్ గారిని ఎదుర్కొనే ఈ సాహసం అప్పట్లో ఎంత మంది ముఖ్యమంత్రులకుండేది? పైగా సర్దార్ పటేల్ కూడా లేరప్పుడు. కేంద్ర మంత్రివర్గ సమావేశంలో ఆజాద్‌ను ఎదిరించి మాట్లాడగల మంత్రిఏడి? కాని ఒక తెలుగు ముఖ్యమంత్రి ఆయనను ఎదుర్కొన్నాడు!

1956 మార్చి 5 వ తేదీన నిజామాబాదులో భారత సేవక్ సమాజ్ వార్షిక మహాసభ జరిగింది. దానికి నెహూౄ అధ్యక్షత వహించారు. నెహూౄ గారు సికింద్రాబాదులో స్పెషల్ రైలు ఎక్కుతూ వెంటఉన్న రామకృష్ణారావు గారితో "రామ్‌కిషన్‌రావ్, యే ఏలాన్ కర్నా హై" (రామకృష్ణారావు ఈ ప్రకటన చేయాలి) అని అన్నారట. ఈ విషయాన్ని గూర్చి రామకృష్ణారావుగారు అప్పుడు మధ్యప్రదేశ్ గవర్నరుగా ఉన్న డా॥ పట్టాభిసీతారామయ్యగారికి వ్రాసిన లేఖలో ఇలా తెలిపారు: "తాము ఆనాటి బహిరంగసభలో చేయబోయే ప్రసంగంలో విశాలాంధ్ర ప్రస్తావన తేవడం పరిస్థితికి దోహదం చేయగలదా అని పండిట్‌జీ నన్ను యథాలాపంగా సంప్రతించారు. అదే తగిన సందర్భమని నేను వారితో అన్నాను"* అలాగే సాయంత్రం రెండు లక్షల మంది ప్రజలు హాజరైన

---

భవన్స్ జర్నల్ (1967 అక్టోబరు 8 వ సంచికలో) కులపతి లేఖ.

డా॥ పట్టాభిగారికి రామకృష్ణారావుగారి లేఖ. మొదట పట్టాభిగారు ప్రశంసా పూర్వకంగా వ్రాయగా దానికి సమాధానంగా దీనిని రావుగారు వ్రాశారు.

బహిరంగసభలో విశాలాంధ్ర నిర్మాణానికి అనుకూలంగా కేంద్ర ప్రభుత్వం నిర్ణయం తీసుకున్నదని నెహ్రూ ప్రకటించారు. ఇది చరిత్రాత్మకమైన ప్రకటన.

హైదరాబాదు రాష్ట్రాన్ని భాషల వారీగా విభజించి, ఆయా భాగాలను ప్రక్కన ఉన్న భాషా ప్రాంతాలతో కలిపివేయవలెనని హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు మొట్టమొదటిసారిగా తీర్మానం చేసిన చోటు అయిన నిజామాబాదులోనే నెహ్రూగారు ఈ ప్రకటన చేయడం కాకతాళీయంగా జరిగినదనీ, నెహ్రూగారి ఈ ప్రకటనకు తెలంగాణావాదులు సైతం హర్షం వెలిబుచ్చారనీ, ఇప్పుడు వారు ఆ నిర్ణయంతో సమాధానపడ్డారనీ తెలుపుతూ రామకృష్ణారావుగారు ఇంకా ఇలా అన్నారు.

"ఆంధ్ర ప్రాంతాలనన్నిటినీ ఏకం చేయవలెనన్న ఆదర్శం నలభై ఏళ్ళకు పైబడిన కాలంనుంచే మనముందున్నది. ప్రకాశం, కాశేశ్వరరావు, మాడపాటి హనుమంతరావు మున్నగు ఎందరో పెద్దలు రాజకీయరంగంలోనూ, కవులూ, రచయితలూ సాహిత్యరంగంలోనూ ఈ ఆదర్శం కోసం కృషిచేశారు. ఇట్టి మహోద్యమానికి చివరి దశలో నేను కూడా నాకు చేతనైన సేవచేసే అవకాశం కలుగడం నా మహాభాగ్యంగా, ప్రత్యేక అదృష్టంగా భావిస్తున్నాను. దీనివల్ల నేను ఎన్నో ఇబ్బందులూ, క్లేశాలూ ఎదుర్కోవలసివచ్చినమాట నిజమే. కాని నా కర్తవ్య నిర్వహణలో నేను తొట్రుపాటుపడి సంకోచిస్తే, నేను నాపట్ల, నా దేశంపట్ల విశ్వాసం లేనివాడిగా ప్రవర్తించిన వాడినవుతానేమో అనిపించింది." గవర్నరు పట్టాభిగారు ఢిల్లీలో నెహ్రూగారితో సంభాషించి సంగతి సందర్భాలన్నీ తెలుసుకున్న మీదట రామకృష్ణారావుగారిని ప్రశంసిస్తూ విశాలాంధ్ర ఏర్పాటుకు మీరే ప్రధాన కారకులు (You are the Prime Cause for the formation of Visalandhra) అని వ్రాయగా, బూర్గులవారు పైన పేర్కొన్న విధంగా జవాబు వ్రాశారు.

ఈ నిజామాబాదులోనే నిజాం రాష్ట్ర ఆంధ్ర మహాసభ తొలిసారిగా ఒక రాజకీయోద్యమంగా రూపొందింది. రాజకీయమైన విషయంపై ఇక్కడే ఆంధ్ర మహాసభ ఒక తీర్మానాన్ని ఆమోదించింది. ఇక్కడే హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు మహాసభలో హైదరాబాదు విభజన జరిగి, ఆంధ్ర మహారాష్ట్ర

కర్ణాటక ప్రాంతాలను పొరుగున ఉన్న ఆ భాషా ప్రాంతాలతో కలిపివేయవలెనని తీర్మానించడం జరిగింది. తిరిగి అక్కడే 1956 లో భారత ప్రధాని నెహ్రూ విశాలాంధ్ర ప్రకటన చేశారు. బూర్గులవారు అన్నట్లు అదే తగిన తావు, సందర్భము.

ఈ విషయంలో రాజకీయ నాయకుల భావాలను అలా వుంచి, మిక్కిలి సమర్థుడైన సివిల్ అధికారి అని పేరు పొందిన సి. నరసింహం ఐ. ఎ. ఎస్. (రిటైర్డు)గారి అభిప్రాయాలు గమనించదగ్గవి. పెద్ద రాష్ట్రమైన ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పుడు ఆయన దాని హంగులను సమకూర్చే అధికారిగా మిక్కిలి సమర్థతతో పనిచేశారు. *

"అప్పుడు ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావు. ఆయన సర్వుల ఆమోదం పొందిన తెలంగాణా నాయకులు. ఉత్తమ సంస్కృతి, సభ్యత కలిగిన వ్యక్తి, బహు భాషావేత్త, తెలుగు, ఇంగ్లీషు, ఉర్దూ, హిందీ, మరాఠీ, కన్నడ భాషలలో చక్కగా ప్రసంగించగల వైదుష్యం కలిగినవారు. ఆయన మూర్తి చిన్నది. కాని మానవతా గుణాలు కలిగిన సౌజన్యమూర్తి. వివేకవంతుడు. హైదరాబాదులో అనేకులను ఆకర్షింపగలిగిన ప్రజ్ఞానిధి. తెలంగాణాను ఆంధ్రరాష్ట్రంతో కలిపివేసి, తెలుగు భాష మాట్లాడే ప్రజలందరినీ ఒక ఏకీకృత పాలన క్రిందికి తేవడంలో ఆయన నిర్వహించిన గుణాత్మకమైన, ప్రయోజనాత్మకమైన క్రియాశీల పాత్రకు యావదాంధ్రదేశమూ, ఆంధ్ర దేశానికి వెలుపల ఉన్న తెలుగు వారూ ఆయన కెంతగానో కృతజ్ఞులై ఉన్నట్లు భావించారు. ఆంధ్ర తెలంగాణాల ఏకీకరణకు అప్పట్లో మౌలానా అబుల్ కలాం ఆజాద్ వ్యతిరేకి అని అందరికీ తెలిసిన విషయమే. ఆజాద్‌గారు హైదరాబాదును ప్రత్యేక రాష్ట్రంగా ఉంచవలెనని పట్టుపట్టారు. హైదరాబాదు ఒక రాష్ట్రంగా తన అస్తిత్వాన్ని కోల్పోరాదనీ, దాని ప్రత్యేకతను ఆలాగే ఉంచాలనీ ఆయన గట్టిగా వాదించారు.

---

* సి. నరసింహం ఐ.ఎ.ఎస్. (రిటైర్డు)గారు వారి గ్రంథం 'మి అండ్ మై టైమ్స్'లో వ్రాసిన అంశాలు-1986 ప్రచురణ-దీని పంపిణీదార్లు రాణ్ణా కార్పొరేషన్, ప్రభుత్వ సెక్రటేరియట్ ఎదుట, హైదరాబాదు.

ఆజాద్ అంటే పండిత నెహ్రూకు విశేష గౌరవాభిమానాలు ఉండేవి. తెలంగాణాలో అధిక సంఖ్యాకులు విశాలాంధ్ర రాష్ట్రానికి అనుకూలంగా తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేసినప్పటికీ, ఆంధ్ర తెలంగాణాలు కలిసిపోయిన పెద్ద రాష్ట్రానికి ఆజాద్ సుముఖంగా లేరనీ, అలాంటి ప్రతిపాదనను ఆయన సమర్థించడంలేదనీ వదంతులు వ్యాపించి ఉండేవి. అయితే మౌలానా ఆజాద్‌గారి ప్రతిపాదనలో అంతర్గర్భితమై ఉన్న ప్రమాదాన్ని పసిగట్టి, అడుగడుగునా తన యావచ్ఛక్తినీ, పలుకుబడినీ, పేరు ప్రతిష్ఠలనూ ఉపయోగించి ఆంధ్రులందరి మేలును ఆశించి పెద్ద రాష్ట్రం అనే ఆదర్శానికి ప్రోదిచేసిన మహా రాజనీతిజ్ఞుడు బూర్గుల. ఆంధ్రప్రదేశ్ అనే పెద్ద రాష్ట్రం కొరకై రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం ముందు తెలంగాణాలోని ప్రజా సంస్థలు తమ మద్దతును ప్రదర్శించేట్టుగా ఆయన చేయవలసినదంతా చేశారు. గోపాలరెడ్డిగారు నాకీ విషయం చెప్పారు. (రెడ్డిగారు స్వయంగా బూర్గులవారు చెప్పగా విన్న విషయం ఇది.) ఒకరోజు బూర్గుల ఢిల్లీలో నెహ్రూగారి నివాసానికి వెళ్ళి ఆయన దర్శనం కోసం ఆయన చేంబర్ వెలుపల వేచి ఉన్నారు. చేంబర్‌లోపల ఆజాద్‌గారు బిగ్గరగా నెహ్రూ పండితునితో మాట్లాడుతున్నారు. మాట్లాడినంతసేపూ ఆయన బూర్గుల ముస్లిం వ్యతిరేక భావాలు కలవాడనీ, పక్షపాత దృష్టి కలవాడనీ నిందిస్తూ పోయారు. ముస్లిములు తమ ప్రత్యేకతను కోల్పోవనిష్టపడరనీ, నూతన రాష్ట్రంలోని పెద్ద జనాభాలో చిన్న శాతంగా ఉండే అల్పసంఖ్యాక వర్గంగా ఉండటానికి ముస్లిములు ఇష్టపడరనీ ఆయన అన్నారు. ఇలా అంటూ ఆజాద్ తమ సంభాషణలో బూర్గుల వారికి దురుద్దేశాలు అంటగట్టారు. దురదృష్టవశాత్తు బూర్గుల ఈ ప్రసంగమంతటినీ బైటినుంచి విని క్రుద్ధులైనారు. మౌలానాగారు నెహ్రూగారి ఛేంబర్‌నుంచి బైటికి వచ్చేస్తూ అక్కడ కూర్చొనిఉన్న బూర్గులవారిని చూచి దిగాలుపడిపోయారు. బూర్గులపై నిర్హేతుకంగా తాము చేసిన నిందారోపణనంతా ఆయన విని ఉంటారనికూడా గ్రహించారు. బూర్గులను చూచి 'హలో' అని పలుకరించకుండానే చకచకా నడిచి వెళ్ళిపోయారు. బూర్గుల ఆగ్రహావేశులై కూడా, ఆజాద్‌గారు వేసిన అభాండాలన్నీ విని సహించి ఊరకున్నారు. ఆయన అల్పస్థాయికి చెందిన నాయకుడు కాదు. ఎవరిముందూ దాసోహమనే మనిషికాడు. గాయపడ్డ సింహంవలె నెహ్రూగారి సముఖానికి వెళ్ళారు. తనపై వేసిన అభాండాలను గొంతెత్తి ఖండించారు.

అప్పుడు నెహ్రూ ఆయనను శాంతపరిచారు. మౌలానా మాటలు విని తానా ప్రవాహంలోపడి కొట్టుకుపోననీ, అవి ఒక వర్గంవారి అభిప్రాయాలుగా మాత్రమే తాను పరిగణిస్తున్నాననీ, అంతకు మించి మరేమీలేదనీ నెహ్రూ బూర్గులవారికి నమ్మకం కలిగే విధంగా చెప్పారు. మౌలానాగారు వెలిబుచ్చిన భయ సందేహాల నన్నిటినీ ఒక్కొక్కదానినే బూర్గుల సహేతుకంగా కూల్చివేసి, తెలుగు ప్రజలకు ఒకే పెద్ద రాష్ట్రం ఉండవలెనన్న తమ ప్రతిపాదనను గట్టిగా సమర్థించారు. హైదరాబాదు తిరిగివెళ్ళిన తరువాత రజాకార్ల భావాలు కలవారిని వదిలేసి, తెలంగాణాలోని ఇతర ముస్లిం వర్గాలను సమీకరించి, వారిని ప్రతినిధి వర్గాలుగా ప్రధానమంత్రి వద్దకూ, దేశ వ్యవహారాల మంత్రి గోవింద వల్లభపంత్ వద్దకూ పంపారు. యావన్మంది ప్రజల ప్రయోజనం దృష్ట్యా పెద్ద రాష్ట్రంకోసం విజ్ఞప్తి చేయడానికి ఈ ప్రతినిధి వర్గాలు ఢిల్లీ వెళ్ళాయి. ఈ కృషిలో హైదరాబాదు ప్రజల పౌరహక్కులకోసం నిరంతర సమరం జరిపిన స్వామి రామానంద తీర్థ బూర్గులవారికి మద్దతుగా ఉండి, వారిని గట్టిగా బలపరిచారు. 1946 లోనే స్వామీజీ అప్పటి మద్రాసు రాష్ట్రానికి ముఖ్యమంత్రియైన ప్రకాశంగారి వద్దకు ఒక ప్రతినిధివర్గ నాయకునిగా వెళ్ళి 11 జిల్లాల ఆంధ్రరాష్ట్రంతో సంతృప్తి జెంది ఉండక, వెంటనే విశాలాంధ్ర ఏర్పాటుకు పిలుపు ఇవ్వవలసిందని విజ్ఞప్తి చేశారు. ప్రకాశంగారు ఆ ప్రతినిధివర్గానికి కన్నెమరా హోటలులో విందు భోజనం ఏర్పాటు చేశారు. అక్కడ మంచి ఉత్తేజకరమైన ప్రసంగాలు చేయబడ్డవి. ఆ డిన్నర్‌కు ఆహ్వానింపబడ్డ వారిలో నేనూ ఒకడను. హాజరయ్యాను. గోవింద వల్లభపంత్‌కు ఒకే ఒక తెలుగు రాష్ట్రం ఏర్పాటుకావాలన్న తన భావాలపట్ల సానుభూతి ఉన్నట్లు బూర్గుల గ్రహించారు. పంత్ గారిని అనేక పర్యాయాలు కలిసి సంభాషించి, తీవ్ర భావాలుగల కొందరు వ్యక్తులచే మౌలానా ఏ విధంగా పెడత్రోవ పట్టింపబడినారో నిరూపించగలిగారు. అప్పుడు పంత్‌గారు నెహ్రూపై మౌలానా ప్రభావాన్ని విరుగుడు ప్రక్రియతో కొంత నిరర్థకం కావించి, భారతదేశపు నడిబొడ్డున మతతత్వ దృష్టిగల రాష్ట్రాన్ని ఏర్పాటు చేయడంవల్ల కలిగే ప్రమాదాలను గూర్చి ఆయనకు నచ్చచెప్పడంలో కృతకృత్యులైనారని ఆ రోజుల్లో అంతా చెప్పుకున్నారు. చివరకు ఆంధ్రప్రదేశ్ అనే విశాలరాష్ట్రం ఏర్పాటైనందుకు గట్టి కారకుడూ, వాద ప్రతివాదాలలో సమర్థుడూ, ధైర్యశాలీ, ఉత్తమ దేశభక్తుడూ అయిన తెలుగుబిడ్డ బూర్గుల రామ

కృష్ణారావుకూ, ఆయన కృషికి గుణాత్మకమైన మద్దతు నివ్వగలిగిన గోవింద వల్లభపంత్‌కూ ఆంధ్రులు సదా కృతజ్ఞులై ఉండవలసి ఉన్నది."

తెలుగు, కన్నడ, మహారాష్ట్ర, కాయస్థ, మహమ్మదీయ జనాభా కలసి ఉన్న మిశ్రమ హైదరాబాదు రాష్ట్రంలో పరిపాలనను దక్షతతో నిర్వహించిన బూర్గుల రామకృష్ణారావుగారి శేముషికి నరసింహంగారు ఘనంగా జోహార్లుకూడా అర్పించారు.

తొమ్మిది తెలంగాణా జిల్లాలకు రాజధానిగా ఉండేకన్నా, 20 జిల్లాల పెద్ద రాష్ట్రానికి హైదరాబాదు తగిన రాజధాని అని బూర్గుల భావించారు. వీరితో పూర్వం నుండి సన్నిహిత సంబంధం కల ప్రకాశంపంతులు వంటివారు 1946 నుంచే బూర్గుల విశాలాంధ్రకు సుముఖులని ఎరుగుదురు. ఒకవేళ తెలంగాణా ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడినట్లయితే కాంగ్రెసు పార్టీ మైనారిటీ పార్టీ అయిపోతుందనీ, ఆ ప్రభుత్వానికి స్థిరత్వం ఉండదనీ కూడా బూర్గులవారు ఢిల్లీ పెద్దలను హెచ్చరించారు. ఐదుమంది మెజారిటీతో అయిదేళ్ళు ప్రభుత్వాన్ని నడపగలిగిన నాయకుడే ప్రభుత్వ స్థిరత్వాన్నిగూర్చి మాట్లాడడానికి అర్హుడు. కేంద్రం ఆయన అభిప్రాయానికే విలువ ఇచ్చింది.

చివరకు తెలంగాణాకు కొన్ని రక్షణలతో ఆంధ్ర తెలంగాణాలను కలిపి ఒక పెద్ద రాష్ట్రంగా ఏర్పాటు చేయడానికి 1956 ఫిబ్రవరి 20వ తేదీన క్రొత్త ఢిల్లీలోని హైదరాబాదు గెస్టుహౌస్‌లో జరిగిన సమావేశంలో పెద్దమనుషుల మధ్య ఒప్పందం కుదిరింది. ఈ ఒప్పందంపై ఆంధ్రరాష్ట్రం తరఫున బెజవాడ గోపాల రెడ్డి, నీలం సంజీవరెడ్డి, గౌతు లచ్చన్న, అల్లూరి సత్యనారాయణరాజు గారలు, తెలంగాణా తరపున బూర్గుల రామకృష్ణారావు, కొండా వెంకటరంగారెడ్డి, జె. వి. నరసింగరావు, డా॥ ఎం. చెన్నారెడ్డి గారలు సంతకాలు పెట్టారు. ఈ ఒప్పందం కుదరడంలో గోవింద వల్లభ పంత్‌గారి కృషిని చరిత్రకారు లెవరూ విస్మరింప లేరు.

హైదరాబాదు శాసనసభ 1956 ఏప్రిలు 13న రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లును ఆమోదించింది. ఈ బిల్లును శాసనసభలో సమర్పించడంలో రామ

కృష్ణారావుగారు చూపిన వ్యవహార దక్షత ప్రశంసనీయమైనది. సభలో అన్ని భాషలవారికీ, అన్ని పార్టీల వారికీ అర్థం అయ్యేట్టుగా వారు ఉర్దూలో ప్రసంగించారు. తెలుగు తాలూకాలు, ఏవి ఆంధ్రప్రదేశ్‌కు రావలెనో స్పష్టం చేస్తూ సవరణలు ప్రతిపాదించారు. ఒరిస్సా, మద్రాసు రాష్ట్రాలవలె కాక ఇక్కడ ఒక్క తాలూకా కూడా ఆంధ్రులు నష్టపోకుండా జాగ్రత్త పడ్డారు. ఫలానా విషయంపై అసమ్మతి వ్యక్తమైందన్న అపకీర్తి రాకుండా అందరి సమ్మతితో ఏకవాక్యంగా బిల్లును ఆమోదింపజేశారు. కర్నూలు శాసనసభ ఏప్రిల్ 5వ తేదీన బిల్లును ఆమోదించింది.

ఈ విధంగా హైదరాబాదు రాష్ట్ర విచ్ఛిత్తి జరుగవలెనని నిర్ణయమై, ఔరంగాబాదు, నాందేడు, బీడ్, పర్భనీ, ఉస్మానాబాదు జిల్లాలను మహారాష్ట్రలో చేర్చుతూ, బీదరు, రాయచూరు, గుల్బర్గా జిల్లాలను కర్ణాటకలో చేర్చుతూ, ఖమ్మం, నల్లగొండ, వరంగలు, మహబూబ్‌నగర్, కరీంనగర్, నిజామాబాదు, మెదక్, ఆదిలాబాదు, హైదరాబాదు జిల్లాలను అప్పటికి ఏర్పడిఉన్న ఆంధ్ర రాష్ట్రంలో కలిపివేస్తూ, 1956 నవంబరు 1వ తేదీన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పాటు చేశారు. భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ స్వయంగా వచ్చి నూతన రాష్ట్రానికి ప్రారంభోత్సవం జరిపారు. ఇన్ని రాజకీయ సుడిగుండాలలోనుంచి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఆవిర్భవించింది.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డరోజే బూర్గుల రామకృష్ణారావుగారు ఏ పదవీలేకుండా అయిపోయారు. హైదరాబాదు ముఖ్యమంత్రి పదవి 1956 అక్టోబరు 31వ తేదీ వరకే ఉంది. ఆ తరువాత హైదరాబాదు రాష్ట్రమూ లేదు, వారి ముఖ్యమంత్రి పదవీ లేదు. ఈ విధంగా ఐచ్ఛికంగా స్వచ్ఛందంగా పదవీ పరిత్యాగం చేసిన ఉదాహరణలు మన దేశ రాజకీయ చరిత్రలో అరుదు. ఆంధ్రుల సమిష్టి ప్రయోజనం కోసం బూర్గుల ఈ త్యాగం చేశారు.

ఈ రాజకీయ సంఘటనపై వ్యాఖ్యానిస్తూ సి. నరసింహం గారు వారి మరొక గ్రంథంలో ఇట్లా వ్రాశారు.*

* 'వేర్ వి ఫెయిల్డ్' అనే ఆంగ్ల గ్రంథం-రచన సి. నరసింహం ఐ.ఎ.ఎస్. (రిటైర్డు) - 1988 ప్రచురణ. పంపిణీదార్లు :- రాడ్కా కార్పొరేషన్, 56-9-19/1, ప్రభుత్వ సెక్రటేరి యట్ ఎదురుగా, హైదరాబాదు.

"దేశభక్తి ప్రపూరితమైన ఆయన (బూర్గుల రామకృష్ణారావు) సేవలను మన రాజకీయ నాయకులు గుర్తించి, ప్రతిఫలంగా ఆయనను తగువిధంగా గౌరవించక పోవడం శోచనీయమైన విషయం. ఆయన హైదరాబాదు రాష్ట్రానికి ప్రజా ప్రతినిధులచే ఎన్నుకోబడిన మొట్టమొదటి ముఖ్యమంత్రి. ఆ పదవిలో ఆయన హైదరాబాదు రాష్ట్రం అంతరించిపోయేవరకూ అనగా 1956 అక్టోబరు 31 వ తేదీ వరకూ ఉన్నారు. నూతన రాష్ట్రమైన ఆంధ్రప్రదేశ్ నాయకత్వం తనకు చెందవలెనని అడిగే హక్కు ఆయనకుంది. అట్టి రాష్ట్ర ప్రథమ ప్రభుత్వానికి ఆధ్వర్యం వహించే హక్కు ఆయనకుంది. అయితే సాధారణంగా రాజకీయాలలో న్యాయం, ధర్మం సకృత్తుగా ఉంటాయి. అందువల్ల ఒక్కొక్కప్పుడు అన్ని విధాల అర్హులైన నాయకులుకూడా విడిచివేయబడుతూ ఉంటారు. ఆంధ్రప్రదేశ్ ప్రథమ మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయవలసిందిగా కాంగ్రెసు నాయకులు బూర్గుల వారిని ఆహ్వానించక పోవడాన్ని చూచి ఆశ్చర్యపడవలసిన దేమీలేదు. కాని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని సాధించడానికి చాలావరకూ ఆయనే బాధ్యుడు. కొత్త రాష్ట్రానికి 'ఆంధ్ర-తెలంగాణా' అనే పేరుకు బదులుగా 'ఆంధ్రప్రదేశ్' అనే పేరు నిర్ణయించడానికికూడా ఆయన అంగీకరించారు. తెలంగాణా ప్రజలు రాష్ట్ర నామమును నిర్ధారించడంలో తమ ప్రాంత పరిగణనను అభిలషించడం సహజం. తెలంగాణా ప్రజల ఈ అభీష్టానికి కూడా వ్యతిరేకంగా బూర్గుల అందుకు సమ్మతించారు. ఇదిగో ఇక్కడే మన వైఫల్యం ఒకటి ఉన్నది. పండిత నెహ్రూ విస్మరించరాని బూర్గులవారి పాత్రను గుర్తు పెట్టుకున్నారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పాటులోనూ, తెలుగు, ఉర్దూ, మరాఠి, కన్నడ వంటి బహు భాషలు మాట్లాడేవారున్న క్లిష్టమైన హైదరాబాదు రాష్ట్ర వ్యవహారాలను ఆ రాష్ట్ర ప్రజా ముఖ్యమంత్రిగా చక్కబెట్టడంలోనూ, అత్యంత ప్రధానమైన భూసంస్కరణలను అమలుపరచి ఇతర రాష్ట్రాలకు మార్గదర్శకంగా వ్యవహరించడంలోనూ బూర్గులవారు నిర్వహించిన పాత్ర అల్పమైనది కాదని నెహ్రూ గుర్తించారు. ఆయనకు అన్యాయం జరిగిందన్న యథార్థాన్ని గ్రహించారు. కాబట్టే భారత యూనియన్‌లో అన్నిటికన్న పెద్దదైన ఉత్తరప్రదేశ్ రాష్ట్రానికి ఆయనను గవర్నరుగా నియమించారు. (మొదట కేరళకు, ఆ తర్వాత ఉత్తరప్రదేశ్‌కు గవర్నరుగా నియుక్తులైనారు.) బహు గ్రంథ పఠనంచే ఎంతో పాండిత్యం, వైదుష్యం సముపార్జించిన బూర్గుల తమ సహజ వివేకంతో మానవ జీవితం

సాఫీగా ఉండదనీ, విధి అనేది పరిస్థితులతో కలసి కుట్రపన్ని మన ఆశలను, ఆశయాలను, కృషిని భంగపుచ్చుతుందనీ గ్రహించి, తదనుగుణంగా జీవితాన్ని సరిపెట్టుకున్నారు. కేరళ, యు. పి రాష్ట్రాల గవర్నరుగా కొంతకాలం పని చేసిన తరువాత రామృష్ణారావుగారు హైదరాబాదుకు తిరిగివెళ్ళి, శేషజీవితాన్ని రాజకీయాలకన్న మరింత ఆత్మతృప్తి నొసగగల సాంస్కృతిక, ఆధ్యాత్మిక వ్యాపకాలతో ప్రశాంతంగా గడిపారు." నరసింహంగారి ఈ గ్రంథంలో ఆంధ్రులు ఆంధ్రనాయకులు ఎక్కడెక్కడ పొరపాట్లు చేశారో, వారి వైఫల్యాలేమిటో చక్కగా వ్రాశారు. ప్రతి ఒక్కరూ చదవదగిన గ్రంథం ఇది.

ఈ విషయంపై ఎం. ఎస్. రాజలింగం గారు వారి వ్యాసంలో ఇట్లా వ్రాశారు.*

"రామకృష్ణారావుగారు తోటి కార్యకర్తలు ఎంత చెప్పినా వినక, ఏక గ్రీవంగా కోరుకుంటే తప్ప తాను ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి కాదలచుకోలేదని ప్రకటించారు. ఈ అవకాశాన్ని తీసుకుని చెన్నారెడ్డిగారు రామకృష్ణారావుగారి ముఖ్యమంత్రిత్వానికి అంగీకరించలేదు. తెలంగాణా వ్యక్తులు, వారి సాధన సంపత్తి ఆంధ్ర ప్రాంతం వారికి తెలియదు. కాబట్టి రామకృష్ణారావుగారి నాయకత్వం ఒక్క 6 నెలల వరకైనా అంగీకరించవలసిందని నేను ఆంధ్ర నాయకులను కోరాను".

రామకృష్ణారావుగారు కేరళ రాష్ట్ర గవర్నరుగా 1956 నవంబరు 22 నుంచి 1960 జూలై వరకు పనిచేశారు. వీరి హయాంలోనే ఇ. ఎం. ఎస్. నంబూద్రిపాద్ ముఖ్యమంత్రిగా ఉన్న కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వం బర్తరఫ్ చేయబడి, రాష్ట్రపతిపాలన విధింపబడింది. అయితే నంబూద్రిపాద్‌గారికీ రామకృష్ణా రావుగారికీ మధ్య సత్సంబంధాలు ఉండేవి. రావుగారి అనుభవాన్నీ, వివేకాన్నీ నంబూద్రిపాద్ ప్రశంసించి ఉన్నారు. కేరళలోని పండితులతో, నిర్మాణ సంస్థలతో రావుగారు సంబంధాలు పెట్టుకొని అచటి సంస్కృత సందేశ కావ్యాలను గూర్చి పరిశీలనాత్మక అధ్యయనం చేశారు.

---

* చెన్నారెడ్డి షష్టిపూర్తి సంచికలో.

ఆ తరువాత బూర్గులవారు 1960 జూలై 1 వ తేదీన ఉత్తరప్రదేశ్ గవర్నరుగా పదవిని స్వీకరించి 1962 ఏప్రిల్ 14 వరకూ ఆ పదవిలో ఉన్నారు. అక్కడ ఉండగా ఉర్దూ, హిందీ భాషలపై వీరికిగల ప్రభుత ఆ రాష్ట్ర వాసులను ఎంతో ఆకర్షించింది. సరోజినీనాయుడు తర్వాత గవర్నరుగా వీరు అచటి సాహిత్య సాంస్కృతికరంగాలలో మంచి పేరు తెచ్చుకున్నారు. వీరి హయాంలో లక్నో రాజ్‌భవన్ సాహితీపరులకు కేంద్రమై విలసిల్లింది. పోతన ఆంధ్ర మహాభాగవతంలోని రసవద్ఘట్టాలను గూర్చి రామకృష్ణారావుగారు హిందీ సాహిత్యవేత్తలకు చక్కని హిందీ భాషలో పరిచయం చేశారు. యు.పి. వారికి ఆంధ్ర మహాభాగవతం ఎంతటి భక్తిరస ప్రధానమైన రచనయో వీరివల్లనే తెలియవచ్చింది.

గవర్నరు పదవి నుండి విరమించుకున్న తరువాత రామకృష్ణారావుగారు 1962 మే 25 వ తేదీనుంచి 1966 ఏప్రిలువరకూ నాలుగేళ్ళు రాజ్యసభ సభ్యులుగా ఉన్నారు. అప్పుడు హెచ్చుగా గాంధీజీ నిర్మాణ కార్యక్రమంపై శ్రద్ధ చూపారు. రాజ్యసభ సభ్యత్వం ముగిసిన తరువాత వీరు ఒక లోక్‌సభ స్థానానికి పోటీ చేయదలచి టికెటు ఇప్పించవలసిందిగా కాంగ్రెసు అధిష్ఠానవర్గాన్ని అభ్యర్థించారు. కాని అప్పుడు ప్రాబల్యం వహించి ఉన్న రాజకీయాల దృష్ట్యా వీరికి టికెట్టు లభించలేదు. కేంద్రంలో సేవచేద్దామనుకున్నారు. కాని వీరి సేవలను వినియోగించుకోలేకపోవడం కాంగ్రెసు పార్టీ వైఫల్యమే.

# సాహితీవేత్త

ఒక సాహిత్యక చక్రవర్తి ప్రభువై
　　యున్నాడు మా రాష్ట్రి ల
క్ష్మి కటం బెంతయు పొంగి పోయెదను
　　నీ మేధావిలాసంబు లాం
ధ్రికి దివ్యా భరణముల్తై
　　తెలుగు ధాత్రిన్ వెల్గి, వెల్గించి భా
వికి వేరెట్లుగ మేలు కూర్చుచు
　　జన ప్రీతిన్ బ్రసాదించుతన్.*

బూర్గుల రామకృష్ణారావుగారు ప్రధానంగా సాహిత్యికులు. విద్యార్థి, లాయరు, ప్రజానాయకుడు, స్వాతంత్ర్య సమరయోధుడు, రాజకీయవేత్త, మంత్రి, ముఖ్యమంత్రి, గవర్నరు, పార్లమెంటు సభ్యుడు-ఈ దశలన్నిటిలోనూ ఆయన రచన చేస్తూ వచ్చారు. తెలుగు, ఉర్దూ, ఇంగ్లీషు, హిందీ, సంస్కృత భాషలలో రచనలు చేశారు. ఈయన లాయర్ కాకపోయినట్లయితే, రాజకీయ ప్రజా జీవితంలో అడుగిడక పోయినట్లయితే, సర్వేపల్లి రాధాకృష్ణన్ గారి వలె, అకడమిక్ రంగంలో—అనగా విద్యా పాండిత్య రంగాలలో ప్రముఖులయ్యేవారను కుంటాను. అన్ని భాషలలో రచన చేయకుండా, ఏ ఒక్క భాషలోనో కృషిచేసి ఉంటే ఆ భాషా రంగంలో జాతిరత్నం వలె ప్రకాశించేవారేమో! వారి జీవ యాత్రలో గ్రంథపఠనం, సాహిత్యాధ్యయనం, తోచినరచన చేయడం, నిత్యా భ్యాసాలుగా ఉండేవి. వ్రాసింది ప్రతీదీ ప్రకటించే అలవాటు వారికి ఉండేదికాదు. తమ ఆనందం కోసం వ్రాసుకొని, ఆత్మీయులైన కవి పండితులకు వినిపిస్తూ ఉండేవారు. రామకృష్ణారావుగారే ఎక్కడో ఒకచోట చెప్పుకున్నారు. "నాకు గూడా వ్రాసే గుణం ఉండి, ఏదో ఒకటి వ్రాస్తూ ఉండేవాడిని" అని. ఆ వ్రాసే

---

* దాశరథి గారి పద్యం.

గుణం జీవితంలో అంతిమ దశ వరకూ వారికి అలాగే ఉండిపోయింది. పాశ్చాత్యుల Man of letters అనే మాట వీరి విషయంలో పూర్తిగా సార్థకమైంది. తీరిక దొరికిందంటే అధ్యయనం, రచన వారికి అభిమాన వ్యాపకాలుగా ఉండేవి. కవి సమ్మేళనాలలో, చర్చాగోష్ఠుల్లో ఉత్సాహంగా పాల్గొనేవారు. "నేనూ మీ వాడినే" అని చెప్పకుండానే సాహితీ బంధువర్గంలో కలిసిపోయి, లాయరుగా, రాజకీయ నాయకునిగా తమకుగల ప్రత్యేక హోదా సంగతి మరిచిపోయేవారు. సాహిత్య సామ్రాజ్యంలో హెచ్చుతగ్గులు, సామాన్యులు గొప్పవ్యక్తులు అనే భేదాలకు తావు లేదన్నట్లుగా ప్రవర్తించేవారు.

బూర్గుల వారు వారి 16 వ యేటి నుంచే తెలుగులో కవిత్వం, వ్యాసాలు వ్రాయ మొదలుపెట్టారని చెప్పవచ్చు. పూనాలో చదువుకునేటప్పుడు సెలవుల్లో ఇంటికి వస్తే శారద, భారతి, సుజాత వంటి సాహిత్య పత్రికలు ఇష్టంగా చదివే వారు. తెలుగులో వెలువడుతూ ఉన్న రచనలతో మంచి పరిచయం కలిగిఉండే వారు. సంస్కృత భాషాధ్యయనం చేసేవారు. అమరము, శబ్దమంజరి, ధాతు రత్నావళి, గీతగోవిందము, మేఘసందేశము, రఘువంశము, శృంగార నైషధము పఠించేవారు. టాగూరు కవిత్వం, రాయప్రోలు, కృష్ణశాస్త్రి, ఉమరలీషా వంటి తెలుగు కవుల ఖండకావ్యాలు అభిమానంగా చదివేవారు. పూనా ఫెర్గుసన్ కాలేజీలో చదువుతూ ఉన్నప్పుడే ఇంగ్లీషులో కవితలు, కొన్ని సానెట్లు, ఆర్టు అండ్ క్రిటిసిజం వంటి వ్యాసాలు వ్రాసి కాలేజీ సంచికలలో ప్రకటించారు. 1920 - 22 మధ్య తెలుగులో ఖండకృతులు వ్రాసి "గోలకొండ పత్రిక" లో ప్రచురించారు. ఛందోబద్ధమైన రచనలివి. 1924 లో ఆంగ్ల కవి థామస్‌గ్రే ఎలిజీని "మృత సంస్మృతి" అను పేరుతో పద్యాలుగా ఆంధ్రీకరించారు.

ముఖ్యంగా 1920లో వీరి మొదటి భార్య మృతి చెందిన తర్వాత వీరికి రచనా వ్యాసంగంపై శ్రద్ధ హెచ్చింది. పుంఖాను పుంఖంగా రచనలు చేశారు.

చిన్నతనమ్మునన్ మురువు చేకుర పెండిలిసేసి రోలమై
కన్నెగ నైన నీవు నతికాలము నుండగలేదు, వెంటనే
పిన్న వయస్సులోనె మరి పిల్లలు గల్గి సుఖింపకూరకే
నన్నును పిల్లలన్ విడిచి నాకము చేరితె ప్రేయసీవెసన్.

పై భావాలనే ఆంగ్ల కవితలో ఇట్లా వెలిబుచ్చారు:

Alas, we were wed, a boy and a girl, a crimae
we were the others' Playthings, a queer show;
we grew and developed mysterious loves,
And lived for a time like a Pair of doves
I, a shy youth, and thou a sheer mate.
Thy hidden meaning; my immature skill
Could not clearly penetrate,
And thy maiden mind was a mystery to me.

మరొకకవిత—

O' when I bathed in the nectar streams of sweet smiles
O' when I swam through the lotus waves of bluish eyes
O' when I was master-bee of lotuses
O' when She was with me, She was with me.

—Burgula.

The Beacon Blaze, Saraswathi వంటి వీరి ఇతర కవితలపై సరోజినీనాయుడు, తోరూదత్ వంటి ఇండో-ఆంగ్లియన్ కవయిత్రుల ప్రభావం స్పష్టంగా కన్పిస్తున్నది. ఇవి వారి నూనూగు మీసాల నూతన యౌవనపు (teen-age) కవితా రచనలు. ఎవరో ఒక బైండులో తిరగవ్రాసి ఉంచారు. భార్యా వియోగానికి సంబంధించిన కోమల స్మృతులివి. అలా కొంత భావ కవిత్వం కూడా తెలుగులో వ్రాశారు. 1919-20 ప్రాంతంలో 'కన్నె కన్నులు' అనే ఖండ కృతి రచించారు. ఆంధ్ర ప్రాంతంలో వచ్చిన భావకవిత్వంచే ఆకర్షితులైనారు. భార్య పోయిన దుఃఖంలో దైవస్తుతి చేశారు.

బూర్గుల వారు రచించిన 'కృష్ణశతకము'ను హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తు 1956లో ప్రచురించింది. ఇవి కంద్య పద్యాలు. మచ్చుకు ఒక పద్యం :

జన సేవయె నీ సేవని
జనతా రాజ్యాధి భార జనిత క్లేశం
బున గ్రుంకు చుంటి నిత్యము
గని కరమున బరువు దింపి కావవె కృష్ణా.

ఈ శతకంలో విషయ వాంఛా వ్యామోహంతో చిక్కుకునే మానవ స్వభావాన్ని గూర్చి ఇట్లా అన్నారు :

ఏమి మనస్సో హరి హరి
స్వామిని బడద్రోసి స్వారి సలిపెడు గుర్రం
బేమో యనిపించును వడి
గామితముల వెంటబడుట గాంచిన కృష్ణా.

వీరు సంస్కృతంలో రచించిన శ్రీవేంకటేశ్వర సుప్రభాతమును బరంపురము గోల్కొండ వ్యాపారి శ్రీ వైష్ణవ సమాజంవారు 1958లో ప్రచురించారు. మనం రేడియోలో ప్రతి శనివారం వినే సుప్రసిద్ధ సుప్రభాతాన్ని దృష్టిలో ఉంచుకొని అదే మకుటంతో శ్లోకాలుగా రచించారు.

ఆ నమ్రచూత తరుషండ ముపేత్య కల్యే
పీత్వాఽ తిరుచ్య ఫలసార రసాత్మకావ్యమ్
పుంస్కోకిలాః శ్రవణ సుందర మాల వంతి
శ్రీ వేంకటా చలపతే తవ సుప్రభాతమ్.

వీటికి తెలుగు పద్యాలు కూడా వీరే 1955లో వ్రాశారు. ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు శృంగగిరి శారదాస్తుతి సంస్కృతంలో రచించారు. గౌరీస్తుతి, వాణీస్తుతి, లక్ష్మీస్తుతి కూడా వ్రాశారు. భావమంజరీ సంస్కృతంలో వ్రాశారు. కేరళలోని గురువాయూరు శ్రీకృష్ణ క్షేత్రాన్ని దర్శించినపుడు వీరు తెలుగులో శ్రీ కృష్ణాష్టకము రచించారు. ఒక పద్యం:

పచ్చని యాకు లేజిగిని
బారెడు నీటి పరాకు పాటలం
దచ్చపు వెండి వెన్నెలల
నామని బూచెడు పువ్వు నవ్వులో
బిచ్చుక గొంతులో నొరుల
బిచ్చము గోరెడు దీను నాల్కలో
సచ్చరితాళి శుద్ధమగు
స్వాంతములో గనిపింతు కేశవా!

బూర్గులవారి కృతులలో ప్రధాన గుణం వైష్ణవ సంప్రదాయ ప్రేరితమైన భక్తి ప్రపత్తులు.

రామకృష్ణారావుగారు విశ్వసాహిత్యంలో ప్రసిద్ధుడైన ఉమర్‌ఖయాం రుబాయీలను ఆంగ్లానువాదాల నుండి కాక నేరుగా ఫారసీ భాషనుంచే 101 రుబాయీలను తెలుగు పద్యాలుగా అనువదించారు. ఫారసీ, ఉర్దూ, సంస్కృతాంధ్రాంగ్ల అరబ్బీ భాషలలో చక్కని ప్రవేశం కలిగిన బూర్గులవారు పారశీక భాషయందు గొప్ప విద్వాంసులగుటచేత పీరి అనువాదం యథా మూలంగా ఒక వైశిష్ట్యంతో ఒప్పారుతున్నది. మచ్చుకు ఒక పద్యం:

సరసుడు మిత్రుడిష్టుడును
సన్నిహితుండొకరుండు లేక యెం
టరిగను భూమి గర్భమున
డాగి పరుండెదవెన్ని యేండ్లొ, సీ
ధు రసము ద్రావు మింపుగ, వ
ధూమణి తెల్పకు మీ రహస్యమె
వ్వరికిని, విచ్చబోదికను
వాడిన పుష్పమదెన్ని నాళ్ళకున్

బూర్గులవారూ, దువ్వూరి రామిరెడ్డిగారూ ఇద్దరూ ఫారసీ మూలం నుంచే ఉమర్‌ఖయాం రుబాయీలను అనువదించారు కాబట్టి పీరి అనువాదాల తులనాత్మక పరిశీలనం చేసి సాహిత్యికులు ఆనందించవచ్చు. రామకృష్ణారావుగారి ఈ అను

వాదాన్ని, వారి పెద్ద కుమారులు బూర్గుల రంగనాథరావు, పెద్దకుమార్తె ఇల్లిందల శ్యామాలాదేవిగారలు 1987 లో ప్రచురించారు. దీనికి డా॥ దివాకర్ల వెంకటావధానిగారు పరిచయం వ్రాస్తూ "రామకృష్ణారావుగారు నిరంతర రాజకీయ కార్యవ్యగ్రులయ్యు ఈ విధముగా సారస్వతసేవ కావించుట వారి సరస హృదయమునకును, భాషా సారస్వతాభిమానమునకును దార్కాణము. వారెంత పండితులో అంత కవులు ఎంత కవులో అంత మహావక్తలు. ఎంత ప్రతిభావంతులో అంత హృదయౌన్నత్య శోభితులు" అన్నారు. ఈ పుస్తక ప్రచురణలో ఒక విశేషమేమిటంటే - మొదటి విభాగంలో బూర్గుల వారి పద్యానువాదాలు, ఆ పిమ్మట ఫిట్జెరాల్డ్ తదితర ఆంగ్ల కవుల అనువాదాలు, తరువాత ఫారసీ మూలంలో ఉన్న ఉమర్ రుబాయీలు, వాటి తర్వాత వాటి ఉర్దూ వచనానువాదాలు అచ్చువేశారు. ఆంగ్లంలోకి భాషాంతరీకరణం చేసిన పాశ్చాత్యులు ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా ఉమర్ భావాలను ఆంగ్లంలోకి ఎలా తీసుకువచ్చిందీ మనం పరిశీలించడానికిది అవకాశం కలిగిస్తుంది. ఖయ్యాము జీవితాన్ని గూర్చి, ఆతని రచనలను గూర్చి ఉర్దూ విద్వాంసులు లతీఫ్‌ఖాన్‌గారు ఆంగ్లంలో మంచి ఉపోద్ఘాతం వ్రాశారు. పండిత పరిశోధకులకు మిక్కిలి ఉపయోగకరమైన ప్రచురణ ఇది.

రామకృష్ణారావుగారు ఫారసీ సాహిత్యంలోని సూఫీ సర్మద్ రుబాయతులను కూడా తెలుగు పద్యాలుగా అనువదించారు. ఇవి బహుకాలం క్రిందట కృష్ణా పత్రికలో ప్రచురింపబడ్డవి. 1987లో వారి కుమారులు బూర్గుల లక్ష్మీనారాయణరావుగారు వీటిని పుస్తకంగా ప్రచురించారు. ఒక్కొక్క పుటపై ఫారసీమూలము, ఉర్దూ వచనానువాదంతో పాటు బూర్గుల వారి పద్యం ఇచ్చారు. ఈ విధంగా 124 రుబాయతులతో ఈ పుస్తకం వెలువడింది. దీనికి మహమ్మద్ అబ్దుల్ లతీఫ్‌ఖాన్‌గారు సర్మద్ సూఫీ తత్వాన్ని వివరిస్తూ పీఠిక వ్రాస్తూ "మానవ జీవితపు అత్యున్నత పరిణామ దశకు ఈ రుబాయీలు వ్యాఖ్యాన ప్రాయమైనవి" అన్నారు.

జగన్నాథ పండిత రాయలచే రచింపబడిన లహరీ పంచకానికి బూర్గుల వారు 1959లో ఆంధ్ర పద్యానువాదం చేశారు. దీనిని ఆంధ్ర రచయితల సంఘం

ప్రచురించింది. లక్ష్మీలహరి, కరుణాలహరి, సుధాలహరి, అమృత లహరి, పీయూష లహరి అనే అయిదు లహరులను తెనిగించినవారు వీరొక్కరే. ఒక పద్యం :

అమర తరంగిణీ పులిన
మందు సుఖాసనముండి కన్నులం
దమరిచి యోగముద్ర విష
యమ్ముల దల్చి హరించి లోని సం
తమసము తత్సుఖాత్మక సు
ధారస నిర్ఝరినన్నవాంబుదో
త్తమరుచి జిత్కళన్ మునిగి
ధన్యుడ నౌటది యెన్నడో కదా!

శంకరాచార్యుల వారి సౌందర్యలహరిని వీరు 1962లో తెనిగించారు. శంకరాచార్యుల కనకధారా స్తవమునకు వీరు 1964లో ఆంధ్రానువాదం చేశారు.

వీరు వృత్తాలు, సీసములు, తేటగీతులు, ఆటవెలదులు, మత్తకోకిల, ద్విపదలు వ్రాశారు. చాటు పద్యాలు కూడా వ్రాశారు. నాటిక, ప్రహసనం, కథానిక వంటి ప్రక్రియలలో కూడా రచనలు చేశారు. అవి అచ్చు కాలేదు. వీరు వ్రాసిన రైతుగేయం ఇది :

దున్నరా నా తండ్రి
దున్నరా పొలము
దున్నపోతుల గట్టి
దున్నరా పొలము
ఎన్ని పైరూతేస్తె
అన్ని పంటలనిచ్చు
అన్నపూర్ణమ్మ నీ
కన్న తల్లేరా!
కన్న కష్టము జేసి
మన్ను బంగరుజేతు

వెన్ని జెప్పిననేమి?
అన్నదాతవు నీవు!

రామకృష్ణారావుగారు రచించిన పరిశీలనాత్మక సాహిత్యవ్యాసాలు కొన్నిటిని హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తువారు 'సారస్వత వ్యాస ముక్తావళి' అనే పేరుతో దుర్ముఖి నామ సంవత్సరంలో ప్రచురించారు. ఇందులో" నవీన వాఙ్మయము - యెంకి పాటయి" అనే వ్యాసం చదవదగింది. ఎంకి పాటలపై ఆంధ్ర దేశంలో దుమారం రేగినప్పుడు వ్రాసిన వ్యాసమిది. ఇందులో నవీన వాఙ్మయ లక్షణాలను చర్చిస్తూ సార్వజనీనత (Universality), సత్యాను కరణము (Realism), స్వాతంత్ర్యం (Freedom) దీని మూడు ముఖ్య గుణాలని చెప్పారు. మొదట భాష, తరువాత వ్యాకరణం, మొదట కవిత్వం, తరువాత లక్షణము పుట్టాయన్నారు. కవిత్వం లాక్షణికుల సొమ్మా? పండితుల సొమ్మా? అని ప్రశ్నించి, వాడుక భాషను వాఙ్మయము నందుపయోగించుట తప్పు కానేరదని ఘంటాపథంగా చెప్పారు. ఎంకి పాటలను విమర్శించిన పండితులను గూర్చి ప్రస్తావిస్తూ కవియొక్క అనుభవమందు ఇంచుకైనా పాల్గొనలేనిది విమర్శకుడు కాజాలడని స్పష్టం చేశారు. యెంకి నాయుడు పాత్రల ఉన్మీలనాన్ని గూర్చి చెబుతూ "కావ్యములోని అన్ని చిత్రముల సమన్వయము గావించినచో నాయికా నాయకు లనురూపులును, ననుకూలురునగు కృషిక దంపతులనియు, మొదట యౌవన చాపల్యమున నొకరి నొకరు నేమరించుచు, ప్రణయ కోపాది సహజ వికారములు జూపుచు, రానురాను భావములు పరిపక్వ దశనొంది, ఉత్తమ దంపతుల పవిత్ర ప్రేమ యొక్క లౌకికానుభవమును బొందియున్నారు" అని వ్రాశారు. ఎంకి పాటలు రసశబ్ద కల్పనముతో, భావ సౌకుమార్యముతో ధ్వని ప్రాధాన్యంతో విరాజిల్లుతూ ఉన్నాయని ఉద్ఘాటించారు. 19 పేజీలున్న ఈ వ్యాసం మొదట 1926 ఆగస్టులో గోలకొండ పత్రికకు వ్రాయబడింది.

ఈ వ్యాస సంపుటిలో చరిత్రవేత్తలు ఆసక్తితో చదివే పరిశోధనాత్మక వ్యాసం 'కాకునూరి అప్పకవి జన్మస్థానము'. ఇందులో అప్పకవీయము రచించిన అప్పకవి జన్మస్థానం తెలంగాణాలో మహబూబ్‌నగర్ జిల్లాలోని కాకునూరు అని బూర్గులవారు తేల్చారు. బూర్గులవారిది మహబూబ్‌నగర్‌కాబట్టి అలా తేల్చారని ఎవరైనా అనుకోవచ్చు. అది సరికాదు. కాకునూరు గ్రామం విషయంలో కొమ

ౡరాజు లక్ష్మణరావు పంతులుగారు, గిడుగు సీతాపతిగారు పొరబడినారని చెబుతూ రామకృష్ణారావుగారు చరికొండ సీమలో చేరిఉన్న కాకునూరు గ్రామం తమ జన్మస్థానమైన బూర్గులకు 6 కోసుల దూరాన ఉందనీ. బాలానగర్ స్టేషన్‌కు 8 కోసుల దూరంలో తూర్పు దిక్కున ఉందనీ అన్నారు. 1932లో వ్రాయబడ్డ ఈ వ్యాసానికి పండితులెవరైనా సమాధానం వ్రాశారో లేదో తెలియదు. బూర్గుల వారు మాత్రం గొప్ప పరిశోధకులైన కొమర్రాజువారినే ఢీకొన్నారు!

ఈ సంపుటిలో "రెడ్డిరాజుల కాలపు మత సంస్కృతులు" అనే వ్యాసం కూడా ప్రామాణికమైనది. ఇది 1947లో 'శోభ' మాసపత్రికలో ప్రచురింపబడింది. రెడ్డిరాజుల 150 సంవత్సరాల కాలపు మత సంస్కృతులను సోపపత్తికంగా శాసనాలు ప్రమాణంగా వివరించడానికి చేసిన ప్రయత్నమిది. "వైదికమత పునరుద్ధరణమునందు ఆంధ్రదేశమున రెడ్లు గావించిన సేవ యపారమైనది. ఇతర చారిత్రకాధారములెట్లున్నను వారి గుణకర్మ భావములను బట్టి నిర్వర్తించిన ధర్మమును బట్టి వారిని క్షత్రియులుగా పరిగణించుట యుక్తమగును" అని రామకృష్ణారావుగారు అన్నారు. ఆంధ్రుల సాంఘిక చరిత్రకు చిన్న అధ్యాయమని చెప్పదగిన ఈ వ్యాసం హెచ్చుగా సాహిత్యం ఆధారంగానే రచింపబడింది. ఈ వ్యాసం వారు వ్రాసేనాటికి మల్లంపల్లి సోమశేఖర శర్మగారి 'హిస్టరీ ఆఫ్ ది రెడ్డి కింగ్‌డమ్స్' కాని, రెడ్డి సంచికకాని వెలువడలేదని డా. బి. రామరాజుగారు అన్నారు.*

ఈ వ్యాస సంపుటిలో ఉర్దూ భాషా సారస్వతాలను గూర్చి, ఉమర్ ఖయ్యాం, సూఫీ సర్మద్‌లను గూర్చి చదవవలసిన వ్యాసాలున్నాయి.

రామకృష్ణారావుగారి 'సారస్వత వ్యాస ముక్తావళి' సంపుటిని చదివిన శ్రీశ్రీ 1956 జూన్ 8వ తేదీన ఇంగ్లీషులో వారికొక లేఖ వ్రాస్తూ 'ఇటీవల వచ్చే పుస్తకాలు ఒక ప్రమాణం లేకుండా ఉంటున్నాయి. వాటిని నేను చదవడం లేదు. పూర్తిగా ఈ అట్టనుంచి ఆ అట్ట వరకు నేను చదివిన పుస్తకం మీది

---

* 'భారతి'లో బూర్గులవారి భాషా సేవను గూర్చి డా. బి. రామరాజుగారి వ్యాసం.

ఒక్కటె. ఇటీవల అటువంటి పుస్తకం వెలువడలేదు. మీ వ్యాసాలు చాలా బాగున్నాయి. గాఢమైన మీ పాండిత్యం, ఉదార దృక్పథం నన్ను ఆకర్షించాయి. ముఖ్యంగా యెంకి పాటల మీద మీరు వ్రాసిన వ్యాసం ప్రశంసనీయమైనది. అయితే మీరు గ్రాంధికంలో కాక వ్యావహారికంలో ఈ వ్యాసాలను వ్రాసి ఉంటే బాగుండేది" అన్నారు.

ఈ ఉత్తరానికి బూర్గులవారు వ్రాసిన సమాధానంలో "నేను గ్రాంథికంలో వ్రాయలేదు. శిష్టవ్యావహారికంలో వ్రాశాను. నా శైలి అంతే" అని చెప్పారు. శ్రీశ్రీ లేఖ, బూర్గులవారి సమాధానం ఈ పుస్తకం చివర అనుబంధంలో ఉన్నవి.

నేటికి రమారమి అరవైయేళ్ళ క్రితమే బూర్గుల రామకృష్ణారావుగారు జేబున్నిసా జీవితచరిత్రనూ, ఆమె కవితా వైభవాన్నీ వివరించే వ్యాసమొకటి వ్రాశారు. కాని అది ఏ పత్రికలోగాని, వ్యాస సంపుటిలోగాని అచ్చు కాకుండా వ్రాతప్రతిగానే ఉండిపోయింది. అది శ్రీమతి సరోజినీదేవి అనే ఒక తెలుగు కవయిత్రి స్వేచ్ఛానుసరణంగా తెనిగించిన జేబున్నిసా గేయాల సంపుటిలో పీఠికగా అచ్చు అయింది. ఈ గేయసంపుటి 1982లో ప్రచురితమైంది. రామకృష్ణారావుగారి వ్యాసం సాహితీప్రియులూ చరిత్రకారులూ చదవదగి ఉన్నది.

తెలుగులో జేబున్నిసా అనే నాటకమొకటి ఉంది. దీని రచయిత పింగళి నాగేంద్రరావుగారు. ఈ నాటకం 1923లో కృష్ణాపత్రికలో మొదట ప్రచురింపబడినప్పుడు అయ్యదేవర కాళేశ్వరరావుగారు అది హిందూ మహమ్మదీయ సఖ్యతకు భంగకరమని అభిప్రాయం ప్రకటించారట. దానిపై ముట్నూరి కృష్ణారావుగారు మూడు సంపాదకీయ వ్యాసాలు వ్రాసి, ఈ నాటకంలో మతసఖ్యతా సందేశం కలదని ఉద్ఘాటించారు. ఔరంగజేబు కుమార్తె జేబున్నిసా గొప్ప విదుషీమణి. ఫారసీ భాషలో మంచి కవయిత్రి. ఈ కన్యాలలామను తండ్రి ఔరంగజేబు సలీంగర్ కోటలో నిర్బంధించాడనీ, అందుకు కారణం తండ్రికి ద్రోహంచేసిన అక్బర్‌షాతో ఆమె చెలిమి చేయడమేనని కొందరూ, మహారాష్ట్ర నాయకుడైన శివాజీపై ఆమెకుగల మక్కువ కారణమని మరికొందరూ చెబుతూ ఉంటారని రామకృష్ణారావుగారు వారి వ్యాసంలో తెలిపారు. మన తెలుగు నాటకం శివాజీపై ఆమెకు గల మక్కువనే కారణంగా తీసుకొని ఆమెను అత్యంతము ఉదాత్తంగా చిత్రించింది.

రామకృష్ణారావుగారు ఫారసీ సాహిత్యాన్నీ, చరిత్రనూ పరిశోధించి జేబున్నీసా వ్యక్తిత్వాన్ని గూర్చిన అనేకాంశాలను వారి వ్యాసంలో తెలియ పరిచారు. ఉర్దూభాషలోనే అంతమంచి వ్యాసం వెలువడలేదేమో. జేబున్నిసా కామినికాదు. హృదయంలో ప్రణయం నిండిఉన్న కవయిత్రి. సభ్యతకలది. తొందరపాటులేనిది. లాహోరులోని ఒక చిత్రపటాన్నిబట్టి రామకృష్ణారావుగా రామెను ఇట్లా వర్ణించారు. "రూపమున పొడవుగను, పలుచగనుండి, వట్రువ మొగము గలదియై తెలుపు వర్ణములో నుండెను. రెండు సౌందర్యతిల లెడమ చెక్కిలి నలంకరించుచుండెను. నల్లని కన్నులును పెద్ద వెంట్రుకలును, సన్నని పెదవులును చిన్న దంతములును కలిగి మిగుల సుకుమార స్వరూపిణియై యుండెను. దంతములకు దాచన, కండ్లకు కాటుక ఉపయోగించేది కాదు. మధుర స్వరముకలది గావున ఖురాన్‌ను పఠించువేళ వినువారలలో నానందా శ్రువుల జడి గురిపింపజేయుచుండెను, సుందరమైన దుస్తులు ధరించేది. కంఠమున నొక ముత్యాలహారము మాత్రము నలంకరించుచుండెను. తుర్కీ స్త్రీలు ధరించు పై దుస్తును దేశ వాతావరణ పరిస్థితులకు తగినట్లుగ మార్చి అంగ్యకుర్తియను పొల్కావలె నుండు దుస్తునొకదానిని ఆమె కనిపెట్టినది. మహమ్మదీయ స్త్రీలిప్పటికిని దానినే ధరింతురు. వినయ సంపన్నురాలును స్మిత ముఖియు, క్షమాశీలియునై సుగుణగుణ సంపన్నయై యుండెను." ఆమె ముఖ్య చెలికత్తెను గూర్చిన భోగట్టాకూడా ఈ వ్యాసంలో ఉంది.

జేబున్నిసా సూఫీతత్వజ్ఞానియనీ, వివాదగ్రస్తమైన ధార్మిక విషయములలో దారితేరిన పాండిత్యము కలిగినదనీ రామకృష్ణారావుగారు తెలుపుతూ, ఆమె కావ్యపంక్తులలోని భావాలను పద్యాలుగా అనువదించారు. కారాగృహ విముక్త యైన పిమ్మట ఆమె ఢిల్లీలో ఏకాంతంగా రోజులుగడుపుతూ విషాదభరితమైన పద్యాలు వ్రాసింది.

అకట మిత్రులు శత్రులంచనగనేల?
ద్రోహమొనరించినారని దూరనేల?
మొదటినుండి యదృష్టంబు ముక్కుద్రిప్పి
బొమలు ముడ్చుచునే యుండ పువ్వుబోణి!

* * *

ప్రణయవార్తల నెవరితో బల్కవలదు
నేకతమె ప్రేమమార్గాననేగవలయు
ఏసుడైనను సహచరు నేలజేయ?
సాహచర్యంబు వలదట్టి సంగతులను.

ప్రియునికోసం ఆమె ఎంత మనోవ్యథ చెందినదో ఈ పద్యంలో వెల్ల డించింది:

ప్రియుని లాలించక ప్రేలుబాహువులట్టె
తునకలై పోరాడె! మనగనేల?
నాథుజూడని వృథానయన మంధముగాక
తెరగ్రమ్మ నశ్రువుల్ గురియనేల?
సరసుని తేనివసంత శోభలవెల్ల
నవని శుష్కింపక మివులనేల?
ప్రియుని మకుటాన శోభింపని హృత్సుమం
బవనిగూలక విరియంగనేల?

జీవితాదర్శప్రాప్తికై జీవయాత్ర
దప్పనిలపైన నుసురులుదాల్పనేల?
అడవిబూసిన పుష్పమందవిసిపోయి
మంటిగలియక తీవపై మనగనేల?

జెబున్నిసా ఒక వారంరోజులుమాత్రమే జబ్బుపడి క్రీ. శ. 1689లో మరణించిందని రావుగారు తెలిపారు. ఆమె కోర్కెప్రకారం ఆమె శరీరాన్ని లాహోరు సమీపంలోని నవాబు కోటలోగల ఆమె పెంచిన ఉద్యానవనంలోనే సమాధి చేశారట. క్రీ. శ. 1724లో ఆమె రచించిన వాటిలో అంతరించకుండా దక్కిన కావ్యఖండికలను ఏర్చి కూర్చి, 'దివానెమక్ఫీ' అనే పేరుతో పండితులు వెలుగులోకి తీసుకొచ్చారు. 420 గజళ్ళు, మరెన్నో రుబాయీలు అందులో ఉన్నాయి. ఆ తరువాత ఆమెవి మరికొన్ని రచనలు లభించాయి. హిందూ

దేశంలో, ఇరాన్‌లో ఆమె కవితా సంకలనాల వ్రాత ప్రతులనేకముగా వెలువడ్డాయని రావుగారు తెలిపారు. ఈవిధంగా చారిత్రకాంశాలతో సాహిత్యంతో శాసనాలలో వ్రాయబడివున్న విషయాలతో చక్కని పరిశోధన వ్యాసాన్ని రచించడంలో బూర్గుల రామకృష్ణారావుగారు మంచి అభినివేశాన్ని, ప్రజ్ఞను చూపారు. ఈ విషయంలో వీరూ, సురవరం ప్రతాపరెడ్డిగారూ ఒకే లక్ష్యంతో కృషిచేశారు. న్యాయవాదవృత్తి కార్యభారం, ప్రజాహిత కార్యక్రమాల సంరంభం లేకపోయి నట్లయితే బూర్గులవారు మరెంతో సాహిత్యసేవ చేసేవారనుకుంటాను.

బూర్గులవారు తెలుగు భాషా సమితియొక్క 'తెలుగు సంస్కృతి' అనే విజ్ఞానకోశ సంపుటికి 'ఉర్దూ వాఙ్మయ పోషణము - బహమనీ, కుతుబ్‌షాహీ సుల్తానులు' అనే వ్యాసం వ్రాశారు. అచ్చుకాకుండా ఉన్న గద్య పద్యాత్మక రచనలు వీరివి ఎన్నో ఉన్నవి. కేరళలో గవర్నరుగా ఉండగా వీరు ఆంగ్లంలో చేసిన ప్రసంగాలను కేరళ ప్రభుత్వం **'Random Reflections'** అను పేరుతో పుస్తకంగా ప్రచురించింది.

అసలు సాహిత్యాన్ని గూర్చి, సాహితీపరులను గూర్చి రామకృష్ణారావు గారికి ఇదమిత్థమైన అభిప్రాయాలుండేవి. వాటిని ఆయన తరచు వెలిబుచ్చుతూ ఉండేవారు.

"ప్రపంచములో ఉత్తమ నాగరికతా లక్షణములలో ముఖ్యమైనది ఉత్తమ సాహిత్యము. యుగయుగముల చరిత్రను సూక్ష్మదృష్టితో పరిశీలించినచో ప్రపంచమునకు నాగరికతను ప్రసాదించినవారు సాహితీపరులేనని స్పష్టమగు చున్నది. జగత్తుయొక్క భూత, భవిష్యత్ వర్తమానములను ఊహా మాత్రమున సుస్పష్టంగా దర్శించగల శక్తి కవులకు కలదు. 'నానృషిః కురుతే కావ్యం' అని ప్రాచీనులన్నారు. ఈ రోజులలో గూడ కవులు విశ్వ శ్రేయస్సునకై రచనలుచేసి అతి సాధారణములైన విషయములలో సూక్ష్మ ధర్మాంశములను ప్రపంచమునకు ప్రసాదించి గొప్ప దార్శనికులుగాను, ద్రష్టలుగాను ఉపదేశకులు గాను సాక్షాత్కరించుచున్నారు. ఈ ఋషిత్వము ఏనాడు సారస్వతోపాసకుల యందు పుంజీభవించి కనుపించునో ఆనాడే సంపూర్ణముగా సాహిత్యసిద్ధి లభించును.

షెల్లీ మహాకవి వచించినట్లు కవులు, సాహితీపరులు శాసకులుగా భావింపబడవలెను. (Unacknowledged legislators of mankind) అను మాటను ఈ మహాకవి వాడియున్నాడు.........సారస్వతము విచిత్ర లీలలు కలది. కఠినములైన పాషాణముల నుండి పీయూషము స్రవింపజేయగల శక్తి సారస్వతమునకు గలదు. అట్టి సారస్వతమును సృష్టించువారు ఉత్కృష్ట రచయితలు. 'నిరంకుశాః కవయః' అను ఆర్యోక్తి ప్రకారము మేధావులైన కవివతంసులు స్వేచ్ఛా ప్రియులు. సాధారణ మానవునకు కనబడని సూక్ష్మతర విన్యాసములు కవి దృష్టికి గోచరించును. ఒక గడ్డి పరకలోనూ, ఒక వాడిన పువ్వులోను, ఒక జల బిందువులోను, ఒక జీర్ణ పర్ణములోను, ఒక రాతిలోను, ఒక అణువులోను, బ్రహ్మాండములోను మనము కనిపెట్టజాలని రహస్యములు కవులు కనిపెట్టుటయే గాక, వారు కనిపెట్టిన విషయమును సుస్పష్టముగాను, మనోరంజకముగాను చెప్పెదరు. సాహిత్యావలోకనము చేయునప్పుడు ఒక విశిష్టమైన భావము అందులో కనబడగా ఆ భావములు మనకెప్పుడో అవ్యక్తముగ అనుభూతికి వచ్చినట్లు మనము గమనించెదము. మన అనుభూతి లోనికి కూడా వచ్చు భావములు ఆ కవి లేక రచయిత యొక్క అనుభూతితో ఒక విశిష్టమైన స్వరూపమును పొంది సుందరమైన రూపమునుదాల్చి వ్యక్తమగును. ఇదియే కవి యొక్క ఉత్కృష్టత.

అయితే సాహిత్య రంగమున విహరించు రచయితలకు సహజముగా గల ఈ స్వచ్ఛందత కొన్ని నిబంధనలకు కట్టుబడి యుండును. మానవ కల్యాణము విశ్వశ్రేయస్సు ఆదర్శములుగా ఉండే సాహిత్యము మానవుని దుర్మార్గము నందు నడిపించుటకై ఉపయోగింపబడినచో అది ఉత్తమ సాహిత్యము కానేరదు. అది స్వచ్ఛందతకు అపార్థము. స్వాతంత్ర్య దుర్వినియోగము. కవి గానీ, రచయితగానీ మానవ శాంతిని విచ్ఛిన్నమొనర్చు రాజకీయ కక్షలకు బలికారాదు. విశ్వమానవ కల్యాణమను విశాలమైన ఆదర్శముతో, మహోత్కృష్టమైన ఫలమును సాధించే ఉద్దేశముతో రచనమును సాగించవలెను. కల్లోలితమైన నేటి లోకమునకు శాంతిని ప్రసాదించగల శక్తి ఉత్తమ రచయితల యందు గలదు. వీరు తమ రచనల మూలమున మానవ హృదయ కేదారములందు ప్రేమ సస్యము

లను మొలకెత్తించ గలరు. కలహకాంక్షను పోద్రోల గలరు. విశ్వశాంతికై పాటు పడగలరు.''*

ఈవిధంగా రామకృష్ణారావుగారు విశ్వశ్రేయః కావ్యమ్ అనే భారతీయ ఆర్యోక్తిని సమర్థించారు. ప్రపంచశాంతి కాపాడబడవలెననే అభ్యుదయ దృక్పథాన్ని సమర్థించారు. మానవులలో నుంచి కలహకాంక్షను పోద్రోల వలెననే శాంతికాముకుల ఆదర్శానికి నివాళులెత్తారు. బూర్గులవారి దృష్టిలో రవీంద్రులు, రాధాకృష్ణ పండితుడు, రోమారోలా, లిన్ యు టాంగ్, టాల్‌స్టాయి మున్నగు సాహితీ వేత్తలు మహర్షి ప్రాయులు.

రామకృష్ణారావుగారికి నచ్చిన సాహితీవేత్త సురవరం ప్రతాపరెడ్డిగారు. రెడ్డిగారిని అన్నగా భావించేవారు. ఆ శీర్షికతో ఒక వ్యాసం కూడా వ్రాశారు**.

బూర్గులవారి కంటె ప్రతాపరెడ్డిగారు మూడు నాలుగు సంవత్సరాలు పెద్దవారు. 1926 నుంచీ వీరిద్దరికీ పరిచయం, స్నేహం. నిజాం రాష్ట్ర ఆంధ్ర మహాసభ ప్రథమ సమావేశం ప్రతాపరెడ్డిగారి అధ్యక్షతన మెదక్ జిల్లా జోగిపేటలో జరిగింది. నల్లగొండజిల్లా దేవరకొండలో జరిగిన రెండవ సమావేశానికి బూర్గులవారు అధ్యక్షులు. ఆ విధంగా కూడా ప్రతాపరెడ్డిగారే వీరికంటె సీనియర్. గోలకొండ పత్రికద్వారా నిజాం నిరంకుశత్వంలో నలిగిపోతూ ఉన్న తెలంగాణా ప్రజలకు ప్రతాపరెడ్డిగారు విలువకట్టలేని సేవ చేశారని బూర్గులవారి నిశ్చితాభిప్రాయమై ఉండేది. అదీగాక తెలంగాణాలో కవులు రచయితలు లేరని ఎవరో పత్రికలో వ్రాస్తే ప్రతాపరెడ్డిగారు కుపితులై తెలంగాణము సాహిత్య దరిద్రతచే ఆవరింపబడిలేదని రుజువు చేయడానికై తెలంగాణములోని మారు మూలల్లో ఉన్న కవుల రచనలను సైతము సేకరించి 'గోలకొండ కవుల

---

* 1953 డిసెంబరు 12, 13 తేదీలలో హైదరాబాదులో జరిగిన తెలంగాణా రచయితల సంఘం వార్షికోత్సవాలలో రామకృష్ణారావుగారి ప్రారంభోపన్యాసము నుండి.

** స్రవంతి, జయనామ సంవత్సర మార్గశిర-పుష్యమాసములు, ప్రతాపరెడ్డి సంచిక.

సంచిక' అను పేరుతో ఒక కవితా సంకలనం (Anthology of Poetry) ప్రకటించారు. ఉర్దూ భాషా ప్రాబల్యంచే నలిగిపడి ఉన్నప్పటికీ ఆనాడు కూడా తెలంగాణాలో కవులు, రచయితలు ఘంటాపథంగా ఘోషించిన ఆ ఉదంతాన్ని రామకృష్ణారావుగారు తరచు జ్ఞప్తికి తెస్తూ ఉండేవారు. వీరిద్దరికీ సంపాదకునికీ-వ్యాసకర్తకూ మధ్య ఉండే సంబంధం ఉండనే ఉంది. ప్రతాపరెడ్డిగారి తెలుగు శైలి బూర్గులవారికి ఇష్టం. శబ్దజాల ప్రయోగంలో హైదరాబాదులో కన్పించే వైశిష్ట్యం రెడ్డిగారి శైలిలో ప్రతిఫలించి ఉండేది. వారి భావాలు నిశితమైనవి. భాష పాటవము కలది. ఆయన ఏది వ్రాసినా -శైలినిబట్టి రచయిత వారేనని వెంటనే పట్టి ఇచ్చేది.

గోలకొండ పత్రిక యావన్మందికీ పుణ్యతీర్థంగా ఉండేదనీ, ఆ తీర్థ ప్రజలో తానూ ఒకడినై ఉండేవాడిననీ బూర్గులవారు చెప్పుకున్నారు. ఇద్దరూ అక్కడ కలుసుకుంటే అనేక విషయాలు చర్చకు వచ్చేవి. గోలకొండ పత్రిక ఆంధ్రపత్రికతో దీటుగా, అంతకంటె కష్టమైన పరిస్థితిలో ప్రజాసేవ చేసిందని రామకృష్ణారావుగారి అభిప్రాయం. వ్యక్తి స్వాతంత్ర్యమే లేని ఆ చీకటి రోజులలో రెడ్డిగారి రచనలు దివ్య జ్యోతులని వీరన్నారు. జంకు గొంకులు లేక, నిర్భయంగా ప్రజాహిత వాదనం చేయడమే రెడ్డిగారి మతంగా ఉండేదట. ఏ విషయం స్పృశించినా విశిష్టత ఉండేది. ఆ రచన చదవగానే మేధ పనిచేసేది. కొత్త ఆలోచనలు కలిగేవి.

ప్రతాపరెడ్డిగారి సాహితీ. వ్యక్తిత్వాన్ని అంచెనాకడుతూ బూర్గులవారు స్పష్టమైన లక్ష్యం, వంకర లేని గురి, అమోఘమైన ప్రయోగం, విడుపులేని పట్టు, విశిష్టమైన సాధన - ఇవి ప్రతాపరెడ్డిగారి ప్రతిభకు వన్నె తెచ్చిన గుణాలలో కొన్ని అన్నారు. అంతేకాక తనకు కూడా వ్రాసే గుణం ఉండి వ్రాస్తూ ఉండేవాడిననీ, రచనయందు తనకు గల ఆసక్తిని ప్రోత్సహించి, ఎన్నో తమ రచనలకు కారకులైన ప్రతాపరెడ్డిగారు ఆ రీత్యా కూడా అన్నగారేననీ రామకృష్ణారావుగారు చెప్పుకున్నారు. తెలంగాణా సాహిత్య లోకంలో ఆనాడు కుల భేదాలు లేవనడానికి వీరిద్దరి మైత్రి, పరస్పర సద్భావం ప్రబలమైన దృష్టాంతాలు.

రామకృష్ణారావుగారు కొన్ని గ్రంథాలకు చక్కని పీఠికలు వ్రాశారు.

దాశరథిగారి 'గాలిబ్ గీతాలు'. ఉర్దూ మహాకవి గాలిబ్‌ను గూర్చి, ఉర్దూ కవిత్వంలో గజల్ ప్రకియను గూర్చి తెలుసుకోగోరే వారికి సుదీర్ఘమైన ఈ పీఠిక ఎంతో ఉపయోగపడుతుంది. మీర్, గాలిబ్, మోమిన్, హస్రత్ మున్నగు ఉర్దూ మహాకవుల రచనలు ఆంతరికానుభూతి ప్రధానములై, వ్యంగ్య ధ్వని పూరితములై, బాహ్యాభ్యంతరములగు నిరు తెగల భావనా పరంపరలను స్పృశించునవై ఉండి, ఉన్నత శ్రేణికి చెందుచున్నవని స్పష్టం చేశారు. గాలిబ్ ప్రత్యేకతను రాపుగారు చక్కగా విశదీకరించారు.

ఆత్మకూరి గోవిందాచార్యులవారి గోవింద రామాయణమునకు ఆంగ్లంలో పీఠిక వ్రాశారు.

కలుగోడు అశ్వత్థరావుగారు రచించిన అశ్వత్థ భారతమునకు తెలుగులో పీఠిక వ్రాశారు.

స్వామి ఆత్మానందగారి ఆంధ్రమేఘసందేశమునకు వీరు ప్రశంస వ్రాశారు. దానికి జటావల్లభుల పురుషోత్తం పీఠిక వ్రాశారు.

ఎస్. ఎన్. శ్రీరామదేశికన్‌గారు తిరుప్పావైకి చేసిన సంస్కృతానువాదానికి ఆంగ్లంలో పీఠిక వ్రాశారు,

చరిత్రవేత్త, రాజకీయ శాస్త్రాచార్యుడైన పద్మభూషణ్ ప్రొఫెసర్ హారూన్ ఖాన్ షెర్వానీ భారత రాజ్యాంగమును ఉర్దూలో రచించగా దానికి వీరు ఉర్దూలోనే పీఠిక వ్రాశారు.

డా॥ పోణంగి శ్రీరామ అప్పారావుగారి 'నాట్య శాస్త్రము' నకు పీఠిక వ్రాశారు.

రాఘవేంద్రరావు జజ్బ్ అనే తెలుగు-ఉర్దూ విద్వాంసులు సుమతి శతకాన్ని ఉర్దూలోకి అనువదించగా దానికి తెలుగు శతక వాఙ్మయంపై ఉర్దూలో విపులమైన పీఠిక వీరు వ్రాశారు.

కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి 'మరుత్తరాట్చరిత్ర' అను ప్రబంధానికి వీరు కృతిభర్త.

దాశరథిగారు వారి 'మహాబోధి' కావ్యాన్ని షష్ఠ్యంతములతో సహా వీరికి అంకితమిచ్చారు.

నారాయణభట్టు రచించిన నారాయణీయమును కల్లూరి సుబ్రహ్మణ్య దీక్షితులుగారు తెలుగు పద్యాలుగా అనువదించి, వీరిని కృతిపితగా చేసి కృతి కన్యను వీరికి దత్తతఇవ్వగా, వీరు తమ దత్తపుత్రికను గురువాయూరు శ్రీకృష్ణ నికి కన్యాదానం చేశారు.

పోతనామాత్యుని ఆంధ్ర మహాభాగవతములోని రసవద్ఘట్టాలను ప్రశం సిస్తూ హిందీలో వీరు వ్రాసిన ప్రసంగాలు పుస్తక రూపంగా వెలువడ్డాయి.

రామకృష్ణారావుగారు హైదరాబాదులో జరిగిన అఖిలభారత తెలుగు రచ యితల మహాసభలో అధ్యక్షోపన్యాసం చేశారు. ఈ సభ ప్రారంభకులు డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్.

బూర్గులవారు స్నాతకోపన్యాసాలిచ్చిన విశ్వవిద్యాలయాలు ఇవి :

1. గుజరాతు విశ్వవిద్యాలయము
2. లక్నో విశ్వవిద్యాలయము
3. ఉస్మానియా విశ్వవిద్యాలయము
4. కేంద్రీయ సంస్కృత విశ్వవిద్యాలయము.

రామకృష్ణారావు గారికి 1953లో ఆంధ్ర విశ్వవిద్యాలయం డాక్టర్ ఆఫ్ లిటరేచర్ గౌరవ పట్ట ప్రదానం చేసింది.

1956 నవంబరు 4వ తేదీన ఉస్మానియా విశ్వవిద్యాలయం వీరికి డాక్టర్ ఆఫ్ లాస్ గౌరవ పట్టమిచ్చింది.

రామకృష్ణారావుగారు బొంబాయిలో న్యాయశాస్త్ర విద్యార్థిగా ఉండి, ఒక మహమ్మదీయ ఉన్నత పాఠశాలలో పార్టుటైమ్ పర్షియన్ ఉపాధ్యాయులుగా పని చేస్తూ 'పారసీక వాఙ్మయ చరిత్ర' రచించారు. దీనిని వారు ప్రారంభయుగం, గజనీరాజుల కాలం, 500 హిజ్రీ ప్రాంతం, నవయుగం అనే అధ్యాయాలుగా విభజించారు. బహుకాలంగా అముద్రితంగా ఉండిపోయిన ఈ గ్రంథం త్వరలో తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణగా వెలువడ నున్నది.

# వీరి సేవపొందిన సంస్థలు

బూర్గుల రామకృష్ణారావుగారు ఈ దిగువ పేర్కొనబడ్డ సంస్థలకు సేవ చేశారు :—

1. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నియమించిన క్లాసికల్ లాంగ్వేజి డెవలప్‌మెంట్ కమిటీకి అధ్యక్షులుగా పనిచేసి తమ నివేదికను సమర్పించారు.
2. భారతీయ విద్యాభవన్, హైదరాబాదు కేంద్రానికి వీరు మొదటి అధ్యక్షులు.
3. తెలుగు - ఉర్దూ అకాడమీ అధ్యక్షులుగా -
4. బద్రుకా కాలేజి ఆఫ్ కామర్స్ అండ్ ఆర్ట్స్ బోర్డు ఆఫ్ గవర్నర్స్ అధ్యక్షులుగా -
5. ఉస్మానియా విశ్వవిద్యాలయ పాలక సంఘం అధ్యక్షులుగా -
6. సంగ్రహ ఆంధ్ర - విజ్ఞాన కోశ సమితి అధ్యక్షులుగా -
7. సంస్కృత విశ్వ పరిషత్తుకు వీరు ఉపాధ్యక్షులుగా వ్యవహరించారు.
8. మౌలానా అబుల్ కలాం ఆజాద్ ఓరియంటల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్, హైదారాబాదు యొక్క అకడమిక్ బోర్డుకు అధ్యక్షులుగా పనిచేశారు.
9. గాంధీభవన్ ట్రస్టులో వీరొక ట్రస్టీగా ఉన్నారు.
10. కౌన్సిల్ ఆఫ్ సంస్కృత్ ఎడ్యుకేషన్, హైదరాబాదుకు అధ్యక్షులుగా ఉన్నారు.
11. స్వామి రామానందతీర్థ షష్ట్యబ్ది ఉత్సవాల కమిటీకి చైర్మన్‌గా ఉండి, చక్కని సంచికను ప్రకటింపజేశారు. (1963)
12. భారత్ సేవక్ సమాజ్, ఆంధ్రప్రదేశ్ శాఖ అధ్యక్షులు.
13. "గాంధీజీ ఇన్ ఆంధ్రప్రదేశ్" అను పేరుతో ఏర్పాటు చేయబడ్డ సమితికి వీరు చైర్మన్.
14. ఖాది మరియు గ్రామీణ ప్రరిశ్రమల కమీషన్ యొక్క వర్కింగ్ గ్రూప్‌కు చైర్మన్‌గా పనిచేశారు.
15. హైదరాబాదు ఖాదీ సమితికి బోర్డు ఆఫ్ ట్రస్టీస్ సభ్యులుగా ఉన్నారు.
16. దక్షిణ భారత హిందీ ప్రచారసభ, మద్రాసుకు ఉపాధ్యక్షులుగా ఉన్నారు.

# కొన్ని ప్రశంసలు

"రామ్‌కిషన్‌రావుగారు బహుభాషావేత్త, సూక్ష్మగ్రాహి. ప్రతి విషయమును చురుకుగా గ్రహించువారు. సమర్థుడు, ధైర్యశాలి. వారికి లభించిన ప్రతి పదవిని సమర్థవంతంగా నిర్వహించారు. వారు ప్రతి రంగములోను ప్రజోపయోగకరమైన పనిచేసి ప్రశంసలకు పాత్రులైనారు. వీరు నా ఆత్మ మిత్రులు".

**—కొండా వెంకటరంగారెడ్డి**

( వారి "స్వీయ చరిత్ర" లో )

* * *

"1952 లో సార్వత్రిక ఎన్నికల తర్వాత బూర్గుల ముఖ్యమంత్రిగా కాంగ్రెసు మంత్రివర్గం హైదరాబాదులో ఏర్పడింది. రావుగారు మంత్రిమండలిలో వివిధ గ్రూపుల మధ్య సమతూకాన్ని నిలబెట్టుకుంటూ రావడమేగాక, రాష్ట్ర పరిపాలనను ఐదేండ్లపాటు మిక్కిలిసమర్థతతో నిర్వహించారు. ఆయన పరిపాలనా కాలంలో ప్రజా సంక్షేమం కొరకై అనేక అభివృద్ధి కార్యకలాపాలు చేపట్టబడ్డవి. ఆంధ్ర నాయకుడైన బూర్గుల హైదరాబాదుకు మొట్టమొదటి, చిట్టచివరి ముఖ్యమంత్రి. అయన నాయకత్వాన హైదరాబాదు ప్రభుత్వం హైదరాబాదు రాష్ట్ర విచ్ఛిత్తికి మార్గాన్ని సుకరం చేసి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర స్థాపనకు బాట వేసింది".

**—కృష్ణాచార్య జోషి**

( స్వామి రామానంద తీర్థ షష్టిపూర్తి సంచికలో )

* * *

"వారి జీవితము ప్రతిభకు పట్టుకొమ్మ, ఔదార్యమున కానీన భూమి. వైదుష్యమునకు విహారసీమ. రాజనీతి వేత్తృతకు రంగభూమి. భక్తికి నిలయము. రసజ్ఞతకు రాణివాసము. సంస్కృతి సామరస్యములకు జన్మస్థలము. ఆంధ్రుల కనవరతారాధ్యము.

**—డా॥ దివాకర్ల వెంకటావధాని**

( స్రవంతి, బూర్గుల స్మారక సంచిక, నవంబరు 1967, వ్యాసంలో )

* * *

# ముగింపు

రామకృష్ణారావుగారి చివరిదశలో వారి ఆరోగ్యం క్షీణించింది. కృశించి పోయారు. అయినా ఏ ఆసుపత్రిలోనూ చేరలేదు. ఇంట్లోఉండే చికిత్స పొందుతూ వచ్చారు. భగవన్నామ స్మరణం చేసుకుంటూ, శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే" అనుకుంటూ, కుటుంబ సభ్యులకు చెప్పవలసినవి చెప్పి, 1967 సెప్టెంబరు 14వ తేదీ రాత్రి 11-30 గంటలకు (ప్లవంగనామ సంవత్సర భాద్రపద శుద్ధ ఏకాదశి, గురువారం) బర్కత్‌పురాలోని స్వగృహంలో దివంగతులైనారు. ఆంధ్రావని ఒక తేజోమూర్తిని, మహా ప్రతిభాశాలిని కోల్పోయింది.

చిత్రమేమిటంటే ఇటువంటి ఆంధ్ర మహాపురుషునికి, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర నిర్మాతకు, ఆనాటి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రభుత్వ లాంచనాలతో అంత్యక్రియలు జరిపించలేదు! ఒక సామాన్యునివలె ఆయన వెళ్ళిపోయారు. ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఆ మరుసటిరోజు (సెప్టెంబరు 15) ఆయన మరణం పట్ల ప్రగాఢ సంతాపాన్ని ప్రకటిస్తూ ఒక తీర్మానాన్ని ఆమోదించి, మరెట్టి కార్యక్రమాన్ని నిర్వహించకుండానే వాయిదా పడింది. ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి ఈ తీర్మానాన్ని ప్రతిపాదించారు. కాంగ్రెసు గ్రూపు రాజకీయా లలో రామకృష్ణారావుగారికి ప్రత్యర్థి అయిన వి. బి. రాజుగారు ఆ రోజు శాసన సభలో ప్రసంగిస్తూ ఆయన అజాతశత్రువు అన్నారు. ప్రభుత్వ భవనాలపై పతాకాలు అవనతం చేయబడ్డవి. గోల్కొండవంటి రాజ్యమూ, మాదన్నవంటి మహామంత్రి తిరిగి ఆంధ్రులకు లభించనట్లే, బూర్గుల రామకృష్ణారావు వంటి బహుభాషావేత్తయైన మేధావి, సాహితీప్రియుడు, రాజనీతిజ్ఞుడు, సమ్యగ్ దృష్టి గల వ్యవహారదక్షుడు. సర్వ సంప్రదాయాలనూ సమంగా ఆదరించిన సంస్కార పరుడు, సర్వప్రియుడు, ధైర్యశాలి, త్యాగి తెలుగుదేశానికి మళ్ళీ లభిస్తాడా? ఏమో! ఎన్నాళ్ళకో?



# బూర్గుల రామకృష్ణారావుగారికి
# శ్రీశ్రీ వ్రాసిన లేఖ

SRI SRI

Madras
8-6-1956

**S. Srinivasa Rao,**
10-Arunagiri Mudali Street,
Mandaveli, Madras-21

To
**Sri B. Ramakrishna Rao,**
Chief Minister,
Hyderabad.

Dear Sir,

I have received a copy of your collected literary essays kindly sent by your publishers. This is one of the Telugu books which I have read from cover to cover in recent times. When so much trash is being published nowadays, it is really heart - warming to come across works like your own. Your deep erudition, mellowed by a liberal outlook has impressed me most. I am not competent to comment on your studies of the Urdu poets. But I can confidently assert that what you have said about yenki patalu has been very well said. Perhaps (If I am permitted an honest opinion) it would have been better said if only you had adopted Vyavaharika style. I hope you will give your serious attention to this remark of mine.

I thank you for a couple of hours of good reading.

Sincerely yours,
**SRI SRI**

# బర్గులవారి సమాధానం

19th June, 1956.

Dear Shri Srinivasa Rao Garu,

Many thanks for your letter dated 8th June. It is highly complimentary to me to receive an appreciative letter in respect of my Telugu literary essays published by the Andhra Saraswata Parishat, from a talented writer like yourself. These essays were written for publication long ago; in fact some of them 30 years ago. A few of them were published in the local papers here. In those days, I used to have some time to study and digest books on history, philosophy, literary criticism and essays. During recent years, however, having fallen into the vortex of active politics, I have had to deny myself of that pleasure. Still I try to keep myself abreast with writings of others and sometimes, though very rarely, indulge in writing something myself. I note your observation regarding my own style. I may assure you that it has changed considerably since the last 30 years and is approximating more to, what is called, 'SHISHTA VYAVAHARIKA' style.

Thank you once again for your kind letter of appreciation.

Sincerely yours,

(Sd/-)

(B. RAMAKRISHNA RAO)

Sri S. Srinivasa Rao,
10, Arunagiri Mudali St.
Mandaveli, Madras-21.